# దుర్గ బంధితుడు

(THE PRISONER OF ZENDA)

అనువక్త:

సి. వి. రామరావు.

# దుర్గ బంధీ

(THE PRISONER OF ZENDA)

by

ANTHONY HOPE.



అనువక్త:

సి. వి. రామరావు,

అధ్యాపకుడు,

శ్రీ సాయిబాబా జాతీయోన్నతపాఠశాల, అనంతపురము.



ఆత్మారాం అండ కో.,

రిజిష్టర్డు ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,

అనంతపురము.

ఈ పుస్తకమును అనువదించుటకు అనుమతి నిచ్చిన ఆక్సుఫర్డు యూనివర్శిటీ ప్రెస్ వారికి మేము కృతజ్ఞులము.

— ప్రకాశకులు.

మూల్యము రు. 2-8-0

# INTRODUCTION.

Sri C. V. Rama Rao, the author of 'Durgabandhitudu' is not a stranger to the world of present day Telugu Prose Literature as he has already made his name with his translation of Pearl Buck's 'The Good Earth' under the title 'Sukshethram.' He writes in an elegant, flowing style and his language is simple and easily understood by an average High School student. I had the pleasure of going through the present work in manuscript and found it very interesting from start to finish.

'Durgabandhitudu' is a free translation of Anthony Hope's 'The Prisoner of Zenda' in its abridged and simplified form published by the Oxford University Press. Hope is an English Novelist who was born in 1863 and died in his seventieth year in 1933. He has written several novels, but according to competent authorities 'The Prisoner of Zenda' is the one novel that entitles him to lasting fame. This novel is a story in which romance and adventure are closely intermixed in an amazing plot which grips the attention and sustains the interest of its readers. Sri C. V. Rama Rao deserves to be congratulated on the selection he has made for translation and in the efficient manner in which he has executed the work of translation.

From the point of view of both quantity and quality 'Durgabandhitudu' is very well suited for non-detailed study in the High School classes. It is my earnest hope that the authorities concerned will appreciate the merits of the book and accord it the recognition so that the author may be encouraged to make further contribution to Telugu Literature in the interest of the young.

Anantapur,
Dec. 1953.

**(Sd) M. Lakshminarayana Rao,**
*Retired District Educational Officer.*

# మున్నుడి

ఆంథొనీ హోప్ ప్రసిద్ధులగు ఆంగ్ల నవలారచయితలలో నొక్కడు. ఇత డనేక నవలలను వ్రాసియున్నాడు. కాని వానిలో నెల్ల "ది ప్రిజనర్ ఆఫ్ జండా" (The Prisoner of Zenda) ఉత్తమమైనదని ప్రామాణికాభిప్రాయమై యున్నది. ఇందులోని కథావస్తువును దాని నిర్వహణమును చాల ఆకర్షణీయముగ నున్నందున నేనీ నవల ననువదింప పూనుకొంటిని. భాషాంతరీకరణమున నెంతవఱకు కృతకృత్యుడనైతినో చదువరులే నిర్ణయింప నర్హులు.

నా యీ ప్రయత్నమున పలువురు సాయపడియున్నారు. శ్రీ వై. నరసింహమూర్తిగారు 'జండా కోట ప్లాను' ను గీచి యిచ్చుటేకాక, ఆంగ్లమున నుండిన పేర్ల నన్నిటిని తగురీతిగా బ్లాకున నమర్చిరి. శ్రీ జె. యస్. భీమసేనరావు, బి.ఏ., బి.ఇడి., గారప్పుడప్పుడు చక్కని సలహాల నొసంగిరి. ఈ విధముగ నాకు తోడ్పడిన వీరిరువురు నా సోదరోపాధ్యాయులే. వీరికి నమస్కారములు తప్ప నేనేమి యివ్వగలను?

దీనికి పరిచయవాక్యములను వ్రాసియిచ్చిన పెద్దలు శ్రీ యం. లక్ష్మీనారాయణరావుగారికిని, దీని నచ్చొత్తించుటకు పూనుకొని ప్రోత్సహించిన ఆత్మారాం అండ్ కో., వారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

విజ్ఞు లేవైన లోపముల జూపిన రెండవ ముద్రణమున సవరించుకొందును.

— అనువకర్త.




# జెండా కోట ప్లాను

రా:- రాసిండేల్ నిలబడిన మూల. ప్ర. భేనడవ. త :- ద్వారములు బ.- బైఠాయిగ
ది. కి :- కిటికి. ఆం:- అంటూశెట్ గది. షై. షైకేలుగది. సో. బందీగదికి మెటికెలు.
సో:- బందిగదికి మెటికెలు. సో.వ:- ఈడ్పువంతెనద్వారమునుండి కందకమునకు మెటికెలు.

నా పేరు రూడాల్ఫ్ రాసిండల్. నే నొకనాడు మా వదినె (రాబర్టు భార్య) రోజ్‌తో లాడనులోని యామె గృహమందలి యొక గదిలో కూర్చుండి సంభాషించుచుంటిని. ఆ సంభాషణాంశముల వివరించుటకు మున్ను రాసిండల్ - ఎల్ఫ్‌బర్గ్ వంశముల చరిత్రను కొంత చెప్పవలసి యున్నది. లేకున్న నాలో ఎల్ఫ్‌బర్గ్ రక్తము ప్రవహించుటకు కారణ మవగతము కాదు.

అది 1733వ సంవత్సరము. మా పూర్వీకులలో నొక డగు జేమ్సు అనునతడు (22వ రాసిండల్ — 5వ బర్ల్సడన్ ప్రభువు) రురిటేనియాలో బ్రిటిష్ రాయబారిగా నుండెను. అప్పటి రురిటేనియాపాలకుడు మూడవ రూడాల్ఫ్. ఆతడు ఎల్ఫ్‌బర్గ్ వంశీయుడు. రురిటేనియాను ఆవంశమువారే యెన్నియో తరములనుండి నేటివఱకు — మధ్యలో కొంతకాలము తప్ప - పాలించుచున్నారు. జేమ్సు రాయబారిగా నియమితు డగుటకు కొలదికాలము వెనుకనే, రూడాల్ఫ్ చెల్లెలు అమీలియా రాకుమారికిని యూరోపులోని పురాతన ప్రముఖ రాజకుటుంబమునకు జెందిన యొక రాకుమారునకును వివాహము నిశ్చయమై యుండెను.

అమీలియా రాకుమారి పొడుగరి. అందగత్తె. పొడవై కొనదేరిన ముక్కు, మిక్కిలి యెఱ్ఱనైన అందమగు కురులు ఆమె విశిష్ట లక్షణములు. నిజమున కీ వెంట్రుకలు ముక్కు రెండును ఎల్ఫబర్గ్ వంశీయుల ప్రత్యేక లక్షణములు. వివాహమునకు కొన్ని వారముల వెనుకనుండి అమీలియా రాకుమారికిని బ్రిటిషు రాయబారి జేమ్సునకును గాఢస్నేహ మేర్పడెను. ఆమె నివాసమున కాతని రాకపోకలు విశేష మయ్యెను. దీనిని గూర్చి కొందఱు గుసగుస లాడ జొచ్చిరి. మరుసటిరోజు వివాహమనగా అమీలియా బ్రిటిషు రాయ బారితో లేచిపోయి పొరుగుననున్న దేశము చేరి యందొక చిన్న పట్టణమున నాతని వివాహమాడెను. ఈ సంఘటన రురిటేనియా దేశీయులనే కాక, యూరోపులోని ప్రతి రాజ్య మును, బ్రిటనులోని ప్రతి శ్రీమంత కుటుంబమును ఆశ్చర్య మున ముంచెను. జేమ్సు కొలదికాలము తరువాత తన ప్రియురాలి తోగూడ ఇంగ్లండులోని తన నివాసమున కేతెంచెను. అమీలియా యుత్తమవంశ సంజాతయే యైనను ఈ వివాహము మా వంశమునకు మాయనిమచ్చయై యపవాదమునకు కారణ మైనందున మావారి కామె క్షంతవ్య కాలేదు. అందులో విశేషించి మా వదినె కామెయెడ మిక్కిలి కోపముండెను.

ఈ వివాహ కారణముగ మా రాసెండల్ వంశీయులలో గూడ కొందఱికి ఎల్ఫబర్గ్ వంశీయుల ప్రత్యేక లక్షణములగు ఎఱ్ఱని కురులు పొడుగాటి ముక్కు సంక్రమించినవి. అట్టి

వారిలో నేనొక్కడను. ఉండనిండు. ఇక మా సంభాషణకు వత్తము.

రోజ్: రూడాల్ఫ్! నీవేదైన పనిచేయు టెప్పుడైన సంభవించునా యని నా సంశయము.

నేను: నే నేల పనిచేయ వలయును? నాస్థితి నాకు తృప్తికరముగ నున్నది. సంతోషముగ కాలము వెళ్లబుచ్చుచున్నాను. సంఘములో నాకున్నస్థాన మిర్ష్యాహేతువు. నేను బర్ల్స్టడన్ ప్రభువు సోదరుడను. ఆతని అందాలరాణికి మఱదిని. అంతే చాలును.

ఆమె: నీకిప్పు డిరువది తొమ్మిదేడులు. నీవు చేసినదేమి?

నేను: సోమరిగానుండుట తప్ప. నిజమే. మా వంశీయులేమియు చేయ నక్కఱలేదు.

ఆమె: ఇతరులకంటె ఉన్నతవంశీయులే ఈ విషయమున చాల వఱకు అధ్వానము.

పైన నేను వివరించిన సంఘటనమును (మా వంశమునకుండు కళంకమును) గూర్చియే ఆమె ప్రస్తావించుచున్నదని నే నెఱుగుదును. ఇంతలో మఱల నామె 'కాని రాబర్ట్ వెంట్రుకలు నల్లగా నున్నందున నాకెంతో సంతోషముగ నున్నది.' అనెను.

ఈ సమయమునకు సరిగ రాబర్టు మేమున్న గది లోనికి వచ్చెను. ఆత డామెవైపు చూచెను. ఆమె చెక్కిళ్లు జేవురించియుండెను.

రాబర్టు: ప్రియా! విశేషము లేమి?

నేను: నేను సోమరిగా నుంటిననియు, నా వెంట్రుక లెఱ్ఱగ నున్నవనియు వదినె నన్నాక్షేపించుచున్నది.

రోజ్: పాపము! వెంట్రుకల రంగున కాత డేమిచేయగలడు?

రా: మనవంశమున నొక్కొక్క తరములోను సామాన్యముగ నొక్కరి కీతీరుననే వెంట్రుకలుండుట పరిపాటి. ముక్కుకూడ నంతియే. కాని, యీ రెండు లక్షణములును రుడాల్ఫునకు సంక్రమించినవి.

రోజ్: అట్లుండకున్న బాగుండెడిది.

నేను: నాకేమో అవి చాల యిష్టమే.

అనుచు నేను లేచి గదిలోనున్న అమీలియారాకునూరి పటమునకు నమస్కరించితిని.

మా వదినె యసహనముతో 'రాబర్ట్! ఈ బొమ్మ నిచ్చటినుండి తొలగించిన బాగుండును. అప్పటికీ కళంకమును మఱచుటకు వీలగును'. అనెను.

రా: రూడాల్ఫు దాపుననుండ వది యసాధ్యమేమో!

నేను: ఏల మఱువ వలెను? నామట్టుకు నేను ఎల్ఫ్‌బర్గ్ వంశీయుడ నగుట కిష్ట పడుదును.

రోజ్: రాబర్టునకును నీకు నిదియే భేదము. ఆతడు తన యాస్తి నకు దగిన కర్తవ్యముల గుర్తింపగలడు. నీవు నీకుగల యవకాశముల మాత్రమే చూడగలవు.

నేను: ఔను, వదినా! ఉత్సాహవంతున కవకాశములే కర్తవ్యములు.

రోజ్: అర్థము లేని మాట.

ఆమె క్షణ మూరకుండి మరల నిట్లనెను.

'సర్ జాకబ్ నీకు తగిన యుద్యోగ మిత్తు ననుచున్నాడు'.

నేను: ఆతని కనేక వందనములు.

రోజ్: ఆరు నెలలలో నాత డొక రాయబారిగా నియమితు డగునట. తనకుతోడుగా నిన్నతడు తీసికొనుట తథ్యము. నా యూటకైన నీవా యుద్యోగమును స్వీకరింపుము.

నాబోటి సోమరినిగూర్చి - తనకు బాధ్యత లేకున్నను- ఇంత శ్రద్ధవహించి యామె చెప్పిన హితమునకు మాఱాడ నాకు నోరాడలేదు. నాకాయుద్యోగమువలన కొంత యానందముగూడ కలుగవచ్చునని తలంచి నేనామెతో 'వదినా, 'ఆఱు నెలలలో' నేయవాంతరమును రాకున్నచో, జాకబ్ నన్నాపదవి కాహ్వానించుచో తప్పక యతనివెంట వెడలుదు' నంటిని.

రోజ్: రూడాల్ఫ్! నీ వెంత మంచివాడవు! నాకిప్పు డెంతో యానందము కలిగినది.

నే నామెకు మాట యిచ్చితిని. ఉద్యోగము లభించుట కాఱు నెలల యవధియున్నది. ఆఱు నెల లాఱు నెల లే. మరి రాయబారుల సహోద్యోగు లేజేసి పనిచేయవలసియుండునో లేదో? నా కెట్లు తెలియును? సర్ జాకబ్ తోగాని మ రెవ్వరితోగాని నే నెప్పుడైన రాయబారపు వ్యవహారములలో జేరియుండిన గదా తెలియుట! ఆ యాఱు నెలల కాల మానందముగ గడపు టెట్లని యాలోచింప దొడగితిని. ఉన్నదున్నట్లుగా రురిటేనియాను సందర్శింపవలయు ననెడి బుద్ధి పుట్టెను. ఇంతవఱకు నేనా దేశమునకు పోలేదనిన వింతగా కనపడవచ్చును. మా తండ్రికి ఎల్ఫ్‌బర్గులమీద నభిమాన మెక్కువ. అందువల్లనే నాకా వంశ సంప్రదాయానుసారమే 'రూడాల్ఫ్' అని పేరు పెట్టియుండిరి. అయినను రురిటేనియాకు పోవలయునన్న మాత్రము మా తండ్రి యనుమతించుచుండలేదు. మా యన్నగారు నైత మా మార్గమునే యనుసరించిరి. రురిటేనియా తలంపు కలుగుట తోడనే యా దేశమును చూచితీరవలయు ననెడి యాసక్తితో నా మనసు మథనపడ సాగెను.

దీనికి తోడు 'టైమ్సు' పత్రికలో రురిటేనియా రాజగు ౫వ రూడాల్ఫునకు స్ట్రెల్సాలో ఇక మూడు వారములలో నత్యంత వైభవముగ పట్టాభిషేక మహోత్సవము జరుగనున్న విషయమును చదివినప్పుడు నా యాసక్తి యినుమడించెను.

వెంటనే నేనా మహోత్సవమును చూడ బోవలయునని నిశ్చయించుకొంటిని. అందులకు దగిన సన్నాహము లొనర్పఁ బూనితిని. నా ప్రయాణములగూర్చి మావారితో జెప్పుట నాకెప్పుడు నలవాటులేదు.

అందునను నా యీప్రయాణమునకు వ్యతిరేకత యెక్కువగా నుండునని నా యూహ. కావున నే నొక పుస్తకమును వ్రాయ నుంటిననియు నందులకు వలయు విషయసేకరణకై బైరల్‌లోని జనుల జీవితవిశేషముల నవగాహనము జేసికొనుటకై కొంతకాల మచ్చట సంచరింప నేగుచుంటి ననియు చెప్పితిని. ఇందువలన మా వదినె యనుమానము సైతము తీరిపోయెను.

## 2

బైరల్‌కు పారిస్‌మీదుగనే పోవలయును. త్రోవలో నేను పారిస్‌లోని కాంటినెంటల్ హోటలులో ఒకరాత్రి ఒకపగలు మకాము చేసితిని. అచ్చట జార్జ్ ఫెదర్లీ రాయబారి కార్యాలయమున నుండెను. ఆతడు నా స్నేహితుడు. నేనాతని జూచి, యాతనితో విందారగించి, యొక నాటకశాలకేగి యాటేయి గడపితిని. మరుసటిదినము నన్ను సాగనంపుటకై జార్జ్ ఫెదర్లీ స్టేషనుకు వచ్చెను. నేనచ్చటినుండి స్ట్రెల్సాకుగాక డ్రెస్‌డన్‌కు టికెట్టు కొంటిని. 'చిత్రములు చూచుట కేగుచుంటివా' యని నన్నాతడు ప్రశ్నించెను.

జార్జ్ మితభాషి కాడు. ఆతనితో నేను గురిజేసియాను బోవుచుంటినని చెప్పినచో నావార్త మూడుదినములలో

లండను చేరును. కావున నా విషయ మాతనికి జెప్పక యేదైన సమాధానము చెప్ప నాలోచించుచుండునంతలో నాతడు నన్ను వదలి ప్లాటుఫారము ఆవలిచివర కేగెను. అంతటితో నే నబద్ధమాడ నవసరము లేకపోయెను. ఇంతలో నాతడు బుకింగ్ ఆఫీసునుండి బయటికి వచ్చుచున్న యొక యందగత్తెకు గౌరవపూర్వకముగ స్వాగత మిచ్చుట జూచితిని. ఆమె పొడుగరి. మేను చామనచాయ. నిండు విగ్రహము. కడు సొగసరి. నాగరక దస్తుల ధరించియుండెను. వయసు ముప్పదియో లేక యొకటి రెండేడు లెక్కుడో యుండవచ్చును. జార్జ ఆమెతో మాటాడుచుండగా నామె నావైపు తన దృష్టి సారించెను. చలి యెక్కువగుటచే నే నున్నికోటును ధరించి మెడచుట్టు నొక గుడ్డ చుట్టుకొని యుంటిని. చెవులను కప్పున ట్లొక మెత్తని టోపీని ధరించి యుంటిని. కావున నప్పటి నా వేష మెప్పటియ ట్లాకర్షణీయముగ నుండి యుండదను నూహతట్టుటతో నా యభిమానము దెబ్బతినెను. ఒక్క క్షణము తరువాత జార్జ నన్ను కలిసికొని 'ఒక మనోహారిణి నీకు పయనపుచెలి యగుచున్నది. పేరు అంటాయినెట్ డి వూాబన్. ఆమె గమ్యస్థానము కూడ డెన్సిడనే. నీతోడి పరిచయము నామె యిప్పుడు వాంఛింపకుండుట మాత్రము చిత్రముగనున్న'దనెను.

నేను: నన్నామెకు పరిచయము చేయుమని నే నడుగ లేదే!
నా మాటలలో కోపచిహ్నము లుండెను.

జార్జి: అది సరియే. నిన్ను పిలిచికొని వత్తునని నే నేయుంటిని.

ఆమె 'మరొకప్పు'డనెను. పోనిమ్ము. ఏదైన యవాం తరము రావచ్చును. అప్పుడు నీవామెను రక్షించి యామె ప్రేమకు పాత్రుడైన స్ట్రెల్సా డ్యూకుస్థానము నాక్రమించుకొనవచ్చును.

నేను: కాని ఈమె ఎవ్వరు? ఈమెకు డ్యూకుతోడి సంబంధ మేమి?

జార్జి: డ్యూక్ మైకేల్ మొన్నమొన్ననే పారిస్‌కు వచ్చి యుండెను. అప్పు డాత డీమెను విశేషముగ పరామర్శించి గౌరవించెను. ఆమె విధవ. శ్రీమంతురాలు. అందగత్తె. గొప్పయాశలు కలదని కూడ వినికిడి. ఇంక డ్యూకో సర్వలక్షణ సంపన్నుడు. లేనిది రాజరికము మాత్రమే. అతడు రురిటేనియాను పాలించిన వెనుకటి రాజునకు రెండవభార్య కొడుకు. క్రొత్తరాజునకు సవతితమ్ముడు. తండ్రికి అభిమానపాత్రుడు. అతనికి రాజధానీ నగరమగు స్ట్రెల్సా డ్యూకుపదవి నిచ్చినప్పుడు కొన్ని విపరీత వ్యాఖ్యానములు బయలుదేఱినవి. అతని తల్లి ఉన్నతాభిజాత్య కాదు.

నేను: అత డిప్పుడు ప్యారిస్‌లో లేడు. ఉన్నాడా?

జార్జి: లేడు. రాజ పట్టాభిషేకమునకై స్ట్రెల్సా కేగినాడు. ఆ యుత్సవ మాతని కంత హర్షదాయకము కాదని చెప్పవచ్చును.

మా ప్రయాణ మారంభమయ్యెను. జార్జ్ జోస్యము చెప్పినట్లు నాకుగాని మాబనునకుగాని యేయవాంతరమును రాలేదు. ఈ విషయమును నాతరఫుననేగాక యామె తరఫున గూడ నమ్మకముగ జెప్పుచున్నాను. కారణ మేమన మేము డ్రెస్డన్ చేరి యొకరాత్రి విశ్రమించిన తరువాత ప్రయాణము సాగింపగా నామెయు నే నెక్కిన రైలులోనే ప్రవేశించెను. ఆమె యొంటరిగానుండ నిష్టపడుచున్నదని యూహించి నేనును బహు జాగ్రత్తగ ఆమెనుండి యెడముగా నుండ యత్నించితిని. నేను చేరదలచిన చోటికే యామెయు పయనించెను. కావున నామెకు తెలియకుండగనే ఆమెను చక్కగ చూచుట కబ్బిన యవకాశముల నెల్ల చక్కగ వినియోగించుకొంటిని.

రురిటేనియా సరిహద్దుల జేరితిమి. అచ్చట పత్రికను కొని చదువగా నేకారణముచేతనో రాజ పట్టాభిషేక మహోత్సవ ముహూర్త మకస్మాత్తుగ మారినట్టు తెలిసెను. దీనికి కారణము వివరింపబడలేదు. ఇందేదో "కుంభకోణ" మున్నట్లు తోచినది.

నాటికి మూడవరోజే పట్టాభిషేకము జరుగనుండెను. ప్రజలందఱుత్సాహపూరితులై యుండిరి. స్ట్రెల్సా జనులచే క్రిక్కిరిసియుండుట నిజము. పట్టణములోని వసతులన్నియు నిండియుండును. హోటళ్లలో తావుండదు. నాకు బస దొరకుట కష్టమని తోచినది. ఒకవేళ దొరకినను నేను చాల యెక్కువ బాడుగ నిచ్చుకొనవలసి యుండును. కావున నేను

రాజధాని కేబదిమైళ్ల దూరముననుండు జండాపట్టణమున మకాముచేయ సంకల్పించితిని. సరిహద్దునుండి యటకు పదిమైళ్లు. నేనచ్చటికి సాయంకాలము చేరితిని. మఱుసటిరోజు మంగళవారమంతయు జండాలో కడపి అచ్చటి ప్రసిద్ధమగు కోటను దర్శింప నెంచితిని. బుధవారమునాడు ఉదయము రైలులో స్ట్రెల్సాకుపోయి మరల సాయంకాలమునకు పరుండుటకు జండాకే రావలయునని నా యేర్పాటు. రైలు జండాచేరెను. నేను దిగి ప్లాటుఫారముమీద నిలుచుంటిని. రైలు కదలెను. నా నెయ్యురాలు మాబన్ తాను కూర్చున్నచోటనే యుండెను. ఆమె నేరుగ స్ట్రెల్సాకే పోవుచున్నదనుట స్పష్టమయ్యెను. ఆమెకు నాకంటె ముందు చూపెక్కువ. కావున స్ట్రెల్సాలో ముందుగనే ఆమె తన విడిది నేర్పాటు చేసికొనియుండెను. ఇంతదూరము మే మిరువురమును కలిసి పయనించితిమని తెలిసిన జార్జ్ ఫెదర్లీ యెంతగా నాశ్చర్యపడి యుండెడివాడో యని తలంచుచు నాలో నేను నవ్వుకొంటిని.

జండాలో నే నొక పూటకూటి యింటికి పోయితిని. హోటలనుటకన్న దానిని సత్రమనుట తగును. దాని యజమాను రాలొక వృద్ధ. ఆమె కిద్దఱు కూతుళ్లు. శాంతజీవనము గడుపుచుండిన యా సద్వర్తనులకు స్ట్రెల్సాలోని యుత్సవములం దెట్టి యాసక్తియు లేనట్లు కనపడెను. వృద్ధురాలికి మ్యూకునం దభిమానము మెండు. అత డిప్పుడు రాజు మరణశాసనాను సారముగ జండాపరిసరప్రాంత భూములకును దుర్గమునకును ప్రభువగుటయే యాదులకు కారణము. ఆదుర్గ మాసత్రమునకు

సుమా రొక మైలుదూరమున గుట్టపై నుండెను. డ్యూకు రాజుకాలేదే యను బెంగను నిశ్శంకముగ ప్రకటించుటకు వృద్ధురాలు జంకలేదు. ఆమె 'డ్యూకును మేము బాగుగ నెఱుగుదుము. ఆతడు మామధ్యనే జీవించినవాడు. రురిటేనియాలో ప్రతివానికి నాతడు చిరపరిచితుడే. రాజే యింకను క్రొత్తవాడు. ఆతడు చాలకాలము విదేశములలో నుండినవాడు. 'పదింటి కొక్కరైన నాతని గుర్తింపలేరు.' అనెను. కూతుళ్ళలో నొక్కతె 'గడ్డముకూడ పూర్తిగ తీయించినాడట!. ఇప్పుడాతని గుర్తించుట ఎవరికిని సాధ్యముకాదు.' అనెను.

తల్లి: గడ్డము గొఱిగించుకొన్నాడా? ఎవరు చెప్పిరి?

కూతురు: వేటపెత్తనదారుడు (గేంకీపర్) జోహాన్. అతడు రాజును చూచినాడు.

తల్లి: ఓహో సరియే. రాజిప్పు డీ యడవిలోని వేట విడిది యం దున్నాడు. అది డ్యూకుది. అచ్చటినుండియే యాతడు బుధవార ముదయము పట్టాభిషిక్తుడగుటకు స్ట్రెల్సా కేగును.

ఈ సంభాషణ నన్నాకర్షించినది. మరుసటిరోజు రాజు గారి బసవైపు పోయిన నాతని చూడగలుగుదునేమో యని యట్లుచేయ సంకల్పించితిని. వృద్ధ మరల చెప్పసాగెను. "అతడు మృగయానిమగ్నుడై యచ్చటనే యుండిపోయిన నెంత బాగుండును? వేట-మద్యము యీ రెంటియందే యాతని

కాసక్తి మొండని జనశ్రుతి. బుధవారమునాడు మా డ్యూకే పట్టాభిషిక్తు డగుగాక! అదియే నా కోరిక. ఈవిషయ మెవ్వ రెఱిగినను నాకు చింతలేదు." ఆమె చిన్నకూతు రిట్లనెను. "నాకుమాత్రము నల్ల మైకేలనిన నసహ్యమమ్మా! ఎఱ్ఱని ఎల్ఫ్‌బర్గ్ అనిననే నా కిష్టము. రాజు ఎఱ్ఱగనున్నాడని జను లనుకొనుచున్నారు. ఆతడు నక్క ఎంతయెఱ్ఱగా నుండునో అంతఎఱ్ఱగనున్నాడట-లేక-" అని యాపి నావైపు కొంటెగా చూచుచు నవ్వెను. ముసలియామె తన కూతురివైపు బొమలు ముడివేసి చూచుచు 'ఎందఱో ఆ యెఱ్ఱనివెంట్రుకల నిదివరలో శపించినారు" అనెను.

నేను: ఈ ప్రదేశమంతయు డ్యూకు స్వాధీనమం దున్నదంటిరి గదా, రాజె ట్లిచ్చటికి వచ్చెను?

తల్లి అయ్యా! బుధవారమువరకు నిచ్చటనే విశ్రమించునదిగా రాజును డ్యూకే యాహ్వానించినాడు. తాను స్ట్రెల్సాకు పోయి రాజుగారికి ఘనస్వాగత మిచ్చుట కేర్పాటు కావించుచున్నాడు.

నేను: అయిన వారిరువురు స్నేహితు లే?

తల్లి: అంతటిస్నేహ మెవరికి నుండదు.

ఇంతలో కూతు రిట్లనెను. 'ఒకే పదవిని ఒకే పడతిని వలచినవా రొండొరుల నెట్లు ప్రేమింతురో యట్లే వీరును పరస్ప రము ప్రేమించుకొను చున్నారు."

ఈ మాటలతో వృద్ధకన్ను లెఱ్ఱబారెను ఆ బాలిక మాటలు నాలో కౌతూహలమును రేపెను. కావున తల్లి యామెను తిట్టుట కారంభింపక ముందే నేనిట్లంటిని. 'ఏమీ! ఒకేభార్యను సైతము పెండ్లాడ దలచిరా? అదెట్లు?"

కూతురు: ష్లేవియా రాకుమారిని పెండ్లాడుటకై నల్లమైకేలు తన ప్రాణములనైన ధారవోయుటకు సిద్ధముగ నున్నా డనుట జగమెఱిగిన సత్యము. ఆమెయే రాణి కాబోవు చున్నది.

నేను: వాస్తవముగ నేను డ్యూకు విషయమున విచారించు చున్నాను. చిన్నకొడుకుగా పుట్టినంతమాత్రమున పెద్ద వాడు విడిచినదానినే రించి దానికే ఏల కృతజ్ఞుడై యుండవలెను!

కూతురు: 'నల్లమైకేలు—' అనునంతలో బయట నొక పాద ఘట్టన వినిపించెను. బొంగురు గొంతుకతో 'ఆతని స్వస్థానమునసే మైకేలునకు నల్ల' బిరుదమును చేర్చి మాటాడు వారెవరు?' అను ప్రశ్న సైతము వినవచ్చెను. బాలిక కెవ్వున కేకవేసెను. సగము భయము చేతను సగము సంతోషముచేతను నామె యట్లు కావించెనని తలపోసితిని.

వృద్ధ: 'చూచితివా? నీ వాగుడు ఫలితము.' అనుచుండగనే

ఆమాట లనిన వ్యక్తి ముందుకు వచ్చెను. ఒకక్షణము తరువాత నాతడు నన్ను చూచెను. వెంటనే యేదో వింత

వస్తువును చూచిన ట్లాశ్చర్యచకితుడై యాత డొక యడుగు వెనుకకు వేసెను. నా యాశ్చర్యమున కంతు లేకుండెను. పెద్ద బాలిక యాతని విభ్రాంతిని చూచి 'జాహాన్! నీ కేమి బాధ జనించినది? ఈతడు రాజ పట్టాభిషేక మహోత్స వమును చూచుటకై వచ్చియుండు వాడు' అనెను. ఇంతలో జొహాన్ తేఱుకొనెను. ఐనను ఆతడు నన్ను ఱెప్పవేయక చూచుచునేయుండెను. ఆతని చూపులలో తీవ్రిత భయము వ్యక్తమగుచుండెను. నేను నమస్కరింప జొహాన్ ప్రతినమస్కా రముచేసి నావైపు పరీక్షగ చూచుచుండెను. బాలిక సంతోష ముతో నవ్వుచు "జొహాన్! చూడు. నీవు ప్రేమించు వర్ణ మిదియే. (నావైపు చూచుచు) అయ్యా! ఈతడు మీ వెంట్రుకలను చూచుచున్నాడు. ఈ వర్ణము గలవా రిచ్చట సామాన్యముగ నరుదు! అనెను.

జొ: అయ్యా! క్షమింపుడు. ఇచ్చట నెవరు నుండరని నేను తలచితిని.

నేను: ఇతని కొక లోటా పానీయమిండు. నే నిక సెలవు తీసి కొందును. మీ యాదరణమునకును సరస సంభాషణ మునకును చాల సంతోషము.

అని చెప్పుచు లేచి వాకిలివైపు తిరిగితిని. చిన్నకూతురు నాకు వెలుతురు చూపుటకై వచ్చెను. నేను గది దాటివచ్చు వఱకు జొహాన్ దృష్టి నాయందే లగ్నమైయుండెను. నే నాతని దాటి పోవుచుండ నాత డొకయడుగు ముందుకు వచ్చి 'అయ్యా,

మా రాజును మీ రెఱుగుదురా? దయచేసి చెప్పుడు' అని ప్రశ్నించెను.

'నే నాతని నెప్పుడు చూడ లేదు. బుధవారము చూచెద ననుకొందును.' అని నేనంటిని. ఆత డేమియు బదులాడ లేదు. నేను బయటికి చేరువఱకు నాతని దృష్టిమాత్రము నామీాద నే కేంద్రీకృతమై యుండెను. నా మైచాయ యతని కయిష్టము గొల్పినదని జొహాన్ యెడల వైముఖ్యము వహించునంతటి మూర్ఖుడను గాను. ఒకచో వహించినను మరునా డాతడు నాయెడల చూపిన గౌరవభావము నన్ను ప్రసన్నుని చేసినది.

నేను స్ట్రెల్సాకు పోవనుంటినని విని జొహాన్ మరునా డుదయమే నను చూచుటకై నా బసకు వచ్చెను. నే నప్పుడు ఫలాహారము చేయుచుంటిని. ఆతడు నాతో 'అయ్యా రాజ ధానిలో మా యక్క యున్నది. ఉత్సవసమయమున నే నుండు టకు తన యింటిలో నొక గదిని నాకొఱ కానె యేర్పాటు చేసినది. ఇచ్చట పనులుండుటవల్ల నేనా యుత్సవమునకు రాజాలను. మీా కభ్యంతరము లేకున్న నా విడిదిలో మీారు బస చేయవచ్చును.' అని చెప్పెను. నేను వెంటనే యాతని సాయము స్వీకరింతు నంటిని. ఈ విషయము నాతడు తన యక్కకు తంతిద్వారా తెలు వెడలిపోయెను. నేను సామా నులను సర్దుకొని మరుసటి రైలుకే పోవ సన్నాహములు చేసి తిని. కాని జండా యడవిని చూడవలయునను నా యాశ

తీఅ లేదు. కావున సుమారొక పదిమైళ్లు అడవిగుండా పోయిన నక్కడ నొక స్టేషనున్నదని విని యచ్చటికి నడచివెళ్లి రైలందు కొండ మనుకొంటిని. సామానులను మాత్రము నేరుగా జొహాన్ నాకిచ్చిన యడ్రసునకే స్ట్రెల్సానకు పంపితిని. ఈ మార్పు జొహానునకు తెలియదు. ఆత డప్పటికే వెళ్ళియుండెను.

త్వరగా భోజనము ముగించి జండాదుర్గమున్న కొండ నెక్కుటకు బయలుదేఱితిని. అచ్చటినుండి జండాయడవికి పోవ నెంచితిని. అరగంట నెమ్మదిగ నడచి దుర్గమును చేరితిని. కోట యింకను సురక్షితమై, ఉన్నతమై, దర్శనీయమై యుండెను. దానికి వెనుక అందమైన క్రొత్త ప్రాసాదముండెను. దానిని నూతన పద్ధతిని నిర్మించియుండిరి. అది స్ట్రెల్సా డ్యూకునకు విలాసపు విడిది. దానిని వెనుకటిరాజు కట్టించెను. ఈ రెండు కట్టడముల నడుమ విశాలమును గభీరమును నగు నొక యగడ్త యుండెను. ఈ రెండు దుర్గములకు రాకపోకలు జరుగుటకై ఈయగడ్తపై నొక యీడ్చువంతెన యమర్పబడియుండెను. అవసరమున్నప్పుడు మాత్రమే యుపయోగించుకొనుట కిది యనుకూలముగ నుండెను. దుర్గపు ప్రాచీన నవీన భాగముల కలుపుటకును, ప్రాచీనదుర్గమును బాహ్యప్రపంచముతో కలుపుటకును నీ వంతెనయే ఏకైకసాధనము. నూతనభవనమునకు మాత్రము సువిశాలమును సుందరమును నగు నొక బాట వేయబడియుండెను. ఇరువైపుల చెట్లకొమ్మ లొకదాని నొకటి పెనవైచుకొని యుండెను.

త్వరలో నే నరణ్యమును ప్రవేశించితిని. గంటకుపైగా చల్లని చెట్ల నీడలలో నడచితిని. అచ్చటి సౌందర్యము నన్ను మిక్కుటముగ నాకర్షించెను. ఒక యెండిన చెట్టుబోదె కాను కొని కూర్చుండి చుట్టత్రాగుచు నందలి ప్రశాంతదృశ్యమును చూచి యానందించుచుండ కూర్కు తగులుటచే మైమఱచి గాఢనిద్రలో పడితిని. స్ట్రెల్సార్ రైలుసంగతియే జ్ఞాపకమునకు రాలేదు. మధురస్వప్నగతుడనైన నాకొక కర్కశ స్వరము వినబడుటచే మెలకువ కలిగెను. ఆమాటలివి. 'ఏమాశ్చర్యమిది! ఇతనికి క్షురకర్మ కావించిన నితడే రాజగును.'

కన్నుల తెఱచితిని. ఇరువురు మనుష్యులు నన్నత్యంత కుతూహలముతో పరిశీలించుచుండిరి. ఇరువురును వేట దుస్తులను ధరించి తుపాకుల దాల్చియుండిరి. అందులో నొక్కడు పొట్టిగా లావుగా నుండెను. పెద్ద సొరకాయతల. తెల్లని మీసములు. కించిత్తు జేగురించిన చిన్న కన్నులు. ఇంకొక్కడు బక్కపలుచని యువకుడు. సాధారణపుటెత్తు. నల్లని శరీరము. ఒకడు వయసుచెల్లిన సైనికుడనియు, మరియొక్కడు ఉత్తమ వంశజుడనియు, సైనికజీవితమునకు పరిచితుడనియు నే నూహించితిని.

యువకుని తన వెంటరమ్మని సైగజేయుచు పెద్దవాడు నాచెంతకు వచ్చెను. యువకుడు సగౌరవముగ తలమీఁది టోపీని తీసి పట్టుకొని అతని ననుసరించివచ్చెను. నేను మెల్లగ లేచి నిలుచుంటిని.

'ఇతని ఎత్తుకూడ నంతేయున్నది' అని పెద్దవాడు ఆఱడుగుల రెండంగుళముల యెత్తుగల నా యున్నతదేహమువైపు పరిశీలనగా చూడసాగెను. తరువాత 'మీ పేరేమి?' యని నన్ను ప్రశ్నించెను. 'మొదట నా పరిచయమును కోరినవారు మీరు. కావున తొలుత మీరెవరో నాకు తెలుపుట భావ్య' మంటిని. చిన్నవాడు హసన్ముఖుడై ముందుకువచ్చి 'అయ్యా, ఇతనిపేరు కర్నల్ శాప్ట్. నాపేరు ఫ్రిట్జ్ వాన్ టార్లెన్ హీమ్. మే మిరువుర మును రురిటేనియారాజు కొలువునందున్నా'మనెను. నేను వారికి స్వాగతముపలికి తలపై టోపీతీయుచు 'నాపేరు రూడాల్ఫ రాసిండల్. ఇంగ్లండునుండివచ్చిన ప్రయాణీకుడను. ఏడాదికి ఒకటి రెండుపర్యాయములు రాణీగారి కొలువునందుందు'' నంటిని. శాప్టు 'రాసండల్, రాసిండల్' అని రెండుమారులు తనలో గొణుగు కొనుచు 'నీవు బర్ల్ స్డెకు కుటుంబమునను జెందినవాడవా? అనెను. అతని ముఖమున నేదో పరిచయస్మృతి గలిగినట్లుండెను.

నేను: ఔను, ఇప్పుడు మాయన్న ప్రభువుగానున్నాడు.

శాప్ట్: నీ తలయే నీరహస్యమును చాటుచున్నది.

నేను: మాకథ యిచ్చటను మఱచినట్లులేదే?

నా మనసు కలతజెందసాగెను. నేనెట్టి విస్పష్టమైన వంశ లక్షణమును కలిగియున్నానో నాకప్పు డర్థమయ్యెను. ఈవిష యమై నేను రురిటేనియాను ప్రవేశించుటకుముందే యాలోచింప

వలసియుండెను. కాని రోటిలో తలదూర్చి రోకటిపోటునకు వెనుదీయనగునా? యని ధైర్యము వహించితిని. ఇంతలో మా కొక యుదాత్తస్వరము వినవచ్చెను.

'ఫ్రిట్జ్, ఫ్రిట్జ్ ఎచ్చట నున్నావోయీ?'

ఫ్రిట్జ్ ఆతురతతో 'రాజు' అనెను.

ఇంతలో నొక యువకుడు మాప్రక్కనుండిన చెట్లు వెనుకనుండి మాయెదుట ప్రత్యక్షమయ్యెను. నేనాతని చూడ గనే యాశ్చర్యచకితుడనైతిని. అతడుగూడ నన్నుచూడగనే వెనుకకుతగ్గి విభ్రాంతుడయ్యెను. ముఖముమీద వెంట్రుకలు లేకుండుట, అధికారప్రాభవమున గానవచ్చు గాంభీర్యముద్ర, ఔన్నత్యము, నాకంటె ఎత్తులో అరఅంగుళము తక్కువగ నుండుట తప్ప యాతనికి నాకు నీషణ్మాత్రమైన వ్యత్యాసము లేకుండెను. 'రాసిండలే రురితేనియారాజు. రురితేనియారాజే రాసిండలు.' అని నిశ్శంకముగ చెప్పనొప్పును.

క్షణమాత్రము పేమియనుపరము నప్రతిభులై ఒకరి నొకరు చూచికొనుచు నిలుచుంటిమి. తరువాత నే నాతనికి గౌరవపురస్సరముగ నమస్కరించితిని. రాజు కలవరపాటుతో 'ఈత డెవ్వరు'? అని తనవారిని ప్రశ్నించెను.

నేను సమాధానము చెప్పునంతలోనే శాప్ట్ నాకును రాజునకును మధ్యగా నిలిచి చిన్నగా నేదియో చెప్పెను. ఆతని

మాటలను వినుచుండగనే రాజుముఖము విప్పారెను. కన్నులు కాంతిమంతములయ్యెను. అత్యంతానందముతో నాతడు నవ్వసాగెను. అడవియంతయు నాధ్వని ప్రతిధ్వనించుచు నాతని హాస్యప్రియత్వమును చాటెను. రాజు నా వీపుతట్టుచు 'సోదరా! నిన్ను కలిసికొన్నందుకు సంతసించితిని. నిన్ను చూచి విభ్రాంతుడవైన నన్ను క్షమింపు" మనెను.

నేను: ప్రభువుల సమక్షమున స్వాతిశయమున వర్తించిన నేనే క్షంతవ్యుడను. ఆ కారణముగ తమ యభిమానమును కోల్పోవకుందును గాక.

రాజు: అట్లందువేల? నీ వెల్లప్పుడును నా యభిమానపాత్రుడవే. అంతేకాదు. నన్నేమికోరినను సంతసమున చేయుటకు సిద్ధుడను. నీవిప్పు డెచ్చటికి పయనించుచున్నావు?

నేను: స్ట్రెల్సాకు—పట్టాభిషేక మహోత్సవమునకు.

రాజు తన స్నేహితులవైపు చూచెను. ఆతని ముఖభంగిమయందు కొంత కళవళపాటు కనబడినను చిఱునగవగుపించుచునే యుండెను. తన్ను బోలియుండుటను రాసెండల్ గ్రహించి రాజు ఫ్రిట్జ్‌తో నిట్లనెను. 'ఫ్రిట్జ్' మమ్మిద్దఱిని చూచినప్పుడు సోదరుడు మైకేలు ముఖవైఖరి వర్ణనాతీతముగ నుండగలదు' ఈమాటలనుచు నాతడు మరల నవ్వసాగెను.

ఫ్రిట్జ్: వినోదములుండని. ఈ సందర్భమున రాసెండల్ స్ట్రెల్సాకువచ్చుట సవ్యమాయని నాప్రశ్న!

రాజు సిగరెట్టుకాల్చుచు 'ఏమి శాప్ట్' అని ప్రశ్నార్థక ముగ నాతనివైపు చూచెను. శాప్ట్, అత డచ్చటికి పోకూడదు. అని మెల్లగా గొణిగెను.

నేను: అయిన ఈదినమే నేను రురిటేనియాను వదలి పోవుదును.

రాజు: అప్పుడే కాదు. ఏమైనను సరియే. ఈరాత్రి నాతో భుజింపవలెను. ప్రతిదినమును క్రొత్తబంధువును కలిసి కొనముగదా?

ఫ్రిట్జ్: ఈ రాత్రికి మనము మితముగ భుజింపవలెను.

రాజు: మేమా? అందులోను నూతనసోదరుడు అతిథిగా నుండ గనా? అది సాధ్యముకాదు. అయినను మనము పెందలకడనే వెళ్ళవలయుననుట మాత్రము జ్ఞాపక ముంచుకొందుము లెమ్ము.

శాప్ట్: రేపు ఉదయముకదా? నేనుకూడ జ్ఞాపక ముంచు కొందును.

రాజు: రాసిండల్! రమ్ము. మఱచితిని. నీ పేరేమి?

నేను: గౌరవపూర్వకముగ 'ప్రభువుగారి పేరే'యంటిని.

రాజు: మంచిది. ఐన మా పేరుపెట్టుకొనుట మీవారు అవ మానముగ తలంపలేదని తెలియుచున్నది. రావోయ్ సోదరా! నాకిచ్చట సొంతనివాసము లేదు. నా సోద రుడు మైకేల్ మాకొక విడిది నిచ్చియున్నాడు. అచ్చ టనే నీ కాతిథ్యమిత్తుము.

ఈ మాటలనుచు రాజు ఇతరులకూడ మాతో రమ్మని సన్న కావింపుచు నాతో చేయికలిపి యడవినిబడి పడమరగ నడువసాగెను.

అడవి దాటగానే మేమొక చిన్న పేటవిడిది చేరితిమి. అది యొకవిధమైన దారునిర్మితమగు బంగళా. మేము దానిని సమీపింపగనే యొక సేవకుడు మమ్మాహ్వానింప వచ్చెను. నే నచ్చటచూచిన మరొకవ్యక్తి స్థూలకాయయగు స్త్రీ, జొహాన్ తల్లి.

రాజు: 'జోసఫ్! భోజనము సిద్ధమైనదా'? యని యడిగెను. ఆతడు 'సర్వము సిద్ధ'మనెను. వెంటనే మేము భుజింప కూర్చుంటిమి.

రాజు: జోసఫ్! మద్యమును తెమ్ము. త్రాగకయే భుజింప మేమేమి పశువులమా?

వెంటనే జోసఫ్ మద్యమును తేబోయెను.

ఫ్రిట్జ్: రేపటిదినమును మఱువకుడు.

శాప్టె: ఔను, రేపు.

ఆతరువాత మేమిరువురమును చెరియొకగ్లాసు మద్యమును గ్రోలితిమి.

ఆహారవిషయ మెట్లున్నను మేముత్రావిన మద్యము మాత్రము అపురూపముగనుండెను. కావున తృప్తిగా త్రావితిమి. ఫ్రిట్జ్ రాజును వారింప సాహసించెను. రాజు ఫ్రిట్జ్తో

'ఫిట్జ్, నాకంటె ముందుగా బయలుదేరవలసినవాడవు నీవు. ఈ విషయము జ్ఞాపకముంచుకొని నాకంటె మితముగా త్రావు' మనెను.

నాకీ సంభాషణ మేమియు సరసముకాలేదు. దీనిని గ్రహించి ఫ్రిట్జ్ యిట్లనెను.

'శాప్టున్న నేనును ఉదయ నాలుగంటలకే యిచ్చటి నుండి బయలుదేఱి జండా చేరుదుము. అచ్చటినుండి యంగ రక్షకులతో చేరి ఎనిమిది గంటలకు రాజుగారితో గూడ స్టేషనుకు బయలుదేఱుదుము.''

రాజు: సోదరా! నీవు ముందుగా వెళ్ళ నవసరము లేదు. రమ్మ్మ. మరియొక సీసామద్యమును త్రాగుము.

ఇంకొకసీసాలో సగము నేను త్రావితినో లేదో మిగిలిన భాగమంతయు రాజుగారే ముగించిరి. ఫ్రిట్జ్ ఆతని మాన్పించు ప్రయత్నము విరమించుకొనెను. త్వరలో మేమందఱము మద్య పానమున మైమఱచితిమి. కడపటికి రాజు చేతనున్న సీసాను ముగించి కుర్చీలో ఆనుకొని కూర్చొనుచు 'కావలసినంత త్రాగినాను' అనెను. 'మీమాట కాదందునా' యని నేనంటిని.

నేనింకను నేమియో చెప్పబోవునంతలోనే జోసఫ్ రాజుయెదుట నొక మద్యపుసీసానుంచి 'ప్రభూ! రాజుగారి కితరమద్యములు చాలైనప్పుడీమద్యము నిచ్చి 'సోదరునిపై

ప్రేమయుంచి దీనిని త్రావు మను'మని మైకేలుడ్యూకు చెప్పి యున్నాడు'' అనెను. వెంటనే రాజాజ్ఞననుసరించి సీసాకున్న బిరడా తొలగింపబడెను. దానిని త్రాగ నారంభించిన రాజు మావైపు చూచి 'స్నేహితులారా! సోదరా రూడాల్ఫ్! నీవు కోరునదేదైన—రురితేనియా రాజ్యములో సగమైన-నిత్తునుగాని ఈమద్యములో నొక్క-చుక్క-యైన నితరుల కివ్వను' అనెను. ఇట్లనుచు సీసానుముగించి ముందున్నబల్లపై చేతులూని తల పట్టుకొని మైమఱచెను. ఆసాయంతనము జరిగిన విషయములలో నా స్మృతిపథములో నున్న దింతమాత్రమే.

## 4

నాముఖము, వెంట్రుకలు, గుడ్డలు, అన్నియు తడిసి యుండగా చలితో వణకుచు మేల్కొంటిని. నాయెదుట శాస్ట్ ఖాళీబకెట్టుతో నిలిచియుండెను. ఎదుటనున్న బల్లపై వివర్ణ ముఖముతో ఫ్రిట్జ్ కూర్చొనియుండెను. నేను కోపముతో పైకిలేచి 'అయ్యా, మీహాస్యము మితిమీఱుచున్న' దంటిని. వారు 'కొట్లాడుటకు పొద్దులేదు. ఇప్పుడైదుగంట లైనది. ఇంకేవిధముగను నిన్ను మేల్కొలుపుట సాధ్యముకాదని యిట్లు చేసితి'మనిరి. విశేషమైన చలితో నాశరీరమంతయు ముద్దగట్టు కొనిపోయి యుండెను. ఇంతలో ఫ్రిట్జ్ నాభుజముపై చేయి వైచి 'రాసిండల్! ఇటుచూడు.' మనెను.

రాజు నేలపై పడియుండెను. ఆతనిముఖము వెంట్రుకల వలెనే యెఱ్ఱనై యుండెను. ఉచ్ఛ్వాసనిశ్వాసములు తీవ్రముగ

నుండెను. నేనాతనిప్రక్కన మోకరించి నాడిని పట్టి చూచితిని. అది మెచ్చుటనో మందముగ కొట్టుకొనుచుండెను. మేము ముగ్వురము ఒకరినొకరు చూచుకొంటిమి.

నేను: ఆకడపటి సీసాలో నేదైన మందు కలిపియుండిరేమో!

శాప్ట్: ఏమో నాకెట్లు తెలియును?

నేను: మనమొక వైద్యుని రప్పింపవలెను.

శాప్ట్: పదిమైళ్ళలో వైద్యుడు లేడు. వేయిమంది వెజ్జులైన నీతని నేడు స్ట్రెల్సాకు చేర్చలేరు. చూచిననే తెలియు చున్నది. ఇతడింకను ఆరేడు గంటలవఱకు మేల్కొను జాడ కానరాదు.

నేను: అయిన పట్టాభిషేకమో!

ఫ్రిట్జ్: ఆతడు జబ్బుగానున్నాడని వార్త నంపవలెను.

శాప్స్: ఈదినముతప్పిన నీతడెప్పటికిని రాజుకాలేడు.

నేను: అటులనా? ఏల?

శాప్ట్: దేశమంతయు నేడు రాజదర్శనమునకై వచ్చియుండును. నల్లమైకేలు నాధ్వర్యమున సగముసైన్యమచ్చట నున్నది. ఇట్టిస్థితిలో రాజు తప్పత్రాగి పడియున్నాడని చెప్పిపంపుటయా?

నేను: కాదు. జబ్బుపడియున్నాడని.

శాప్ట్: జబ్బు! అతనిజబ్బు అందఱెరిగినదే. ఇదివఱ కెన్నియో మారు లాతడీ 'జబ్బు'తో పడియుండెను. అతని కేదైన మందు త్రాగించినారనియే మీరు భావించుచుంటిరా?

నేను: నాయభిప్రాయ మదియే.

శాప్ట్: ఎవరీపని చేసియుందురు?

ఫ్రిట్జ్: ఆకుక్క - నల్ల మైకేలు.

శాప్ట్: ఔను, ఇతడు పట్టాభిషిక్తుడు కారాదని యాతడే యీపని చేసియుండును. మైకేలువిషయముగాని ఆతడే రాజుకాగోరుచుండు స్ట్రెల్సాలోని సగముజనాభా అభిప్రాయమునుగాని పాపము రాసిండల్ ఏమెఱుగును? ఈదినము స్ట్రెల్సాకు పోకున్న నీతనికి సింహాసన మబ్బ నట్లే. మైకేల్ విషయము నాకు కరతలామలకమే.

ఫ్రిట్జ్ ముఖమును చేతులతో కప్పుకొనెను. రాజు గాఢముగ శ్వాసించు చుండెను. శాప్ట్ ఆతని పాదములుపట్టి కదలించెను. 'తప్పద్రావిన కుక్క. అయినను ఇతడు ఎల్ఫ్‌బర్గ్ వంశీయుడు. నేను చావకయే మైకేలితనికి మారుగా రాజగుట యసంభవ'మనెను.

ఒకటిరెండు నిమిషములు మేమెల్ల రూరకుంటిమి. శాప్ట్ బొమలు ముడివైచి నాతో 'వయస్సుచెల్లినకొలది మనుష్యుడు విధిని బలవత్తరమని విశ్వసించును. విధివశముననే నీవిట వచ్చితివి. విధియాజ్ఞవల్లనే నీవు స్ట్రెల్సాకుపోయి పట్టాభిషిక్తుడవు కావలసియున్న'దనెను.

ఈమాటలకు భీతపరీత చేతస్కుడనై వెనుకకు తగ్గితిని. 'ఇది యసాధ్యము. నన్నానవా లిడుదురేమో?' యంటిని.

శ్టాప్: నీవు గడ్డముమీసము గొఱిగించుకొన్న నిన్నానవా లిడలేరు. నీవు భయపడుచుంటివా'?

నేను: ఏమంటివి?

శ్టాప్: యువకుడా! రమ్ము. నిన్ను గుర్తించిరా, నీ, నా, ఫ్రిట్జ్ ప్రాణము లెగిరిపోవును. నీవు పోకున్నచో నేటిరాత్రికి నైకేలే సింహాసనాధిష్ఠితుడగునని నేను ప్రమాణము చేసి చెప్పగలను. రాజు కారాగారముననో గోరీయందో పడయుండ గలడు.

ఒకటిరెండు నిమిషములకాలము నేనట్లే యాలోచనా నిమగ్నుడ నైతిని. అంతలో నాముఖభంగిమ మారెను కాబోలు! వెంటనే శ్టాప్ట్ నాభుజముపై చేయివైచి 'నీవు వత్తువుగదా'? యనెను.

నేను: 'అవును. వత్తు'నంటిని.

శ్టాప్ట్: ఆతురతతో మెల్లగనిట్లనెను.

'మనమీరాత్రి రాజ ప్రాసాదమున విడియవలెను. అచ్చటివారు మనలను విడిచి వెళ్ళినతోడనే నేనును నీవును నశ్వముల నధిరోహించి ద్రుతగతి నిచ్చటికి రావలయును. అచ్చట రాజుగదిని ఫ్రిట్జ్ పహరా కాచుచుండును. మన మిచ్చటికి వచ్చునప్పటికి రాజు సిద్ధముగ నుండును. జోసఫ్ అతనికి విషయమంతయు చెప్పియుండును. నేనును ఆతడును

వెంటనే స్విట్జర్లాండ్ చేరుదుము. అటుపిమ్మట దయ్యము వెన్నంటిన వానివలె నీవు సరిహద్దులను చేరుకొనుము.'

ఫ్రిట్జ్: ఇదియొక మంచి యుపాయమే.

నేను: నన్ను వారు గుర్తింపకున్నచో.

శాస్ట్ గదివెలుపలికి పోయి జోసఫ్‌తో గూడ రెండు మూడు నిమిషములలో మరలివచ్చెను. జోసఫ్ చేతిలో వేడినీళ్ళ కూజా, సబ్బు, కత్తులు నుండినవి. శాస్ట్ మాహన్నుగడను గూర్చి చెప్పుచుండగా నాత డాపాదమస్తకము కంపించుచుండెను. శాస్ట్ జోసఫ్‌తో నాకు క్షౌరము చేయుమని చెప్పెను. ఫ్రిట్జ్ యింతలో 'అదిసరియేకాని అంగరక్షకులో? వారుతప్పక తెలిసికొందురు'రనెను.

శాస్ట్: మనము వారికొఱకు కాచుకొనవలసిన పనిలేదు. ఇక్కడినుండి 'హాబా' స్టేషనుకుపోయి రైలెక్కుదము. వారు వచ్చువేళకు పక్షి ఎగిరిపోయి యుండును.

ఫ్రిట్జ్: అయిన రాజు?

శాస్ట్: మద్యములుంచుగదిలో నుండగలడు. ఇప్పుడే యాతని నచ్చటికి తరలింతును.

ఫ్రిట్జ్: - వారతని కనుగొన్నచో?

శాస్ట్ గట్టిగా పాదఘట్టన కావించుచు నిట్లనెను.

'అయ్యో, దేవుడా! రాగల ప్రమాదము నాకు తెలియదా? వారాతని కనుగొన్నను ఆతడు నేడు రాజుకాకున్న రాగల హైన్యమునకంటె నికృష్టదశ రాజాలదు.

ఈమాట లనుచు వాకిలి తెఱచి శాప్ట రాజును తన చేతులతో నెత్తుకొనెను. ఆసమయమున జోహాన్‌తల్లి ద్వారమున నిల్చుకొనియుండెను. ఒక్కక్షణ మట్లు నిల్చియుండి యామె వెంటనే మెట్లు దిగిపోయెను.

ఫ్రిట్జ్: ఆమె మన మాటలు వినెనా?

శాప్ట: ఆమెనోరు మూయింతును.

అనుచు నాతడు రాజును చేతులపై మోసికొనిపోయెను.

ఇక నేను నా కుర్చీపై చతికిలబడితిని. జోసఫ్ తనపని తాను కావించెను. రాజుముఖమువలెనే నా ముఖమును లుప్త రోమమయ్యెను.

అప్పటికి కాఱుగంట లయ్యెను. ఆలసించుట కిక నవకాశము లేదు. శాప్ట నన్ను తొందరగ రాజుగదిలోనికి తీసికొనిపోయెను. నేను దుస్తులు ధరించితిని. రాజుగారి చెప్పులు వేసికొనుచు 'ఆ ముసలిదాని నేమిచేసితి'వని యడిగితిని.

శాప్ట: తన కేకయు వినరాలేదని యామె ప్రమాణము కావించెను. ఐనను నెందులకైన మంచిదని యామె కాలుసేతులు బాధించి నోట గుడ్డలు గ్రుక్కి బొగ్గులుంచు గదిలో వేసి తాళమువేసితిని. ఆ గది రాజుండు గదికి ప్రక్కనేయున్నది. జోసఫ్ తరువాత వారిరువురి విషయమును చూచుకొనగలడు.

నేను: ఇచ్చట నంతయు భద్రమైనట్లే కదా?

శాప్ట్: భద్రమను కెక్కడికి? ఇంతకంటె మన మేమియు
చేయలేము.

ఫ్రిట్జ్ మా దళాధిపతి కుండదగిన దుస్తుల ధరించి వచ్చెను. శాప్ట్ కూడ నాల్గు నిమిషములలో సిద్ధమయ్యెను. ఇంతలో జోసఫ్ వచ్చి 'అశ్వములు సిద్ధముగనున్న'వని చెప్పెను. వెంటనే మేము వాని నధిరోహించి బయల్దేరితిమి. నాటక మారంభమయ్యెను. దీని పరిణామ మెట్లుండునో!

చల్లనిగాలి వీచుచుండెను. శాప్ట్ చెప్పిన విషయముల నెల్ల మననము చేసి సమన్వయపరచుకొంటిని. ఆత డద్భుత వ్యక్తి. ఫ్రిట్జ్‌నోట మాటలేదు. కాని శాప్ట్‌మాత్రము నా భావి కర్తవ్యనిర్వహణమున కనుకూలముగ రాజుగారి జీవితమునకు సంబంధించిన పూర్వచరిత్ర, వంశచరిత్ర, అభిమాన విషయ ములు, లోటుపాట్లు, స్నేహితులు, సహచరులు, సేవకులు మొదలగు వివరములకు సంబంధించిన సూక్ష్మాంశముల నన్ని టిని నా కెఱుకపఱచెను. రురిటేనియా రాజ సభామర్యాద లను గూర్చియు చెప్పెను. తా నెల్లప్పుడు నాయొండనే యుండి యెవరెవరి నేవిధముగ నాదరింపవలెనో, ఎవరెవరి నెఱుగ దగునో గూడ తెలుపుచుందునని వాగ్దానముచేసెను.

మేము స్టేషను చేరితిమి. ఫ్రిట్జ్ ఆశ్చర్యచకితుడై న స్టేషనుమాష్టరునకు రాజుగారి ప్రయాణమునందలి మార్పులను గూర్చి నచ్చచెప్పెను. రైలు కదలెను. మే మొక మొదటి

తగగతి పెట్టెలో కూర్చుంటిమి. శాప్ట్ అచ్చటి మెత్త గానుకొని కూర్చుండి తన పాఠబోధన కుపక్రమించెను.

రైలు సాగిపోయెను. తొమ్మిదిన్నరగంట లయ్యెను. కిటికీలోనుండి తొంగిచూడగా పట్టణ మగుపించెను.

శాస్ట్: తమ రాజధానీనగరము. ప్రభూ!

ఈ మాట లనుచు నా చేతిపై చేయివైచి
'నాడిగతి తీవ్రముగ నున్నదే' యనెను.

నేను: నేను శిలాప్రతిమను కాను.

శాప్ట్: మంచిది. మన మొక గంటముందుగ వచ్చితిమి. 'ప్రభువులవారి యాగమనమును గుఱించి ముందుగ వార్త నంపుదును. లేనంతట మనకు స్వాగతమిచ్చుట కిచ్చట నెవ్వరు నుండరు. ఇక నింతలో...'

నేను: ఇంతలో రాజుగారి కేదైన యాహార మివ్వకున్న నాతడు చచ్చును.

శాప్ట్: నీవు ప్రతివిషయమునందును ఎల్ఫ్‌బర్గ్ వంశీయుడవే. ఈరాత్రి మనము సజీవులమై యుండునట్లు భగవాను డనుగ్రహించునుగాక!

ఫ్రిట్జ్: తథాస్తు.

ఇంతలో రైలాగెను. వారిరువురును దిగి నాకొఱకు వాకి తెఱచిపట్ట నేను శిరస్త్రాణము నదిమియుంచుకొని

దైవప్రార్థన కావించిన తరువాత స్టేషను ప్లాటుఫారముపై నడుగిడితిని.

ఒక్క నిమిషముతరువాత నంతయు కోలాహలమే. టోపీలను చేతనుంచుకొని పోవువారును, వచ్చువారును, పరు విడువారునై ఎచ్చటివా రచ్చట తమతమ పనులలో నిమగ్ను లైయుండిరి. ఆశ్వికులు వేగముగా సైనికదళము లున్నచోటికిని, దేవాలయమునకును మైకేలు నివాసమునకును దౌడుతీసిరి. నేను కాఫీ ముగించితినో లేదో నా రాక కానందము స్వాగ తము సూచించు నగర ఘంటారావము వినిపించెను. మిలిటరీ బ్యాండు శబ్దము, రాజు నాహ్వానించు ప్రజాసందోహముల సందడి నా వీనులబడెను. ఐదవ రూడాల్ఫ్ప్రభు వాతని రాజ ధానీనగరమును ప్రవేశించెను.

'భగవానుడు రాజును సంరక్షించుగాక' అను కేకలు మిన్నుముట్టెను. శాప్ట్ మొగమున చిఱునగ వగుపించెను. ఆతడు 'భగవంతుడు వారిరువురిని రక్షించుగాక!

వత్సా! ధైర్యమూను'మని మెల్లగ పలికెను.

## 5

అధికారవర్గమునకు జెందినవారు కొందఱును గౌరవనీయు లగు పురజనులు కొందఱును నా కొఱకు వేచియుండిరి. వారిలో నొక వృద్ధుడు— అనేక పతకములు బహుమతులు ధరించి యుండిన సైనికోద్యోగి—యుండెను.

శాఫ్ట్ మెల్లగా 'ఇతడు మార్గల్ స్ట్రాకెంచ్' అనెను. రురిటేనియా సైన్యాధికారులలోనెల్ల నత్యంత ప్రసిద్ధుడు నా సమక్షమున నున్నాడని తెలిసికొంటిని. అతడు రాజభక్తి సూచకముగ కొన్నిమాటలాడి తదుపరి మైకేలుతరఫున నతడు రానందులకు కారణముల వివరింపసాగెను. మైకేలునకు హఠాత్తుగ జబ్బుచేసినందున స్టేషనుకురా వీలు కాలేదనియు దేవాలయమున రాజుగారిని దర్శింప ననుమతింపవలయు ననియు నాతడు విన్నవించెను. ఆతని మాటలను నే నంగీకరించినట్లు గంభీరముగ సూచించితిని. తరువాత నచ్చట చేరియున్న గౌరవనీయు లెల్లరు స్వాగతవచనముల బల్కిరి. ఎవ్వరిలోను అనుమాన మణుమాత్రమైన నుదయించినట్లు సూచనగానైన కానరాలేదు. కావున నా కాత్మవిశ్వాసము ప్రబలెను. గుండె దడ తగ్గజొచ్చెను.

మేము స్టేషనుబయటికి వచ్చితిమి. అచ్చట నే నశ్వారూఢుడనైతిని. ఉత్సవ మారంభమయ్యెను. నా కుడిప్రైపున మార్షలున్ను (సైనికోద్యోగి ; యెడమవైపున శాఫ్టున్ను నన్ననుసరించిరి. స్ట్రెల్సానగరములో కొంతభాగము ప్రాచీనము. కొంత నవీనము. నూతననిర్మిత నగరభాగమందలివారు రాజపక్షమునకు చెందినవారు. ప్రాచీననగరమువారికి మైకేలునం దభిమానము మెండు. వారి కాతడే యాశాజ్యోతి; వీర శిఖామణి; ప్రేమభాజనుడు.

నూతననగరమున దృశ్యమత్యంత వైభవముగ నుండెను. ఇచ్చటివా రందఱు న న్నభిమానించెడివారే. ప్రతిగృహమును

పతాకాలంకృతమై యుండెను. ప్రజల జయజయ నినాదములు మిన్నుముట్టుచుండెను. సౌధోపరిభాగముల మేలిరకపు దుస్తుల ధరించియుండిన పురంధ్రీమణులు కరతాళధ్వనులు సేయుచు నాపై గులాబీపూల సోనలు కురియించిరి. అందులో నొక్కటి నా యశ్వపుజూలున చిక్కుకొనగా నే నద్దానిని తీసి నా కోటుపై ధరించితిని. మార్షల్ మందస్మితవదనుడయ్యెను. నేను 'మార్షల్! ఎల్బ్ఖబర్గులకు ఎఱ్ఱనిపూలనిన ప్రీతిగదా?' యంటిని. ఆత 'డౌ'నని తలయూచెను. నేనప్పు డుద్రేకపూరితుడనై యుంటిని. ఆక్షణమున నేను నిజముగ రాజుననునమ్మకము ముద యించెను. మరల నొకసారి కన్నులపై కెత్తి మేడలనైపు చూచి ...... చకితుడనైతిని. నా తోడిపరియాణీకురాలై యుండిన అంటాయ్నెట్ డి వరాబన్ నావైపు చూచుచు మంద హాసముచేయుచుండెను. ఆమెకూడ తన్నుచూచి చకితు రాలయ్యెను. ఆమె యధరములు కంపించెను. ఆమె యింకను ముందుకు వంగి నావైపు పరిశీలనగా చూడసాగెను. నేను స్థిమితపడి చలింపనిదృష్టి నామెపై పఱపుచు నా రివాల్వరును తడలిచూచికొంటిని. 'ఆతడు రాజుకాడ'ని యామె యకస్మా త్తుగా నఱచియుండిన?

ముందునకు సాగిపోయితిమి. మార్షల్ 'చేసన్న చేసెను. వెంటనే రక్షకదళము మాచుట్టును వర్తులాకారముగ నిలిచెను. జనులమూక నా దాపునకు రా వీలులేకపోయెను. మైకేలు నభిమానించు నగరభాగమును మేము ప్రవేశింపనుంటిమి. మార్షల్ చర్యనుబట్టి నగరములో ప్రజాభిప్రాయము సువ్యక్త

మయ్యెను. విధి నన్ను రాజుగా చేసెను. శక్తివంచనలేక నాపాత్రి నుచితరీతిని నిర్వహించుట నా కనిష్ఠవిధి.

నేను: మార్షల్! ఈమూర్ఖపల చేసితివి?

మార్షల్: 'ప్రభూ! ప్రకృత మిదియే యుత్తమమార్గము.

నేను నా గుఱ్ఱపుకళ్లెమును లాగి పట్టితిని. 'మార్షల్! ముందుండువారి నేబదిగజములు ముందునకు సాగనిమ్ము. నే నేబది గజములు ముందునకు పోవువఱకు శాప్టును నీవును వెనుకనుండి నన్నెవ్వరు దరిసిరాకుండునట్లు చేయుడు. నా ప్రజలను నేనెంత నమ్ముచున్నానో తెలిసికొందురుగాక!'యంటిని.

శాప్టు యీమాటలు విని నాభుజము పై చేయివేసెను. నే నద్దానిని తొలగించితిని. మార్షల్ మీనమేషముల లెక్కించుచుండెను.

నేను: 'నేనుచెప్పిన దర్థము కాలేదా!' యంటిని.

వెంటనే మార్షల్ నా యుత్తరువును జారీచేసెను. శాప్టు మందస్మితవదనుడయ్యెను వలదని మెల్లగ తలయూచెను. స్ట్రెల్సానగరవీధులలో బహిరంగముగ నన్ను చంపియుండిన శాప్టుస్థితి క్లిష్టతమముగ నుండెడిది.

పాతపట్టణపు వీధులగుండ నే నొంటరిగ యశ్వారూఢుడనై యేగుచుండ తొలుత కొంత గొణుగుడు వినవచ్చినను పిదప జయశబ్దములు వినబడియెను. అందులో నొకవనిత 'అత ఢెట్టుగనుండిన రాజే'యనెను. ఆమాటలకు నాకు నవ్వు

వచ్చెను. వారి యనుమానమును తీర్చుటకై నా శిరస్త్రాణ మును తొలగించితిని. తత్ఫలితముగ జనులలో మరల యుత్సాహ మతిశయించెను.

ఇంతైనను అచ్చటి జనులలోని మూకీభావము, చూపుల లోని ద్వేషభావము, ప్రతియింటను కనుపించుచున్న నాప్రియ సోదరుని (మైకేలు) ఛాయాచిత్రము మొదలగునవి కారణ ముగా నాకొసగబడిన స్వాగతము కేవలము లాంఛనప్రాయ ముగ కనుపించెను. బాధాకరమైన యీదృశ్యము-నాసోదరుని కంటబడలేదుగదా యని నేను హర్షించితిని.

కడపటికి మేము దేవాలయమును చేరితిమి. నా సాహస మునకు నాకే యాశ్చర్యమయ్యెను. అశ్వావరోహణ మొన రించితిని. నారాకకై నిరీక్షించుచుండిన పురోహితులును, మార్షలున్ను, శాప్టున్ను నాకు మసకగా కనుపించుచుండిరి. ఆ విశాలభవనమున నడచి వెళ్లుచుండగా మంగళ తూర్యా రావములు నావీనుల బడియెను. భవనము నిండియుండిన సాలంకృత జనసందోహమునుగాని, నన్నాహ్వానించి యభినందిం చుటకై తన యాసనమునుండి లేచినిలిచియున్న వైభవోన్నతు డగు కార్డినల్ (మతాధికారి) కాని నాదృష్టికందలేదు. రెండు విగ్రహములుమాత్రము ఒకదాని ప్రక్కన నొక్కటి నాకంటికి స్పష్టముగ కనుపించుచుండెను అరుణశిరోజయు రూపసియు నగు యువతి యందొకతె. (ఆమె రాజును వివాహమాడగలదని జను లనుకొనుచుండిరి) రెండవవ్యక్తి చెక్కిళ్లు ఎఱ్ఱబారి

యుండెను. వెంట్రుకలు కారునలుపు. నల్లని నయనద్వయము. ఆతడే నల్లమైకేలని గ్రహించితిని. నన్ను చూచిన క్షణమందే యాతని ముఖము హఠాత్తుగ తెల్లబాఱెను. ఆతని శిరస్త్రాణము అకస్మాత్తుగ క్రిందికి పడుటచే గొప్ప శబ్దమయ్యెను.

తరువాత నేమిజరిగెనో నాకించుకయు జ్ఞాపకములేదు. నేను మోకరించితిని. కార్డినల్ నన్ను మూర్ధాభిషిక్తుని కావించెను. నేను లేచి యాతనినుండి రురిటేనియా రాజకిరీటమును గైకొని నా శిరమున నలంకరించుకొని ప్రమాణస్వీకారము కావించితిని. మార్షల్ ఆజ్ఞమేరకు వందిమాగధులు స్తోత్రపాఠము లారంభించిరి. ఐదవ రూడాల్ఫ పట్టాభిషిక్తుడయ్యెను. ఆసందర్భమున తీయబడిన ఛాయాచిత్రమొకటి నేటికిని మా భోజనశాలయం దున్నది. అందు రాజు చాల బాగున్నాడు.

తరువాత నాయెదుట నిలుచుండిన సుందరి నన్ను సమీపించెను. వందులు 'ఫ్లేవియా రాకుమారి' యని యఱచిరి. ఆమె యించుక యవనతశరీరమై నా కరగ్రహణము కావించి ముద్దిడెను. ఏమిచేయవలెనో తోచక యొకక్షణ మాలోచనలో పడితిని. తరువాత నామెను దగ్గఱికి తీసికొని చెక్కిలిపై రెండుమారులు ముద్దుగొంటిని.

ఆవెనుక స్ట్రెల్సాడ్యూకు వచ్చెను. నేను శాప్టువైపు చూచితిని. ఆతని ముఖమున చిఱునవ్వుండెను. నేను డ్యూకును రెండుచేతులతోను దాపునకు తీసికొని చెక్కిలి ముద్దాడితిని.

ఈపని ముగియగనే మేమిరువురమును సంతోషించితిమను కొందును.

రాజకుమారిలోగాని తదితరులలోగాని నీమహాత్మ్రత్రాను మాన మగుపించలేదు. నేను రాజుగాక మరొకవ్యక్తినను యూహించుటగూడ వారి కసాధ్యమయ్యెను. పోలికలో వ్యత్యాసము లేశమాత్రము లేకుండుటయే యిందులకు కారణము. ఈపోలిక నాకు చక్కగ నుపకరించెను.

ఒకగంటసేపు నేనచ్చట నిలుచుంటిని కాబోలు. పుట్టిన దాది రాజుగానుండువానికివలె నా కాయాస మనిపించెను. ప్రతివారును వచ్చి భక్తిచిహ్నముగ నాచేతిని ముద్దాడిరి. విదేశరాయబారు లెల్లరు గౌరవము వెలార్చిరి. వారిలో లండన్ రాయబారి టొప్‌హాంకూడ నుండెను. అతని యింట నే నెన్నియోమారులు నృత్యపువేడుకలలో పాల్గొనియుంటిని. వీధులవెంట మరల రాజసౌధమునకు బయలుదేరితిమి. త్రోవలో నల్లమైకేలు నభినందించు ధ్వనులు వినబడెను. కాని మైకేలు మాత్ర మేదో యాలోచనలో మునిగిపోయి గోళ్లు కొఱుకు కొనుచుండెనని ఫ్రిట్జ్ నాతో చెప్పెను. మేమొక పెట్టెబండిలో కూర్చొనియుంటిమి. నాప్రక్కనే ఫ్లేవియారాకుమారి యుండెను. అనాగరకుడొకడు బిగ్గఱగా 'వివాహమెప్పు'డని యఱ చెను. ఆమాటల కామెవదన మెఱుపెక్కెను.

ఇప్పుడు నాకొక క్లిష్టపరిస్థితి యేర్పడెను. రాకుమా రికిని రాజునకును గల ప్రేమ, చనవు ఎట్టివో నేను శాస్త్రనడిగి

తెలిసికొనుట మఱచితిని. నేను రాజే నైయుండిన నాకీవిష యము సంతోషదాయకముగ నుండెడిది. కాని నాస్థితి నాకే యర్థముకాక నేనేమియు పలుకక యూరకుంటిని. తరువాత నామె నెమ్మదిగ 'రూడాల్ఫ్! ఈదినము నీవేమో వింతగా కనబడుచున్నావు.' అనెను. ఆమె సత్యమేపలికినను ఆమాటలు నన్ను కలవరపఱచెను. ఆమె మఱల నిట్లనెను. 'ఎప్పటికంటె నాలోచనలో మునిగినట్లున్నావు. కొంత కృశించినావు కూడ. ఏదో తీవ్రముగ నాలోచనలో నవసిపోవుచున్నావేమో?'

నేను: (మృదువుగ) 'అది నీకు సంతోషమా?' యంటిని.

ఆమెకన్నుల నటువైపుతిప్పి 'నామనసు నీవెఱుగుదు' వనెను. నేను 'నీ యభీష్టానుసారము వర్తింప యత్నింతు' నంటిని. ఆమె యీమాటలకు నవ్వుచు మరుక్షణముననే గంభీరముగ 'ఈదినము మైకేలును గమనించితివా?' యనెను.

నేను: అవును. అత డంత యుత్సాహముగ కనుపించలేదు.

ఫ్లే: నీవు చాల హుషారుగ నుండవలెను. ఆతనిపై తగినంత 'నిగా' యుంచవలెను. నీకు తెలియునా......"

నేను: తెలియును. నాకు సంక్రమించినదాని నాతడు కోరు చున్నాడు.

ఇంతలో మేము రాజమందిరము చేరితిమి. వెంటనే తుపాకులు తూర్యములు మ్రోగెను. ఇరువైపుల భటులు బారులు తీరియుండిరి. ఫ్లేవియా రాకుమారి చేయిపట్టుకొని

చలువరాతి మెట్లెక్కి లోన ప్రవేశించితిని. లాంఛనప్రాయ ముగ రాజమందిరము నా స్వాధీనమయ్యెను. నేను బల్లముందు కూర్చుంటిని. ఫ్లేవియా నాప్రక్కన కుడివైపున కూర్చుండెను. ఆమెకు మరియొకవైపున మైకేలుండెను. నా యెడమవైపున కార్డినల్ కూర్చొనెను. నా యాసనము వెనుక శాప్టు నిలుచుండెను. బల్లకడపట ఫ్రిట్జ్ కూర్చొనియుండెను. అందరికిని మద్య మివ్వబడెను. ఫ్రిట్జ్ మాత్రి మందరికంటె ముందుగ తన గ్లాసును ముగించెను. ఈసందర్భమున రురిటేనియారాజేమిచేయుచుండెనోగదా యను తలంపు నాకు కలిగెను.

## 6

నేను, శాప్టు, ఫ్రిట్జు ముప్వురును రాజుగారి దుస్తుల గదిలో నుంటిమి. ఆయాసముతో నేనొక కుర్చీలో కూలబడి యుంటిని. శాప్టు పొగగొట్టమును పీల్వసాగెను. మా సాహస చర్య జయప్రదముగ నెరవేరినందు కాత డభినందనపూర్వక ముగ నొక్క పలుకేనియు పలుకలేదు. కాని యాతనితో నొక సంతృప్తి కనబడుచుండెను. ఈ విజయమువలన ఫ్రిట్జ్‌లో గూడ నొక నూతనచైతన్య ముదయించెను.

ఫ్రిట్జ్: ఈదినము నీకెంత మరపురానిది? పండ్రెండు గంటల కాలమైనను నేను రాజుగ నుండగోరుదును. రాసిండల్! నీవుమాత్రిము నీపాత్రిలో పూర్ణముగ లీనముకారాదు. నల్లమైకేలుముఖము నేడు మరియు నల్లనయ్యెను. నీవును

రాకుమారియు మాటాడుచుండిన దాతని కింకను కంట
గింపుగ నుండెను.

నేను: అబ్బా ఆమె యెంత శృంగారవతి!

శాప్: బయలుదేఱుటకు సిద్ధముగ నుంటివా?
నేను నిట్టూర్చుచు 'సిద్ధమే' యంటిని.

అప్పు డైదుగంటలు. పండ్రెండింటికి నేను రూడాల్ఫ
రాసిండల్ మాత్రమే. ఈవిషయమును సూచించుచు హాస్య
ధోరణిలో నొకమాట యంటిని.

శాప్: ఇంతలో నీవు కీర్తి శేషుడవు కాకున్న నీయదృష్టము
మైకేలునకు జండానుండి వార్తయందుట నీవెఱుగ
వేమో కదా! ఆతడు దాని నొక గదిలో చదువుకొని
రూక్షాకుడై బయటికి వచ్చెను.

ఈవార్త వినగానే ఇంకేమాత్రి మాలసించుటకును
నాకు బుద్ధి పుట్టలేదు. 'బయలుదేఱుటకు సిద్ధముగనుంటి'
నంటిని. శాప్ ఆసీనుడయ్యెను.

'ఈపట్టణమునకు మైకేలు పాలకుడు. ఆతని యెఱుక
లేనిదే మన మీప్రదేశము విడుచుటకు వీలులేదు. రాగల
యాటంకముల నధిగమించుటకు వలయు నుత్తర్వొ నొక దానిని
వ్రాయవలసియున్నది. దానికి నీ చేవ్రా లవసర' మనెను.

అందుకు నేను 'మిత్రుడా! సృష్టన నాకు రానివిద్య'
యంటిని. శాప్ జేబునుండి యొక కాగితపుముక్కను బయటికి

తీసెను. 'ఇందులో రాజుసంతక ముస్న'దని మరియొక జేబునుండి యొక యుల్లిపొరవంటి కాగితమును వెతకి తీసి "ఇదిగో యీ పలుచని కాగితము. పదినిమిషములలో నీసంతకము నకలును తయారు చేయజాలనిచో...... ఎందుకులెమ్ము... నేనే యాపని చేయగలను" అనెను. సిద్ధహస్తుడగు నా సాహసి త్వరలోనే దానినకలు నొకదానిని సిద్ధపఱచి యిట్లనెను. 'ఫ్రిట్జ్! నీక ర్తవ్య మును చెప్పెద వినుము. రాజు అలసి నిద్రించును. నీవు కావలి యుందువు. రేపు ఉదయము తొమ్మిదిగంటలవఱకు నతని నెవ్వరును దర్శింప వీలు లేదు. ఎవ్వరును—తెలిసినదా? నీప్రాణ ముండగా నెవరును లోనికి ప్రవేశింపకుందురుగాక!

ఫ్రిట్జ్: నీవు నాకు పాఠము నేర్ప నవసరము లేదు.

శాప్ట్ తరువాత నావైపు తిరిగి 'ఇదిగో ఈ మేలిముసు గును యీటోపీని ధరింపుము. నా యశ్వరక్షకునివలె నీరాత్రి పేట విడిదియొద్దకు నన్ననుసరించి రమ్ము' అనెను, నేనందులకు 'సరే' యంటిని.

ఫ్రిట్జ్ ముందు రాగల సంభవముల దలంచి యెటుపోయి యెటువచ్చునో యని హృదయపూర్వకముగ నా కరచాలనము కావించెను. శాప్ట్ 'చాలులెమ్ము. పోద"మనెను.

శాప్ట్ నన్ను మందిరద్వారముకడకు తీసికొనివెళ్ళక గోడలోని యొక రహస్య ద్వారముగుండ యిరుకైన యొక మార్గమున రాజమందిరోద్యానము వెనుకనుండు నిర్జనమగు బాటలోనికి దీసికొనివెళ్లెను. అచ్చట రెండు తురగములు

సిద్ధముగ నుండెను. వాని నధిరోహించి మే మొక్క నిమిషమున బయల్దేఱితిమి.

పట్టణములోని జనుల కోలాహలధ్వనులు, దేవాలయము లోని గంటల మోతలు ఇంకను వినిపించుచునేయుండెను. మేముమాత్రము జనులంతగాలేని త్రోవలలో వెళ్లి పట్టణపు సింహద్వారమును చేరితిమి. శాస్ట్ 'ఆయుధమును సిద్ధముగ నుంచుకొనుమ'ని హెచ్చరించెను. వెంటనే ద్వారరక్షకుని పిలిచెను. రాజుగారి దర్శనార్థ మాత డేగెననియు, తాను వచ్చువఱకు ద్వారము తెఱవరాదని చెప్పినాడనియు నాతని కూతురు మాతో చెప్పెను. శాస్ట్ ఆమెకు రాజుగారి యుత్తరువు నిచ్చి తండ్రికిమ్మని యామె చేతిలోని తాళపుచెవి నందుకొని బీగము తీసెను. మేము బయటికి పోయి యాబాలిక కొక నాణ్యమొసగి యథారీతిని ద్వారబంధనము కావించి బయలు దేఱితిమి. పట్టణసమీపమున మా గమనము మందముగ నుండెను. చీకటిపడుకొలది మా గమనవేగ మతిశయించెను. అంతలో చంద్రోదయమయ్యెను. త్రోవలో నేను 'డ్యూకునకు వచ్చిన జాబులో నేముండెనో' యంటిని.

శాస్ట్: అదియే వాకును యొక సమస్యయైనది.

మేము సుమారిరువదియైదుమైళ్లు పోయినతరువాత శాస్ట్ హఠాత్తుగ ఆగెను. 'ఇదిగో వినుము' అనెను. అపుడం దాజు రాత్రి తొమ్మిదిన్నరగంట లైయుండవచ్చును. నేను చెవిటిక్కించి వింటిని. దూరమున నానిశ్శబ్దవాతావరణమున

హాయఖురధ్వని వినవచ్చెను. నేను శాప్ వైపు చూచితిని. అతడు 'పోవుదము ర'మ్మనుచు దాడుతీసెను. కొంతసేపట్లు పోయి నిలిచితిమి. అప్పటికి మా కేధ్వనియు వినరాలేదు. కావున మందగతిని పోనారంభించితిమి. ఇంతలో మరల నశ్వ ములసవ్వడి వినవచ్చెను. శాప్ తురగావతరణము గావించి చెవులను నేలకానించి కొంతసే పాలకించి 'ఇద్దరాశ్వికులు వచ్చుచున్నారు. వారు సుమా రొక మైలుదూరమున నున్నా' రనెను.

మేమిప్పుడు జండాయడవి సరిహద్దున నుంటిమి. అరగం టలో రెండుదారులు కలియుచోటికి వచ్చితిమి. శాప్ గుఱ్ఱము నాపి 'మనము కుడికి పోవలెను. ఎడమవైపుతోవ జండాదుర్గ మునకు పోవును. ఈ బాట లెనిమిది మైళ్లు గలవు. దిగు'మనెను.

నేను: ఇంతలో వారు మనల కలిసికొందురు.

శాప్: ఉండనిమ్ము. దిగుము.

వెంటనే దిగితిని. ఆబాటయంతయు నిరుప్రక్కల దట్ట మైన చెట్లసమూహాముచే దుర్గమమై యుండెను. మా యశ్వ ముల బాట ప్రక్కన నున్న దట్టమగు చెట్లనడుమ వదలి రహస్యముగ దాగియుంటిమి.

నేను: వారెవరో చూడగోరుచుంటివా?

శాప్: అంతేకాదు. ఎచ్చటికి పోవుచున్నారో కూడ తెలిసికొన గోరెదను. అతని రివాల్వర్ చేతిలోనుండెను.

గుఱ్ఱపు గిట్టలసవ్వడి రానురాను మా సమీపమున వినిపింపసాగెను. పూర్ణచంద్ర చంద్రికాప్రసారమున బాట యంతయు ధవళకాంతు లీనుచుండెను.

శ్టాప్: ఇదిగో వారు వచ్చుచున్నారు.

నేను: అతడు డ్యూకు.

శ్టాప్: నే ననుకొన్నట్లే.

ఆతడు డ్యూక్యే. అతని వెంట యాతని యంగరక్షకుడు న్యూక్సెసోఫ్-(జొహాన్ సోదరుడు) ఉండెను. వారు మాదాపునకే వచ్చిరి. డ్యూక్ తన ఘోటకము నాపెను. శ్టాప్ వ్రేళ్లాతని రివాల్వరు పేల్చుయత్నమున నుండుట నేను గమనించితిని. మైకేలుపై నొక గుండుపారించిన నెంతయో బాగుండునని యాతడు భావించుచుండెను. ఇంతలో నే నాతని భుజముపై చేయివేసితిని. లేదులెమ్మ'నుచు నాతడు తలయూచెను.

మైకేలు: ఏత్రోవలో పోవలయును?

అనుచరుడు: ప్రభూ! మనము దుర్గమున కేగవలయును. అచ్చట మనకు నిజము తెలియును.

ఒక్క-క్షణము మైకేలు సంశయముతో నిలుచుండెను. 'గిట్టలశబ్దము వినవచ్చె ననుకొంటిని'

'లేదు ప్రభూ'

'వేటవిడిదికే మన మేల పోరాదు?'

'నా కేదో యనుమానముగనున్నది. అంతయు నిరపాయ ముగ నుండిన మనమేల విడిది కేగవలయును? కానిచో మనల బంధించుట కిదియొక పన్నుగడయగును.'

ఒక్కనిముసమూగి మైకేలు 'సరే. జండాదుర్గమునకే పోవుదమ'నుచు గుఱ్ఱము నదలించెను.

పదినిసములు మేమున్నచోటనే యుంటిమి. శాప్టె చూచితివా? అంతయు నిరపాయమని యాతనికి వార్త నంపియున్నారు.'

'ఆమాటల కర్థమేమి?'

'దేవునకే ఎఱుక'

అతనిబొమలు ముడివడియుండెను.

వెంటనే యశ్వముల నెక్కి బయలుదేఱితిమి. ఆ యెని మిదిమైళ్లు ముగియువఱకు మే మేమియు మాటాడలేదు. భీతపరీతచేతస్కులమై యుంటిమి. 'అంతయు నిరపాయము' దీని యర్థమేమి? రాజు నిరపాయుడా?

వేటవిడిది కనుపించెను. మేము సింహద్వారమునఱకు నశ్వముల పోనిచ్చితిః అంతయు నిశ్శబముగ నుండెను. త్వరగా గుఱ్ఱముల దిగితిమి. హఠాత్తుగ శాప్టె నాచేయి పట్టు కొని 'ఇదిగో ఇటుచూడు'మని నేలపై చూపించెను. చూతున గదా నా పాదములచెంత పట్టుచేతిగుడ్డముక్కలై దాఱుపడి యుండెను. ప్రశ్నార్థకముగ నే నాతనివైపు చూచితిని.

'నేను ముసలిదానిని బాధించియుండిన గుడ్డలివియే'

మేము వెనుకటిరాత్రి కూర్చొనియుండిన గదిని ప్రవేశించితిమి. మేము తినగా మిగిలిన యాహారము పట్టెసీసాలు ఎక్కడివక్కడ చిందరవందరగ పడియుండెను. శాప్టు స్థైర్యము సైతము సడలియుండెను. ముసలియామెను బంధించియుండిన గదివైపు పోయితిమి. ఆ గదితలుపులు తెఱువబడియుండెను. 'ఆమెను కనుగొన్నారు' అంటిని. ఎదురుగానున్న మద్యముల గదికి పోయితిమి. అవి మూయబడియుండెను. మేము విడిచి వెళ్ళునప్పు డెట్లుండెనో యట్లే కనబడెను. 'శాప్టు! రమ్ము. 'దీనిని కనుగొన్నట్లు లేదు' అంటిని. శాప్టు కెవ్వున కేకవేసెను. ఆతనిముఖము వివర్ణమయ్యెను. ఆతడు మరల వాకిలివైపు చూపెను. ఆప్రాంతమందంతయు ఎండిన రక్తపుమరక లగుపించెను. వాకిలి తీయుటకు యత్నించితిని. దానికి బీగము వేసియుండిరి. శాప్టు ఫ్లాస్కునుతీసి పానీయమును త్రాగుచుండగ నేనొక గుండు ప్రేల్చి బీగమును పగులవేసి 'దీప మిమ్మంటిని. శాప్టు గోడ కానుకొని నిలుచుకొనియేయుండెను.

స్వామిభక్తియు, ప్రేమయు కలవాడగుటచే నాతనిలో నాకంటె ఎక్కువ కంపము కనవయ్యెను. ఆతనికొఱకు నాత డెప్పుడును భయపడ లేదు. కాని ఆయంధకారబంధుర గృహాంతరాళమున నేమియుండెనోయని తలంచినంతమాత్రమున నెట్టిధీరుని గుండెయైనను నీఱుగాకమానదు. ముఖము తెల్లబారక మానదు. నేనే మరొక్క గదినుండి యొక క్రొవ్వువత్తి వెలిగిం

చుకొని వచ్చుచుండ చేయి వణకి దీపము కదలుటచే కరగిన క్రొవ్వు నా చేతిపైపడెను. మరి శాస్ట్రికలవరపడుటలో చిత్రిమేమి? తరువాత గదివాకిలియొద్దకు వచ్చితిని. రక్తపు మఱకలు లోపలగూడ నుండెను. గదిలో రెండుగజములదూరమేగి చేతిలోని దీపమునెత్తి పట్టితిని. దూరమున నొకమూలలో నొక మానవశరీర మగుపించెను. ఆతడు వెల్లకిల పడియుండెను. చేతులు రెండును బారచాచియుండెను. కంఠముపై కత్తికాటుండెను. అది జోసఫ్‌శరీరము. రాజును రక్షించుటలో నాతడు విగతజీవుడయ్యెను. ఇంతలో శాస్ట్రివచ్చి నాభుజముపై చేయి వైచి గద్గదస్వరముతో భయకంపితశరీరుడై 'రాజు, రాజు'అనెను.

చేతనున్న దీపకాంతిలో గదినలువైపుల - ఒక్క-అంగుళముమేరయైనను వదలక—వెదకి 'రాజిచ్చట లేడు' అంటిని.

శాస్ట్రి నడుముచుట్టును చేయివైచి గదినుండి బయటికి వచ్చుటకు సాయ మొనరించితిని. సుమారు పదినిముసములకు పైబడి భోజనశాలలో కూర్చుంటిమి. ఆతడు చేతులతో కన్నుల రుద్దుకొనెను. గొప్పగా నిట్టూర్చెను. ఆతడు యథాస్థితికి వచ్చునంతలో నొంటిగంట కొట్టెను. ఆతడు నేలపై పాదతాడనము చేయుచు 'రాజు పట్టుపడినాడు' అనెను. నేను "ఔను, 'అంతయు నిరపాయముగ నున్న'దను జాబాతని కెప్పుడు వచ్చెనో" యంటిని. 'ఆజా బాతని కీయుదయమే చేరియుండ

వలెను. స్ట్రెల్సాకు నీవు చేరితివనువార్త జండాకు చేరుటకు ముందే యీవార్త నంపియుండవలెను.'

'ఆ వార్తాహరుడు దినమంతయు శ్రమపడి దానిని తెచ్చియుండును. ఆవార్త వినియు మైకేలు మనసు చిక్కబట్టుకో గలిగెను. ఐన నేడు కష్టపరంపరలకు లోనైనవాడను నేనొక్కడనే కాను" అనుచు లేచి నిలుచుంటిని. 'మనము వెనుకకుపోయి స్ట్రెల్సా లోని ప్రతి సైనికుని మేలుకొల్పి మధ్యాహ్నము లోగా మైకేలును వెన్నాడవలెను'

శాప్టె పొగపీల్చుచు కూర్చుండియుండెను. మాటాడ లేదు. నేను మఱల 'మనమిచ్చట కాలము వృథచేయుచు కూర్చుండిన వారు రాజును చంపవచ్చును' అంటిని. శాప్టె క్షణ మూరకుండి తరువాత 'ఆ ముసలిముండ ఎట్లో వారిదృష్టి నాకర్షించి యుండవలెను. ఇప్పుడు నాకంతయు నర్థమగు చున్నది. వా రిచ్చటకు రాజు నెత్తుకొనిపోవుటకు వచ్చియుం దురు. ఎట్లో ఆతని కనుగొనియుందురు. స్ట్రెల్సాకే పోకుండి నచో మనము ముగ్గురమును నీవు, నేను, ఫ్రిట్జ్ - ఈసరికి స్వర్గమున పాతకాపులై యుందుము' అనెను.

నేను: రమ్ము. మనము వెడలిపోవుదము.

శాప్టె కదలలేదు. పకాలున నవ్వి 'మనము మైకేలును ముప్పుతిప్పలుపెట్టి మూడు గుంటలనీరు త్రావించినట్లే' యనెను.

నేను: సరే లెమ్ము. లెమ్ము.

అతడు: ఇంతేచాలదు. ఇంకను కొంచె మాతని నేడ్పింతము. మనము స్ట్రెల్సాకు మరలిపోవలెను. రాజు రేపు మరల రాజ ధానిలో నుండునుగాక!' అనుచు నాతఁడొక వింత నవ్వు నవ్వెను.

నేను: రాజా?

శ్రాస్ట్: ఔను, పట్టాభిషిక్తుడైన రాజు.

నేను: నీకు పిచ్చియెత్తినట్లున్నది. మనముపోయి మనమాడిన నాటకమునుగూర్చి తెలిపినచో మన బ్రతుకులు గ్రుడ్డి గవ్వకు తరమగునా? సింహాసనముగతి యేమగును? ప్రజలను ప్రభువుల నంతగా మోసగించితివే, దానికై వారు సంతసింతు రనుకొంటివా!

శ్రాస్ట్: తప్పత్రాగి మత్తిల్లి మైమరపుతో పట్టాభిషేకమునకు ప్రతినిధినంపిన రాజును, జను లెంత గౌరవింతురనుకొం టివి? అనుచు లేచి అతడు నా భుజముపై చేయివేసి 'యువకుడా! నీపాత్రను నీవు సరిగా నిర్వహించిన రాజును కాపాడుట కింకను అవకాశమున్నది. వెనుకకు పోయి యాతని స్థానమును రక్షింపుము' అనెను.

నేను: డ్యూకునకును ఆతనిచే నియుక్తులైన దుండగీండ్రకును. ఈవిషయము తెలియును.

శ్రాప్ట్: (నవ్వుచు) కాని వారు నోరు మెదల్పజాలరు. తమ తప్పు బయలుపెట్టక నీవు మోసకారివని వా రెట్లన

గలరు? కారణమేమన 'ఇతడు రాజుకాడు. సేవకుని చంపి రాజు నెత్తికొనిపోయితి' మని వారు చెప్పగలరా?

అప్పటికి పరిస్థితులు నామనసునకు వచ్చెను. మైకేల్ మాటాడ లేదు. రాజును చూపగలిగిననే కాని యాతడు నన్నేమి చేయగలడు? ఒకవేళ నది సంభవమేయగుచో రాజు నెత్తుకొని పోయినందుల కాత డేమికారణము చూపగలడు?

శాప్ట్: అన్నిటికంటె ముఖ్యమైనది స్త్రెల్సాలో రాజొక డుండవలెను. లేనిచో నిరువది నాలుగు గంటలలో నగరము మైకేలు వశమగును. కావున నీవాపని చేసితీరవలెను.'

'వారు రాజును చంపిన'

'నీవాతనిస్థానమున నుండనిచో వారాతని చంపుదురు'

'అట్లుకాదు. ఒకవేళ వారాతని చంపినారనుకొందము'

'అయిన మైకేలెంత ఎల్ఫ్బర్గ్ వంశీయుడో నీవునంతే. కావున నీవే రురిటేనియాను పాలింపగలవు'

శాప్ట్ మాటలు వినుచున్నకొలది మా పథకములోని బలవత్తరాంశములన్నియు నా మనసును హత్తినవి. యువకుడనుగాన నాకు కార్యోత్సాహము మెండు. ఈ నాటకమందలి నాపాత్ర 'నభూతో నభవిష్యతి' యనుకొంటిని.

శా: సరే. స్టెప్రిల్సా చేరుకొందము. మన మిచ్చటనే నిలిచి పోయితిమా బోనులోపడిన ఎలుకలవలె మనస్థితి క్లిష్ట తరమగును.

నేను: శాప్ట్, కానిమ్ము. ప్రియత్నింతము. వెడలుదము రమ్ము.

శా: ఆ. అట్లుండవలెను. వారు మనకై గుఱ్ఱముల విడిచి యేగిరేమో చూచివత్తును.

నేను: మనము జోసఫ్‌ను పాతిపెట్టి పోవలెను.

శా: ప్రొద్దులేదు.

నేను: నే నావని కావింతును.

శా: (నవ్వుచు) నేను నిన్ను రాజుగావింప నీవు - సరే. కానిమ్ము. ఆ శవమును తెమ్ము. నే నింతలో హయా న్వేషణము కావింతును. పాపము జోసఫ్ విశ్వాస పాత్రుడు. బహు యోగ్యుడు.

నేను గదిలోనికి పోయి జోసఫ్ కళేబరమును మోసి కొని వాకిలియొద్దకు వచ్చితిని. ఇంతలో శాప్ట్ నా కెదురు వచ్చి 'గుఱ్ఱములు సిద్ధముగ నున్నవి. కాని యీపని నీవు చేయ నక్కఱలే' దనెను.

నేను: ఇతనిని పూడ్చువఱకు నే నిచ్చటినుండి కదలను.

శా: అట్లు కాదు. ఇటు రమ్ము

అని నన్నాతడు బయటికి పిలుచుకొని పోయెను. చంద్రా స్తమయ మగుచుండెను. సుమారు మున్నూరు గజముల

దూరమున జండానుండి వచ్చు బాటలో కొందఱు మనుష్యులు వచ్చుచుండుటను చూచితిని. వారు సుమారు పదెనిమిది మంది యుండిరి. నలువు రాశ్వికులు. మిగిలినవారు పాద చారులు, వారి భుజములపై పారలుండెను. శాప్ట్ వారిని నాకు చూపి "చూచితివా? నీవు శ్రమపడ నక్కఱలేకుండ వారే యీపని కావింతురు. కావున వెడలుదము రమ్ము." అనెను.

అతడు చెప్పినట్లు వారు మైకేలు సేవకులై యుండ వలెను. తమ పాపకృత్య చిహ్నముల తొలగించుటకై వారు నియమితులై యుందురు. ఇంతలో నాకొక కోరిక యుద యించెను. జోసఫ్ శవమును చూపి 'శాప్ట్, మన మీతని చావునకు ప్రతిక్రియ కావింపవలెను' అంటిని.

శా: ఇతని కొక్కని తోడుగా పంప నిష్టపడితివేమో కదా? కాని ప్రభూ! ఇది చాల యపాయకరమగు కార్యము.

నేను: ఎట్లైనను దెబ్బ తీయవలెను.

శాప్ట్: (సందేహించుచు) సరేకాని యిది యిప్పుడు చేయవల సిన పనికాదు. ప్రమాదము సంభవించిన - పోసీ పీడ వదలును. ప్రతీకారమునకు నేను నీకు మార్గమును సూచింతును.

అంతట మే మిరువురమును తెఱచిన వాకిలిని మూసి లోనికేగి దొడ్డివాకిలి చేరితిమి. మా గుఱ్ఱము లిచ్చటనే యుండెను. మా యాయుధములను సిద్ధముగ నుంచుకొని

గుఱ్ఱముల నెక్కితిమి. ఒకటి రెండు నిమిషములు నిశ్శబ్దముగ నుంటిమి. ఇంటి తలవాకిలివైపు గుఱ్ఱము లాగినధ్వని విన వచ్చెను. వారిలో నొక్కడు 'ఆ శవమును బయటికి తెండు' అనుట మాకు వినిపించెను. శాస్ట్ వెంటనే కదలుమని సైగ చేసెను. ఒక్క క్షణములో మే మిరువురమును దుండగీండ్రి చేరితిమి. ఒక్క దెబ్బతో నేనొక యాశ్వికుని తల ద్రుంచితిని. ఆతడు నేల కొఱగెను. ఇంతలో నాయెదుటను, కుడిభాగము నను నొకొక్కడు సిద్ధమైయుండెను. నేను నా యశ్వము నదలించుచు ముందున్నవాని హృదయము నాటుకొనునట్లు నా ఖడ్గమును వైచితిని. ఆతని తుపాకిగుండు నా చెవిసోకుచు దాటిపోయెను. నా ఖడ్గము నాతని యెడదనుండి యూడ బెఱుకుటకు యత్నించితిని. నా ప్రియత్నము ఫలింపలేదు. వెంటనే యిరువది గజముల దూరమున నుండిన శాస్త్రురు కలిసి కొంటిని. తుపాకి గుండొకటి తగులుటచే నా చేతివ్రేలు తెగియుండెను.

శా: నావంతు కొక్కడు - నీపాలి కిద్దరు - జోసఫ్‌కు తోడుం దురు లెమ్ము.

నేను: ఓ. నేను చాల యుద్రిక్తుడనై యుంటిని. వారిని చంపి నందున నాకు తృప్తి కలిగినది.

శా: వారు నిన్ను గుర్తించి రేమో!

నేను: ఆ పెద్దవాడు నన్ను గుర్తించెను. నాద్రేటు తిని యాతడు 'రాజు' అని యఱచుట నేను వింటిని.

అతడు: సెబాస్ మంచిదైనది. మనపని ముగియునంతలో
మైకేలునకు చేతినిండుగ పనియుండును లెమ్ము.

మే మచ్చట త్రుటికాల మాగి రక్తము స్రవించు చుండిన నా వ్రేలి గాయమునకు కట్టు కట్టికొని బయలుదేఱితిమి. మా యభీష్టము తీరెను. అప్పుడే ముగిసిన యుద్ధోద్రేక మణగారిపోయెను. మే మిరువురము నాలోచనా నిమగ్నులమై పయనము సాగించితిమి. తెల్లవారెను. చలి ఎక్కువగ నుండెను. అప్పుడప్పుడే మేల్కొన్న యొక రైతు నడిగి మాకును మా హయములకును కొంత యాహారమును సంపాదించితిమి. మరల పయనము సాగించి ఉదయము ఎనిమిది గంటలకు స్ట్రెల్సా చేరితిమి. పురద్వారము లన్నియు తెఱువబడియుండినవి. వెనుకటి సాయంతన మేరాత్రివగుండా వచ్చితిమో యారాత్రివలోనే వెళ్ళితిమి. మేమును మా వాజులును శాంతి నొందియుంటిమి. వీధులన్నియు నింకను నిర్మానుష్యములై యుండెను. రాజమందిరమును చేరితిమి. మేము ప్రవేశింపనున్న ద్వారముకడ శాప్ట్ అశ్వరక్షకుడు మాకొఱకు వేచి యుండెను.

అ. ర: అంతయు సేమమే కదా?

శా: ఓ.

ఆతడు నాచేయి ముద్దుగొనుటకై వచ్చి 'రాజునకు దెబ్బ తగిలినది' అనెను. నేను గుఱ్ఱము దిగుచు 'ఆ ఏమియు లేదు. నావ్రేలు తలుపుసందులో చిక్కుకొనుటచే కొంచెము

గాయమైనది' యంటిని.

శాప్టు తన యశ్వరక్షకుని చూచి 'సరే. మౌనము వహింపుము. నీకు చెప్ప నవసరములేదు లెమ్మనెను. ఆతడు మరి మాటాడలేదు. మేము లోనికేగితిమి. ఫ్రిట్జ్ సోఫాపై పరున్నవాడు మా యలికిడి విన్నంతనే మేల్కొనెను. లేచి మమ్ముచూచి సంతోషముతో నాముందు మోకరించి 'అబ్బా, మీరు క్షేమముగ నున్నారు. దేవునికి వేయి వందనములు.' అనుచు నాచేతి నందుకొనెను. నా హృదయము ద్రవీభూతమయ్యెను. ఈ రాజు - ఎన్ని లోపములున్నను - ప్రజల ప్రేమను చూఱగొన్నాడు. ఫ్రిట్జ్ నన్ను రాజుగా భావించి యీమాట లనియుండెను.

శా: శబాస్! మనపని విజయవంత మైనట్లే.

ఫ్రిట్జ్ విభ్రాంతుడై నామూర్తి నాపాదమస్తకము రెండు మూడు పర్యాయములు ఱెప్పవేయక పరిశీలించెను. ఉన్నదున్నట్లుగా నాతడు నా చేయివదలి 'రాజెక్కడ? రాజెక్కడ?' అని ప్రశ్నించెను.

శా: బుద్ధిహీనుడా! అంత బిగ్గఱగ నఱచిన నెట్లు? ఇతడే రాజు.

ఇంతలో తలుపు తట్టిన చప్పుడు వినిపించెను. శాప్టు నాతో 'ఊ. త్వరపడుము. శయ్య చేరుము. పాదరక్షలను తలపైనుండు టోపీని తొలగించి నిండుగా కప్పుకొని పరుండుము' అనెను.

నేనాతడు చెప్పినట్లు చేసితిని.

త్వరలో మహాచతురుడగు నొక యువకుని నాకు పరిచయము కావించిరి. ఆతడు నాదాపునకు వచ్చి పలుమరు నమస్కరించెను. ఫ్లేవియా రాకుమారి వెనుకటిరోజు కార్యభారముచే నలసియున్న నా యారోగ్య మెట్లున్నదో విచారించిరమ్మని ప్రత్యేకముగ నాతని నాకడ కనిపియుండెను. నే నాతనితో 'ఆమెకు నా యభివందనముల తెలుపుము. నేను చాల హాయిగ నున్నాననుము' అంటిని.

శా: రాజుగారికి నిన్నటి రేయి గాఢనిద్ర పట్టినది. తెల్లవారువరకు మెలకువయే లేదు.

ఆగంతుకవ్యక్తి మరల నమస్కరించి వెడలిపోయెను. ఫ్రిట్జ్ మెల్లగ 'రాజు మృతుడయ్యెనా' అని యడిగెను.

నేను: లేదు. దేవుని దయ! కాని యాతడు మైకేలు అధీనమున నున్నాడు.

## 8

నిజమగు రాజు జీవితము బహు కష్టసహితము; కాని వేషధారియగు రాజు జీవితము కష్టతరము. శాప్ట్ మరునటి రోజు నాకర్తవ్యమునుగూర్చి సుమారు మూడు గంటలకాలము బోధించెను. తరువాత ప్రాతఃకాల ఫలాహారమును ముగించితిని. పిదప కార్యదర్శి వచ్చెను. ఆతనితో మూడు గంటలు

కడచెను. నా వ్రేలి గాయమునుగూర్చి యాతనికి వివరించితిని. అదృష్టవశమున కల్గిన యీ గాయమువలన నే నేమియు వ్రాయు నవసరము కలుగలేదు. తుదకు ఫ్రాన్సు దేశపు రాయబారి వచ్చెను. ఆతడు వెళ్లిన తరువాత నా కేకాంతము లభించెను.

నా క్రొత్తసేవకుని పిలిచి బ్రాందీ తెప్పించి త్రావితిని. ఈ క్రొత్తసేవకుని జోసఫ్‌కు బదులుగా నియమించియుంటిని. ఇతనికి రా జపరిచితుడు. ఇంకనైనను నాకు విశ్రాంతి లభించు ననుకొంటిని. ఇంతలో ఫ్రిట్జ్ "మనము వృథాగా కాలయాపనము చేయుచున్నాము. నల్లమైకేలును పట్టుకొనుటకు పోవుట లేదా!" యనెను.

శా: కొంచెము నిదానించుము నాయనా మైకేలు చచ్చి రాజును బ్రతుకనిచ్చునా?

నేను: రాజు సుఖముగ నిచ్చట నుండగా ప్రియసోదరుడగు మైకేలుపై నాతని కేమిపగ?

ఫ్రి: అయిన మనమిప్పుడు చేయవలసిన దేమియు లేదని యేనా?

శా: ఔను. ఏమియు తెలివిలేని పని చేయ నవసరము లేదు.

నేను: ఫ్రిట్జ్! నామాట వినుము. మైకేలు రహస్యము రచ్చకెక్కవలెననిన బయటపడవలసినది నా రహస్యము.

శా: మరియు రాజు రహస్యము.

నేను: నన్ను రచ్చకీడ్వదలంచిన మైకేలు బయటపడక తప్పదు

శా: ఔను. ఇది చాల బాగున్నది.

నేను: నన్ను వారు గుర్తించిరా నేను మైకేలుతో పోరుటకు సిద్ధముగ నున్నాను. మైకే లేమి చేయునో చూతమని కాచుకొన్నాను.

ఫ్రి: ఆతడు రాజును చంపును.

శా: ఊహూం. ఆతడు చంపడు.

ఫ్రి: ఆరుగురిలో. ముగ్గురు స్ట్రెల్సాలో నున్నారు.

శా: (ఆతురతతో) ఆఁ. ముగ్గురేనా? ఖండితమేనా?

ఫ్రి; ఔను, ముగ్గురే.

శా: అయిన రాజు సజీవుడే. మిగిలిన మువ్వురు రాజునకు కావలి యుందురు.

ఫ్రి: అవును. నీమాట సత్యము. రాజు చచ్చియుండిన వారెల్లరు మైకేలుతోనే యుండెడివారు. మైకేలు మరలి వచ్చియున్నాడు. తెలియునా?

శా: ఆఁ. తెలియును.

నేను: ఆ యారుగురు నెవ్వరు?

శా: త్వరలోనే వారి పరిచయభాగ్యము నీకు కల్గును లెమ్ము. మైకేలు ఆర్గురు యువకులను పోషించుచున్నాడు. ఆతనికై వారు ప్రాణములనైన బలి గావించుటకు సిద్ధము. వారిలో ముగ్వురు రురిటేనియనులు. ఒకడు ఫ్రెంచివాడు. ఒకడు బెల్జియను. మరొక్క డింగ్లీషు వాడు. ఇచ్చట నుండువారెవ్వరు? ఫ్రిట్జ్!

ఫ్రి: డిగ్రెట్, బెరొన్సినిక్, డిచర్డ్.

శా: వీరు ముప్పురును విదేశీయులే. దురిశేనియనులను ముప్పురను రాజుకు కావలా యుంచినాడు కాబోలు!

నేను: వేటవిడిదియొద్ద వీరెవ్వరు నుండలేదేమో కదా!

శా: ఉంపీయుండిన బాగుండెడిది.

నా మనసులో నేమున్నదో నా యాంతరంగికులకు గూడ తెలుపకయే ముందు నేను చేయవలసిన పనిని గురించి పూర్తిగ నిశ్చయించుకొంటిని. నేను సాధ్యమైనంత ప్రజాభిమానమును చూఱగొనుటకు యత్నించుచు మైకేలునుగూడ నభిమానింప నెంచితిని. ఇట్లు చేసినచో నొకవేళ మైకేలుతో బహిరంగముగ తలపడవలసి వచ్చినచో నాతనియెడ నే నుదారముగ ప్రవర్తించినను నాతడే కృతఘ్నుడయ్యెనని ప్రజల కాతనిపై నేవగింపు కల్గునని నే నాశించితిని. ఆతనితో ప్రత్యక్షకలహము కలుగదనియే నాయూహ. రాజుగారి సేమమునకై రహస్యవర్తన మవసరమయ్యెను.

నేను నాగుఱ్ఱమును తెమ్మని యాజ్ఞాపించి ఫ్రిట్ తోడు రాగా రాజోద్యానవు అందమగు బాటవెంబడి బయలుదేఱితిని. త్రోవలో నెందఱో నమస్కరించిరి. ఉచితరీతిని వారెల్లరికి ప్రతివందన మొనర్చితిని. ఇట్లు కొన్ని వీధులు దాటియొకచో నొక చక్కని బాలిక పూవు లమ్ముచుండ నొక బంగారు నాణ్యమిచ్చి పూలుకొంటిని. ఇంతలో నాచుట్టును కావలసినంతమంది జనులు చేరిరి. వారి దృష్టి నాకర్షింప

వలయుననియే నా కోరిక. వెంటనే ఫ్లేవియా రాకుమారి సదనమున కేగి యామెనుచూడ వీలగునేమో కనుగొనుమంటిని. నా యాచర్య మూగియున్న జనమున కుత్సాహజనకమయ్యెను. ఫ్లేవియా రాకుమారి ప్రజాభిమానమును చూఱగొన్నది. కార్యదర్శికూడ ఉదయము నాతో మాటాడుచు నే నామె యెడ నెంత చనవుగ ప్రవర్తించిన ప్రజలు నన్నంత యెక్కువగ ప్రేమింతురని సూచించియుండెను. ఈ మార్గము ననుస రించుటకు నాకుగల కష్టనష్టము లాతఁ డెఱుఁగఁడు. ఐన నొక్కసారి చూచి మాటాడించుటవల్ల కీడేమి లెమ్మని తలచి తిని. ఫ్రిట్జ్ సైత మందు కంగీకరించెను. అందున కేమి కార ణమా యని నేను తొలుత నచ్చెఱువందితిని. తరువాత కార ణము తెలియవచ్చెను. ఫ్లేవియా రాకుమారి అంతరంగికురా లగు హెల్గానతి నాతఁడు చూడ దలంచుచుండెను.

నేనాడుచుండు నాటకమున నాపాత్ర కష్టతమమైనది. అందులో నీ సన్నివేశము సూక్ష్మాతి సూక్ష్మమైనది. రాజ కుమారి యనురక్తిని పోనాడరాదు - కాని యామె నాయెడ నుపేక్షాభావము వహించునట్లు చేయవలెను. నా కామె యందు ప్రేమ యున్నట్లు నటింపవలెను. కాని చాపల్యా ముంచుకొనరాదు. నే నితరుల కొఱకు ప్రేమింపవలెను- అందునను అతిలోక సుందరియగు బాలికను. ఇట్టి సున్నితమగు కర్తవ్య నిర్వహణమున నే నెట్లు కృతకృత్యుడ నైతినో ముందు తెలియగలదు.

ఇంతలో నేను ఫ్లేవియా రాకుమారి యెదుటికి పోయితిని.

విజయపరంపర లందుకొనుచున్నారు. పట్టాభిషేకా నంతరము మీలో గొప్ప మార్పు కానవచ్చుచున్నది. మీరు ప్రభువు లనుమాటయే జ్ఞాపకముండుట లేదు ప్రభూ!

నేను: నీ యాత్మసాక్షికి వ్యతిరేకముగ నీవు మాటాడవలయు ననుట నా యభిమతము కాదు. నన్ను నా పేరుతో పిలిచిన చాలును.

ఆమె నావైపు క్షణము సేపు చూచి 'రూడాల్ఫ్! అట్లైన నాకు సంతోషము. నిజముగ నే నప్పుడే చెప్పినట్లు నీ ముఖమే మారినది' యనెను.

ఆమె స్తుతిని నే నంగీకరించినను యీ ప్రసక్తి నాకు ఫరిపడలేదు. కావున విషయమును మార్చితిని.

నేను: నా సోదరుడు తిరిగివచ్చినాడని వింటిని. ఆత డెచ్చ టికో విలాసయాత్రి వెళ్లియుండెనట కదా!

'అవును. అతడు మరలి వచ్చినాడు'

ఆమె ముఖమున విరస మగుపించెను.

'అతడు చాలకాలము స్ట్రెల్సాను విడిచియుండ నొల్ల నట్లు కనబడుచున్నది. ఈ విషయము మా కెంతో సంతోష దాయకము. అత డెంత దగ్గఱగా నున్న నంత మేలు'

రాకుమారి విస్ఫారితనయననై నావైపు చూచెను.

ఫ్లే: ఏల...అట్లైన నీవు...

నేను: అత డేమి చేయుచున్నాడో తెలిసికొనుటకు వీలగును. నీవేల యిందుకు సంతసించుచుంటివి?

ఫ్లే: నాకు సంతోషమని నే ననలేదే!

నే: అయిన మైకేలు బావ యెక్కడున్నను నీ కాక్షేపణ లేదన్నమాటేనా?

ఫ్లే: ఆం. మైకేలుబావ! అతని నేను స్ట్రెల్సా డ్యూకని పిలుతును.

నే: ఔను. ఆతని సమక్షమున మైకేలనియే సంబోధింతువు కదా?

ఫ్లే: అవును. మీ తండ్రి యాజ్ఞ మేరకు.

నే: అటులనా! ఇప్పుడు నా యాజ్ఞ మేరకా?

ఫ్లే: మీ యాజ్ఞయు నదియేనా?

నే: నిస్సందేహముగా. మనమెల్లరు నాతనియెడ అభిమానముతో మెలగవలయును.

ఫ్లే: అట్లైన నాతనినే కాక యాతని స్నేహితులను గూడ నే నాదరింపవలయు ననియేనా మీ యాజ్ఞ?

నే: ఎవరిని? ఆ యారుగురినా?

ఫ్లే: మీరును వారి నాపేరుతో పిలుతురేమి?

నే: ఔను. కాని నీకిష్టము లేకున్నచో ఎవ్వరినీ నీ వాదరింపవనిలేదు.

మేమిట్లు మాటాడుచుండగనే బయటినుండి యొక కోలాహలము వినిపించెను. ఫ్లేవియా కిటికీయొద్దకు పోయి

చూచి 'ఆతడు వచ్చుచున్నాడు. స్ట్రెల్సాడ్యాకు' అనెను. నేను నవ్వుచు విషయమును మార్చి మాటాడదొడగితిని. కొన్ని నిమిషములు గడచెను. మైకే లెక్కడ పోయెనో నా కెందుకు లెమ్మని యూరకుంటిని. ఇంతలో ఫ్లేవియా యాతు రతతో 'అతనికి కోపము వచ్చునట్లు ప్రవర్తించుట తగునా?' యనెను.

నే: ఏమీ! ఆతనికి కోపము వచ్చుటకు నే నేమి చేసితిని!

ఫ్లే: ఏమందువా? అతనిని కాచియుండునట్లు చేయుట

నే: లేదు. ఆతడు కాచుకొనియుండుట నా కిష్టము కాదు.

ఫ్లే: అయిన నాతడు లోనికి రావచ్చునా?

నే: అది నీ యిష్టము.

ఆమె నావైపు వింతగా చూచెను. 'వింతగా మాటా డుచున్నారే! నేను రాజుతో నున్నప్పు డెవ్వరికి ప్రవేశము లేదు.'

రాజరికములోని విశేషాధికార మిది. కడు చక్కగ నున్నది. రాకుమారి మనసు యింకను గజిబిజిగా నున్నట్లు కనుపించెను.

'ఈ చిన్న నిబంధనలు నాకు జ్ఞాపకమే యుండవు. అయినను నా తప్పు సవరించుకొందును' అంటిని. ఈ విష యము లన్నియు నాకు తెలుపనందుకు ఫ్రిట్జను మనసులో తిట్టుకొంటిని.

వెంటనే లేచి వాకిలి తీసి బయటి గదిలోనికి పోయితిని.

మైకేలచ్చట నొక బల్లయొద్ద కూర్చొనియుండెను. ఆతని బొమలు ముడివడియుండెను. అచ్చట నున్నవారెల్లరు నిలుచుకొని యుండిరి. ఫ్రిట్జ్ మాత్ర మొక కుర్చీపై కూర్చొని హెల్గాతో మాటాడుచుండెను. నేను ప్రవేశింపగనే ఆతడు దిగ్గున లేచి నిలుచుండెను. ఫ్రిట్జ్ పై మైకేలున కెంత క్రోధ మను విషయము గ్రహించుట నా కంత కష్ట మనిపించలేదు.

నే నాతనితో కరచాలనము కావించి యాలింగనము చేసి లోపలి గదిలోనికి తీసికొని వెళ్లితిని.
'సోదరా! నీ విచ్చట నున్నావని తెలిసియుండిన ఒక్క క్షణమైన కాచుకొనవలసిన యవసర ముండెడిది కాదు.'

ఆతడు న న్నభినందించెను. కాని కపటముగనే. అతడు ధీరుడేకాని తనలోని భావముల నణచుకొనలేకపోయెను. నన్నాతడు ద్వేషించుచుండెననియు, అందును నేను ఫ్లేవియా రాకుమారితో నుండుట నాతడు మరింత కంటగించుకొనుచుండె ననియు శ్రోత్తవారికి గూడ స్పష్టముగ తెలియునట్లుండెను. ఈ భావముల నన్నిటి నాతడు మాటు వఱచుకొనుట కెంతో ప్రయత్నించుచుండెను. అంతేకాక నేనే రాజునని తాను నమ్మినట్లు వర్తింప యత్నించెను. నా యెడ మర్యాదగ ప్రవర్తించుటకును, నేనే 'మైకేలు'నియు 'ఫ్లేవియా' యనియు సంబోధించుచుండ విని యోర్చుకొనుటయు నాతని కెంతో కష్టముగ నుండెను. ఆతడు నాయం దెంతో శ్రద్ధ గలవానివలె 'ప్రభూ! మీ చేతికి గాయమైనదే' యనెను.

నే నాతని రెచ్చగొట్ట దలచితిని.

'నే నొక సంకర శునకముతో నాడుకొనుచుంటిని.

ఆ కుక్కల బుద్ధిచపలత నీకు తెలియును కదా!'

ఆతడు విషపునవ్వు నవ్వి క్షణమాత్రము నావైపు తన దృష్టిని పఱపెను.

ష్లే: (ఆతురతతో) కాటు అపాయకరము కాదుకదా?

నే: ఆఁ. ఈ కాటువల్ల నపాయ మేమియు లేదు. కాని యీకాళే లోతుగా దిగుట కవకాశ మిచ్చియుండిన దాని విషయమే వేరుగా నుండెడిది.

ష్లే: కుక్కను చంపివేసినారా?

నే: ఇంకను లేదు. దాని కాటు అపాయకరమా కాదా యని చూడ వేచియున్నాము.

మై: ఆకాటు అపాయకరముగ పరిణమించిన?

నే: దాని తల బ్రద్దలగును.

ష్లే: ఇంక దానితో నాడవలదు. అది మరల కఱువ వచ్చును

నే: నిస్సంశయముగ నది ప్రయత్నించును.

అంతట నే నాతని సైనికదళమును, పట్టాభిషేక సమయమున రాజభక్తిపూరితమైన వారి నడవడిని, అడవిలో నా కేర్పఱచిన వేట విడిదిని తెగపొగడ జొచ్చితిని. నా మాటలను వినుట కాతనికి సహనము చాలలేదేమో, సెలవు పుచ్చుకొని వాకిలివఱకు పోయి మరల వెనుదిరిగి 'ప్రభూ! నాకు ముగ్గురు స్నేహితులున్నారు. వారు తమతోడి పరిచయ

భాగ్య మపేక్షించుచున్నారు. వా రాగదిలో నున్నా' రనెను.

నే నాతని చేయి పట్టుకొని నేరుగా వారున్న గదిలోని కేగితిని. ఆతని ముఖభంగిమ నాకు సంతోషదాయకముగ నుండెను. మైకేలు పిలువగనే వారు ముగ్గురును ముందుకు వచ్చిరి. మైకేలు గంభీరముగ 'వీరు ముగ్గురు నా స్నేహితులు. తమ సేవకులు. విశ్వాసపాత్రులు' అనెను.

వా రొక్కరొక్కరే నాచేతిని చుంబించిరి.

వారిలో మొదటివాడు డిగరెట్. ఆతడు పొడుగరి. బక్కపలుచనివాడు. తలపై వెంట్రుకలు నిటారుగ నిలిచి యుండెను. రెండవవాడు బెర్సోనిక్. బెల్జియం దేశీయుడు. అంత పొడవును కాదు; పొట్టియు కాదు; బట్టనెత్తి. కడపటి వాడు డిచర్డ్. ఆంగ్లేయుడు. చిన్నముఖము. దబ్బపండు వంటి శరీరచ్ఛాయ. ఇతనిని చూడగనే పయోముఖ విష కుంభమని భావించితిని. నేనాతనితో నింగ్లీషున విదేశీయుల యుచ్చారణ ననుకరించి మాటాడితిని. ఆతడు చిఱునవ్వు నవ్వెను. కాని మరుక్షణముననే దానిని మఱుగుపఱచెను. కావున నాతడీ 'రహస్య' మెఱుగునని తోచెను.

మైకేలును అతని స్నేహితులును నన్ను వదలిపోగానే రాకుమారితో సెలవుతీసికొనన బోయితిని. ఆమె వాకిలి యొద్ద నిలిచియుండెను. నే నామె చేయిపట్టుకొని, 'పోయి వత్తు' నంటిని.

ఆమె హీనస్వరమున 'రూడాల్ఫ్, నీవు కడు జాగ

యాకుడవై యుండవలెను. ఉందువు కదా!' యనెను.

నే: ఏ విషయమున?

శ్లే: నీ వెఱుగుదువు. నేను చెప్పలేను. నెమ్మదిగ నాలో చింపుము. నీ జీవిత మెంత విలువమైనదో —

నే: ఎవరికి?

శ్లే: రురికేనియాకు.

నే: రురికేనియాకు మాత్రమేనా?

హఠాత్తుగ నామె ముఖమున నించుక లజ్జ కనుపించెను. 'నీ స్నేహితులకు సైతము'

నే: స్నేహితులకా?

శ్లే: ఔను, నీ ప్రియదాసికిని.

నేను మాటాడలేకపోయితిని. ఆమెచేతిని ముద్దాడి బయటకు పోయితిని. ఆమె మాటలు నన్నలరించినవి. కాని యామెతో నింత చనవుగ ప్రవర్తించినందులకు నన్ను నేనే నిందించుకొంటిని.

## 9

రోజులు కడచుచున్నవి కాని నా గుట్టు రట్టు కాలేదు. నే నెన్నియో తప్పు లొనరించితిని. ఎన్నియో క్లిష్టసమయాలు. ఎంతో సమయస్ఫూర్తి, నేర్పు, ఆవశ్యకమై యుండెను. అల్లయ్యు నేను బయటపడక తప్పించుకొనగలిగితిని.

సారూప్యమున్నచో దరిశేనియూరాజుగ నటించుట సులభ మనియు సామాన్యునివలె నటించుటయే కష్టమనియు అను భవమును బట్టి చెప్పుచున్నాను.

ఒకనాడు శాప్ట్ నా గదికి వచ్చి యొక లేఖ నిచ్చుచు 'ఈ జాబు నీది. ఎవరో స్త్రీ వ్రాసిన దనుకొందును. నీ కొకవార్త వినిపింపవలసి యున్నది. రాజు జండాదుర్గమున నున్నాడు.'

'నీ కెట్లు తెలియును?'

'మైకేలు స్నేహితులు లామెంగ్రాము, క్రిఫ్టీను, రూపర్ట్ హెంజూ ఈ దుష్టత్రియ మచ్చట నున్నారని తెలిసి నది. ఇదిగాక వంతెనకూడ యెత్తి యుంచబడినదట. హెంజూ లేక మైకేలుఉత్తరువు లేనిదే ఎవ్వరును లోని కేగు టకు వీలులేదట.'

'నేను జండాకు పోవుదును.'

'ఎన్నడో యొకనాడు ——.'

'ఆఁ కావచ్చును. నీవు పోయినట్లైన నీవు నచ్చుటనే యుండవలసివచ్చును.'

'అదికూడ సంభవమే.'

'ప్రభువులవా రేదో వినుగుగా నున్నట్లు తోచెడిని. మీ ప్రణయగాథ ఎట్లున్నది?'

'ఇక చాలించుము నీ మాటలు. ఎక్కడికి పోయినను అరడజనుమంది న న్ననుసరించుచుందురు.'

'ఔను. నేనే వారిని నీ రక్షణనిమిత్త మేర్పఱచితిని. లేకున్న నీ వదృశ్యుడవైన మైకేలున కెంతో అనుకూలమగును కదా?'

'నన్ను నేను కాపాడుకొనగలను.'

'డిగశుటట్, బెర్గ్నోనిక్, డిచర్డ్ వీరిలో నే యొక్కరైనను చాలును, నీ తల తీయుటకు - పోనిమ్ము. ఆ జాబేమో చూడుము.'

నేనా జాబును తీసి గట్టిగా నిట్లు చదువ నారంభించితిని.

'రాజు విధిగా తెలిసికొనవలసిన విషయములు తెలిసికొన నిచ్ఛగించునేని యీ లేఖలో చెప్పబడిన రీతిని నడచుకొనుగాక! క్రొత్త రాజమార్గమునకు కడపటనుండు విశాల ప్రదేశమున నొక భవన మున్నది. దాని కొక ముఖమండప మున్నది. దానిపై నొక దేవతావిగ్రహ మున్నది. అచ్చటనుండు ఉద్యానవనముచుట్టు నొక ప్రహారీగోడ యున్నది. వెనుకటి గోడలో నొక ద్వారమున్నది. ఈ రాత్రి పండ్రెండు గంటలకు రాజొక్కడే దానిని ప్రవేశింపవలెను. అచ్చటి నుండి కుడికి తిరిగి ఇరువది గజములు నడచిన నచ్చట నొక వేసవి విడిది కనుపించును. దాని కాఱు మెట్లున్నవి. వాని నెక్కి యతడు లోనికి ప్రవేశించిన నతడొక నమ్మదగు వ్యక్తిని కలిసికొని ప్రభువులవారి ప్రాణమునకు రాజ్యములకు సంబంధించిన వివరముల నెఱుగగలడు. ఈజా బెవరికి చూపవలదు. లేకున్న దీనిని వ్రాసిన యొక స్నేహితురాలిని

నాశనము చేసినట్లగును. నల్ల మైకేలు క్షమించువాడు కాడు!

ఇంతలో శాప్ట్ అడ్డువచ్చి 'కాడు. కాని అతడు ఇట్టి జాబులు వ్రాయించగలడు' అనెను.

నేను మరల చదువ నారంభించితిని. 'నీ వనుమానించిన - శాప్టితో సంప్రతింపుము.'

'ఓహో! ఆమె నీకంటె నన్ను గొప్ప బుద్ధిహీనునిగ తలంచినట్లున్నది.'

నే నాతని నూరకుండుమని సూచించుచు మరల చదివితిని. 'మైకేలు రాజు కారాదు. ఫ్లేవియాను పెండ్లాడకూడదు. ఈ రెండు సంఘటనలును జరుగకుండునట్లు చేయుటకెట్టి చర్యకైనను సిద్ధముగనుండు స్త్రీ యొక్కతె యున్నదనుట శాప్ట్ ఎఱుగును. ఆమెపేరు 'అ'తో ప్రారంభమగుననుట కూడ నాతనికి తెలియును.'

ఈ మాటలు చదివి నేను వెంటనే 'ఆమె పేరు అంటాయినెట్ డి మాబన్ కదా!' అంటిని.

'నీ కెట్లు తెలియును?'

నే నామె నెఱుగుట యెట్లు తటస్థించెనో నే నాతనికి వివరించితిని. ఆతడు తలయూచి 'ఆమె కాతనియెడ ద్వేషభావముండుట నిక్కము. కాని యీ జాబును మైకేలే వ్రాయించి యుండుటయు సంభవమే' అనెను.

'నేను నట్లే భావించుచున్నాను. అయినను దీని కలరూపెరుగ గోరుచున్నాను. కావున నా వేసవి విడిది కేగెదను.'

'వీలులేదు.'

'శాప్ట్! నేనా స్త్రీని నమ్ముచున్నాను. పోవ నిశ్చయించితిని'

'నే నేస్త్రీని నమ్మను. కావున నీవు పోవ వీలులేదు'

'నే నచ్చటికైన నేగవలెను; లేదా ఇంగ్లండునకైన మరలవలెను'

ఎంతవఱకు నాకు సలహాలివ్వవచ్చునో, ఎప్పుడు తాను నా సలహాలను పాటింపవలెనో శాప్ట్ ఎఱుగును. పెద్దగ నిట్టూర్చి 'అట్లే కాని'మ్మనెను

ఆరాత్రి పదకొండున్నర గంటలకు నేనును శాప్టున్ను తేజుల నెక్కితిమి. ఫ్రిట్జ్ కావలియుండెను. అది కారు చీకటి. మావెంట నొక పిస్తోలును, ఒక పొడుగాటి చాకును ఒక చిన్న దీపమును తీసికొని వెళ్లితిమి. మేము ప్రహరీగోడ లోని వాకిలియొద్ద నాగి గుఱ్ఱముల దిగితిమి. శాప్ట్ 'నే నిక్కడనే కాచుకొనియుందును. తుపాకి ప్రేలుడు వినగానే నేను...'

'ఉన్న స్థలముననే యుండుము. రాజుకొఱకు నీవును ప్రమాదమునకు లోనుకారాదు,

'నీమాట నిజమే. జయమగు గాక!,

వాకిలి త్రోసికొని లోని కేగితిని. గడ్డిగాదము పెరిగియున్న త్రోవగుండా వెళ్లి జాబులో చెప్పిన ప్రకారము కుడికి తిరిగి ఎదుట చీకటిలో నల్లగా కనుపించుచుండిన భవ

నమును చేరితిని. మెట్టెకెక్కితిని. అచ్చట నొక చెక్క వాకిలి యుండెను. దానిని వెనుకకుత్రోసి లోని కడుగిడ గానే యొక స్త్రీవ్యక్తి వచ్చి నాచేయి పట్టుకొని హీనస్వరమున 'వాకిలి మూయుము' అనెను.

నే నామె చెప్పినట్లు చేసితిని. చేతనున్న దీపము సహాయమున నామె ముఖమును చూచితిని. నేను పొరబడ లేదు. ఆమె మాబనే. అది యొక చిన్నగది. అచట నొక చిన్న ఇనుపబల్లయు, రెండు కుర్చీలునుమాత్ర ముండి నవి. 'అయ్యా, రాసిండల్! నిన్ను నే నెఱుగుదును. డ్యూకు ఆజ్ఞమేరకే నేనా జాబును నీకు వ్రాసితిని'

'నేను నట్లే తలంచితిని'

'ఇరువది నిముసములలో నిన్ను పరిమార్చుట కిచ్చటికి ముువ్వురు రానున్నారు'

'ముువ్వురా! - దుష్టత్రియము'

'ఔను. నిన్ను చంపి నీ కళేబరమును వారు నగరములో నెచ్చటనో పారవేయుదురు. శవమును చూచిన జనులు రాజే చచ్చెనని భావింతురు. మైకేలు వెంటనే నీ స్నేహితు లందఱిని బంధించును. జండాదుర్గములో నున్న నిజమగు రాజు నచ్చటనుండు దుష్టత్రయ మంతమొందించును. వెంటనే మైకేలు రాజగును. ఫ్లేవియాను పెండ్లాడును. తెలిసినదా?'

'ఇది మంచి పథకమే. కాని నీవేల నన్ను హెచ్చ రించుచుంటివి?'

'చెప్పెదను వినుము - ఆతఁ డామెను వివాహమాడుట నే నెట్లోర్వఁగలను? ఇప్పుడు నీవు వెడలుము. నీ కిప్పుడును భద్రతలేదని గుర్తెఱుఁగుము. మైకేలు దుష్టతేయు మెల్ల ప్పుడు నిన్ను నీడవలె వెన్నాడుచుండును. నీవింక వెడలుము. ఇప్పటికే వారు వాకిలి కాయుచుందురు. మెల్లఁగా పొమ్ము. ఈ యింటివెనుక నూరు గజములు పోయిన గోడ కానుకొని యొక నిచ్చెన యుండును. దాని నెక్కి గోడను దాటి పరు విడిపోయి ప్రాణరక్షణ కావించుకొమ్ము.'

'నీవో?'

'ఈ పన్నుగడ నెఱిఁగి నీ విచ్చటికి రానేలేదని నే నాత నితో చెప్పెదను.'

నే నామె చేతిని ముద్దాడితిని.

'నీవు రాజున కెంతో సేవ కావించితివి. జండాదుర్గ మున నాత డెచ్చట నున్నాడు?'

ఆమె తన స్వరమును చాల తగ్గించెను. నేను చెవులు ఱిక్కించి శ్రద్ధతో నాలకించితిని.

'వంతెనమీఁదుగా పోయిన నచ్చట నొక బలమైన వాకిలియుండును. దానికి వెనుక...అదిగో! వినుము. ఆశబ్ద మేమి?'

బయట అడుగుల చప్పుడు వినవచ్చెను.

'వారు వచ్చుచున్నారు. రావలసిన కాలమునకంటె ముందుగనే వచ్చిరి' అనుచు నామె వివర్ణయయ్యెను.

'వారు మంచి సమయమునకే వచ్చినట్లున్నది'

'నీదీప మార్పుము. వాకిలిలో నొక నెఱియున్నది. వారిని చూడగలవేమో చూడుము.'

తలుపులోని సందుగుండా నేను చూచితిని. క్రింది మెట్టికెమీద ముగ్గురు వ్యక్తులు మసకగా కనుపించిరి. బయటినుండి యొక కంఠధ్వని వచ్చెను. అవి స్వచ్ఛమైన ఇంగ్లీషు మాటలు. ఆమాట లివి-

'అయ్యా, రాసిండల్ మేము నీతో మాటాడ దలచితిమి. మాట ముగియువఱకు తుపాకి ప్రేల్చనని మాట నిచ్చిన చాలును'

'మాటాడుచుండునది డిచర్డ్ గారా?'

'పేరుల కేమి లెమ్ము'

'నా పేరుతో మాత్రము మీ కేమి లెండు'

'పోనిమ్ము. నీకు మే మొక యవకాశ మివ్వదలచితిమి.'

నే నింకను వాకిలి నెఱినుండి చూచుచునే యుంటిని. ముగ్వురును మరి రెండు మెట్టికెలు పైకెక్కి వచ్చియుండిరి. మూడు పిస్తోళ్లను వాకిలివైపు ఎక్కుపెట్టి యుండిరి.

'మేము మాట తప్పము. లోనికి రానిత్తువా?'

హాబను మెల్లగా 'వారిని నమ్మకు' మనెను.

నే: మన మిక్కడే మాటాడుకొనవచ్చును.

'నీవు వాకిలి తెఱచి మమ్ము కాల్పవచ్చును.'

'ప్రమాణముగ మీరు కాల్చువఱకు నేను కాల్చను.

కాని మిమ్ములను లోనికి రానిచ్చుట మాత్రము కల్ల. బయటి నుండియే మాటాడుడు.'

'అదీ సబబే'

ముప్వురును పైమెట్టెక్కి వాకిలికి దగ్గఱగా నిలిచిరి. నేను నెఱికి నా చెవి నానించితిని. నాకేమియు మాటలు వినరాలేదు. డిచర్డ్ మాత్రము డిగలెట్‌తో నేమియో హీన స్వరమున చెప్పుచున్నట్లుండెను. వారిలో వారు సంప్రతించు కొనుచుండిరి కాబోలు!

నే: (గట్టిగా) సరే. మీ ప్రతిపాదన యేదో చెప్పుడు. 'మేము నిన్ను నిరపాయముగా సరిహద్దును దాటింతుము. ఏబదివేల పౌనుల ద్రవ్యము నిత్తుము.'

వారి గుండెలోతు తెలిసికొంటిని. మాబర్ హెచ్చరిక నాకవసరము లేకపోయెను. నేను మాటాడుచుండగ హఠాత్తుగ నాపై కుఱుకవలయునని వారి ఎత్తు.

'ఒక్కనిముసము నన్నాలోచింపనిండు.'

బయట నవ్వు వినిపించెను. నేను మాబర్‌వైపు తిరిగి మెల్లగా 'గుండు తగులకుండా నీవు గోడ కానుకొని నిలుచుండుము. అంటిని.

ఆమె భయముతో 'ఏమి చేయనుంటి'వనెను.

'చూతువు కదా'

నే నచ్చటనున్న ఇనుపబల్లతలము వాకిలివైపు త్రిప్పి నాకడ్డముగ నుండునట్లు పట్టుకొని వాకిలినుండి సాధ్యమైనంత

వెనుకకు వచ్చి నిలిచితిని. వా రొకవేళ తుపాకులు ప్రేల్చి నను నా కేయుపాయమును లేకుండునట్లు బల్లను పట్టుకొని యుంటిని. నా కది డాలుగా నుపయోగపడెను. వెంటనే నేను

'అయ్యా, మీరు చెప్పినదానికి నే నొప్పుకొనుచున్నాను. మీరు వాకిలి తెఱచిన...'

డీ: నీవే తెఱువుము

'దానిని బయటివైపునకే తీయవలెను. కొంచెము వెనుకకు పొండు. లేనిచో నేను తెఱచినప్పుడు మీకు తగుల వచ్చును.'

గొళ్లెమును తొలగించి మునివ్రేళ్లమీద మెల్లగ పోయి నాస్థలమున నిలుచుంటిని. ఇనపబల్ల డాలు చేత ధరించియే యుంటిని.

'నేను వాకిలి తెఱువలేకున్నాను. గొళ్లెము తీయ రాకున్నది'

డీ: ఛీ! నేను తెఱచెదను.

నాలో నేను నవ్వుకొంటిని. ఒక్క క్షణము తరువాత దబాలున వాకిలి తెఱచిరి. వారు ముగ్వురును తుపాకుల సిద్ధముగ గుఱిపెట్టి యుండిరి. ఒక్కసారిగా కేకవేయుచు బల్లను చేత నుంచుకొని వాకిలిగుండా వారిని త్రోసికొనుచు బయటకు పరువిడితిని. వారి తుపాకిగుండ్లు నా డాలునకు తగిలెను. ఆ యయోమయావస్థలో వారు ముగ్వురు, నేను, నా బల్లకూడ క్రిందపడి మెట్లమీదుగ క్రిందికి దొర్లుకొని

పోయితిమి. మాౙర్ భయముతో కెవ్వున కేక వేసెను. నేను అట్టహాసము చేయుచు త్వరలో లేచి నిలుచుంటిని.

డిగకెట్ బెర్నొనిర్ యిరువురు నిశ్చేష్టులై యుండిరి. డిచర్డ్ బల్లక్రింద పడియుండెను. నేను లేవగానే బల్లను త్రోసి వేసి డిచర్డ్ మరల తుపాకిని పేల్చెను. వెంటనే ఆ దెబ్బ తప్పించుకొని నేనును ! అతనిపై నొక గుండు పారించితిని. అతడు తిట్టుట నాకు వినిపించెను. వెంటనే నేను నవ్వుచు ఆ యింటివెనుక నుండిన గోడవైపు పారిపోయితిని. దైవ వశమున మాౙర్ చెప్పినట్లు అచ్చట నిచ్చెన యుండెను. క్షణములో దాని నెక్కి యావలకు దుమికితిని. నాకొక తుపాకి కాల్చిన శబ్దము వినవచ్చెను. అది శాప్ట్ కాల్చిన తుపాకి గుండు. అతడు లోపలి శబ్దము విని వాకిలిని తెఱువ బోయి దానికి వారు వేసిన బీగము రాకపోగా దానిని తీయు టకై తుపాకితో కాల్చెను. ఇంతలో నేను పోయి యాతని కలిసికొని "రమ్ము. పోయి పరుండుదము. నీ వెప్పుడును విని యుండని 'టీ టేబులు కథ' చెప్పెద" నంటిని. అతడు నావెంట వచ్చుచు 'అబ్బా! నీవు క్షేమముగ నున్నావు కదా!' యని క్షణ మూఱకుండి మరల 'నీవు నవ్వుచున్న ధ్వని విని పించెనే. ఏల నవ్వుచుంటివి?' అని ప్రశ్నించెను. నే నింకను నవ్వుచు 'ఒక చిన్న టీటేబుల్ చుట్టు నల్వురు పెద్ద మనుష్యులు' అంటిని. అజేయులగు మహావీరుల మువ్వురను కేవలము టీబల్ల సాయమున చిత్తుచేయుట హాస్యాస్పదముగ

కనుపించెను. అంతేగాక నే నాడితప్పక వారు కాల్చువఱకు నాతుపాకి నెత్తక మాట నిలిపికొంటిని.

## 10

మరుసటిదినము నేను ఫ్రిట్జుతో చీట్లపేక నాడుచుండగా శాప్ట్ వచ్చి కూర్చొనుచు నిట్లనెను.

'ఈదినము వెలువడిన పోలీసుపత్రికటన చాల ఆకర్షణీయముగ నున్నది'

'ఏదైన సంఘటనను గుఱించి యందులో వేర్కొన్నారా?'

అతడు చిఱునగవుతో 'అందులో మొదటి విషయమిది. మైకేలుప్రభువు హఠాత్తుగ తనవారితోగూడ పట్టణము వదలినాడట. అతడు జండాదుర్గమునకు పోయియుండునని నమ్మకముగ తెలియుచున్నది. అతడు పోయిన గంటకు దుష్టత్రయము వెడలెనట. డిచర్డ్ చేతికి కట్టున్నదట.' అనెను.

'వానికి మంచి గుఱుతు వేసినందుకు తృప్తిగనున్నది.'

'తరువాత వినుము. మాబన్నుపై ననుమాన ముండుటచే నామెపై 'నిగా' ఉంచబడినది. ఆమె యీ మధ్యాహ్నామే రైలెక్కి డ్రెస్డను బయల్దేరినది. ఆరైలు జండాలో ఆగును. కడపటి విషయము నగరములో అసంతృప్తి వ్యాపించియున్నది. రాజు తన వివాహ విషయమున నింకను

నెట్టి చర్యయు తీసికొనలేదను ఆక్షేపణలు వినవచ్చుచున్నవి. ష్లైపియా రాకుమారి కిది ఎక్కువ మనస్తాపమునకు కారణ మనుచున్నారు. సామాన్యజనులు ష్లైపియా మైకేలును వివాహ మాడు ననుకొనుచున్నారు. డ్యూకుకు ప్రజలలో పలుకుబడి ఎక్కువగుచున్నది. అందుచే రాజుగారీరాత్రికి రాకుమారి గౌరవార్థ మొక విందును చేయనున్నారని ప్రకటించియున్నాను. ఈ వార్త బాగుగా వ్యాపించినందున కొంత యనుకూల వాతావరణ మేర్పడినట్లున్నది.

'ఈ విషయము నాకు తెలియదే'

'అన్ని ఏర్పాట్లును జరిగినవి. నా పర్యవేక్షణమందే' యని ఫ్రిట్జ్ అనెను.

శా: (నాతో) ఈరాత్రి రాకుమారియందు నీ ప్రేమను చక్కగా ప్రదర్శింపవలయును. తెలిసినదా?

నే: ఆఁ. తెలిసినది. అట్లే జరుగు ననుకొందును.

ఫ్రి: అది నీకు సులువైన పని యనియే నా భావము. ఇదిగో వినుము. నీకీ విషయము తెలుపుట నా కిష్టము లేదు. ఐనను చెప్పక తప్పదు. పట్టాభిషేకానంతరము రాకుమారికి రాజునందలి యనురక్తి మరియు నెక్కువైనదని హెల్గా నాతో నుడివినది. కావున రాజుడుపేక్ష ఆమె హృదయమును గాఢముగ గాయపఱచిన దనుట సత్యము.

నేను చిన్నగా మూల్గితిని.

శా: బాలికలతో ప్రేమ సంభాషణలు చేయుట నీ కనుభ

వమే కదా! ఇప్పు డవసరమైన దానేశ్వే.

ఫ్రిట్జ్ తానును ప్రేమికుడే కావున నా యవస్థను చక్కగా తెలిసికొనగలిగెను. అత డేమియు పలుకలేదు. ఉడుకారిన వృద్ధుడు శాప్ట్ మరల నిట్లనెను. 'నీ వీరాత్రికి రాజకుమారితో నీ వివాహేచ్ఛను ప్రకటింపుము'

'నే నట్టిదేమియు చేయను. రాకుమారిని మోసగించుటలో భాగస్వామి యగుటకు నే నేమాత్రము నంగీకరింపను.'

శాప్ట్ నావైపు తీవ్రదృష్టిని సారించి 'కానిమ్ము. నిన్ను మేము బలవంతపెట్టరా' దనెను.

ఇక నాతో వాదము పనికిరాదనియు, నా కామె యందున్న ప్రేమయే న న్నాకార్యమునకు ప్రేరేపింప గల దనియు నాతడు గ్రహించెను.

ఆనందోత్సవము నేను స్లేవియాతో నాట్యమాడుటతో నారంభమయ్యెను. కొంద ఱాసక్తితో మావైపే చూచుచుండిరి. కొందఱు గుజగుజలు వోవుచుండిరి. తరువాత మేము విందు మొదలిడితిమి. సగము ముగిసెను. ఆమె యందలి యనురాగముచే నా నమయజ్ఞత నశించెను. అతిథు లందఱి యెదుటను జంకుగొనక నా మెడలోని గులాబీ సుమదామమును నేను రాకుమారి కంఠమున నలంకరించితిని. ఎల్లరు కరతాళధ్వనుల గావించిరి. శాప్ట్ హాసన్ముఖుడై మద్యము త్రావుచుండెను. ఫ్రిట్జ్ బొమలు ముడివడి యుండెను. నిశ్శబ్దముగ విందు ముగిసెను. నేనుగాని స్లేవియాగాని నోరు

విప్పలేక పోయితిమి. ఫ్రిజ్ నన్ను తాకుటతో వెంటనే లేచి ఫ్లేవియాతో గూడ హాలులో వెడలి యొక చిన్న గదిని చేరితిని. అచ్చట మాకు కాఫీ నిచ్చిరి. అంతట పరిజనము మమ్మేకాంతమున వదలి చనిరి.

ఆ గదిలోనుండి ఉద్యానవనములోని కేగుట కొక ద్వారముండెను. ఆ రేయి చల్లగ హాయిగ నుండెను. ఫ్లేవియా కూర్చొనియుండెను. నే నామెయెదుట నిలిచికొని యుంటిని. ఆక్షణమున నాపిచ్చిలో జండాలోని రాజును, నే నాతని ప్రత్యామ్నాయముగ నుండువాడ నను విషయమును మఱచితిని. రాకుమారిని వంచించుచున్నాననుట కూడ మఱచితిని. బాహాటముగ నా ప్రేమ నామె కెఱింగించితిని.

అప్పటి మా యానందమును మా సంభాషణాంశము లను వివరించి వ్రాయు టనవసరము. ఆమె నా ప్రేమను తిరస్కరింప లేదనియు నా రాణిగా నుండ నిష్టపడుచుండెననియు మాత్రము తెలిపిన చాలును. పట్టాభిషేకమైన తరువాతనే యామెకు 'రాజు'నం దిష్ట యనురాగ ముదయించెనని తెలిసి నప్పుడు విజయమంతయు నాదే యనుకొంటిని.

అప్పటికి నా యంతరాత్మ ప్రబోధము పొందెను. నేను నిజమగు రాజును గూర్చియు, ఆతని జండా ప్రవాసమును గూర్చియు చెప్పుట కారంభింప నుంటిని. ఇంతలో బయట అడుగుల సవ్వడి వినవచ్చెను. కిటికీగుండా నొక మనుష్యుని ముఖము కనబడెను. ఫ్లేవియా భీతితో చిన్నగా నఱచెను.

నే నాడుచుండిన మాట యచ్చటికే యాగిపోయెను. శాఫ్ట్ వినయవినమితాంగుడై యెదుటికి వచ్చెను. ఆతని ముఖమున కోప మలముకొని యుండెను.

'ప్రభూ! మన్నింపవలయును. సుమారు కాలుగంట నుండీ తమతో సెలవు పుచ్చుకొనవలయునని కార్డినల్ కాచుకొని యున్నాడు.'

ఆతడు చూపులతోడనే నన్ను హెచ్చరించెను. ఎంత కాలమునుండి యాతడు మా సంభాషణమును వినుచుండెనో నాకు తెలియదు. నేను మా పథకము నామెకు విప్పి చెప్పుట కారంభింపనున్న సమయమునకు సరిగా నాతడు వచ్చియుండెను.

మా ముఖముల చూడగనే మా వివాహము నిశ్చయమైనట్లు శాఫ్ట్ గ్రహింపగలిగెను. ఆతని ముఖమున విషాదచ్ఛాయ లగపడెను. అయినను నాత డొక విధముగ నవ్వుచు మృదువైన మాటలతో ఫ్లేవియా చేతి నందుకొని ముద్దాడుచు 'భగవానుడు మిమ్ముల సర్వకాల సర్వావస్థలయందును కాపాడుగాక!' యనెను. తరువాత నావైపు తిరిగి సైనికున కుచితరీతిని నిశ్చలముగ నిలిచి 'అన్నిటికంటె ముందు రాజు - భగవానుడు రాజును రక్షించుగాక!' యనెను. ఫ్లేవియా 'తథాస్తు' అనెను.

మేము మరల నాట్యభవనమును
శాఫ్ట్ మా వివాహము నిశ్చయమైనదన్న వార్త నందఱకు

తెలుపుచుండెను. వంశ పరంపరాగతుడగు రాజును సమర్థించి మైకేలున కవకాశము లేకుండ చేయువలయు ననుటే శాప్ట్ ప్రైకలవ్యము. స్లేవియా, నేను, జండాలోని రాజు అందఱు నాతని చేతి కీలుబొమ్మలే. నేను రాకుమారిని బండియొద్దకు విడిచివచ్చుటకు పోగా నచ్చట నుండిన జనుల గుంపు మమ్ము చూచి కావించిన హర్షధ్వనులతో మా చెవులు చిల్లులు పడెను. ఏమి చేయుటకును నాకు తోచలేదు. నే నప్పుడు రాజు కానని చెప్పినను వారు నమ్ముస్థితిలో లేరు. శాప్ట్ పన్నాగమువల్లను, రాకుమారిమెడ నాకుగల ప్రేమవల్లను నేనీ పరిస్థితి నంగీకరింపక తప్పలేదు. నన్ను స్లేవియా రాకుమారికి కాబోవు భర్తగాను, రురిటేనియా రాజుగాను స్ట్రెల్సౌప్రజలెల్ల రంగీకరించిరి.

తెల్లవారుజామున మూడు గంటల వేళ. నేను శాప్ట్ మాత్రమే నా గదిలో నుంటిమి. ఫ్రిట్జ్ నిదురించుచుండెను.

శా: మనము నిన్నరాత్రి రాజుపరమున మంచి దెబ్బతీసితిమి.

ఈ మాటలకు నిర్వ్యాజపోయి నే నాతనివైపు క్రూరముగ చూచితిని.

'నా కనుకూలముగ పరిస్థితుల త్రిప్పినవో!'

ఆతడు తల యూచెను.

నే: రాకుమారిని పెండ్లాడి మైకేలును ఆతని సోదరునికూడ ధిక్కరింపగలను.

'నే నామాట కాదంటినా!'

'భగవానుని సాక్షిగా చెప్పుచున్నాను వినుము. నాకీ కార్యమునందు విముఖత కలుగుటకు తగిన చర్యకు పూను కొందము. జండాకుపోయి మైకేలును నిర్జించి రాజు నాతని పీఠమున సుప్రతిష్ఠితుని గావింతము.' వృద్ధు డొకక్షణ మాగి 'రాకుమారి మాటయేమి?' అనెను. ఈ మాటకు బదులు తోచక తల వంచుకొంటిని ఆతడు నెమ్మదిగ గద్గదస్వరమున నిట్లనెను.

'దైవసాక్షిగా నుత్తముడగు ఎల్ఫ్‌బర్గ్ వంశీయున కుండదగిన లక్షణము లన్నియు నీకున్నవి. అయినను నేను నిజమగు రాజు ఉప్పు తినియున్నాను. నే నాతని సేవకుడను. జండాకు పయనమగుదము రమ్ము.'

నేను తల పైకెత్తి యాతని చేతి నందుకొంటిని. మా యిరువురి కన్నులును చెమ్మగిల్లియుండెను -

## 11

నేనెట్టి తీవ్రిమగు ఆకర్షణలమధ్య నంటినో యిప్పుడు చక్కగా తెలియగలదు. మైకేలును ధిక్కరించి రురిటేనియా రాజుగా అధికారమును చేజిక్కించుకొని బలపఱచుకొనుటకు నా కిప్పుడున్న యవకాశ మనంతము. రాజ్యముకంటె రాణియే నన్నాకర్షించినది. నా రహస్యము నెఱిగినవా రిద్దరే శాప్ట్; ెట్జు. వారి సంగతి ఎట్లు? వారిని మాయము

చేసిన! హద్దులేని యాశలు మనసులో పెరుగనిచ్చిన కలుగు దురాలోచనము లిట్లే వర్ణనాతీతముగ నుండును.

అది యొక సుప్రభాతము. ఒక పూలగుత్తిని చేత బట్టుకొని యొంటరిగా నేను ఫ్లేవియాగృహమునకు బయలు దేఱితిని. ఫ్రిట్జ్ నేస్తురాలు హెల్గా తన యజమానురాలి కొఱకు పూమొగ్గల సేకరించుచుండెను. నేను చేతనున్న పూవుల నామె కిచ్చి ఫ్లేవియా కిమ్మంటిని. ఆమె దానిని గైకొనెను.

ఆమె ముఖమున సిగ్గుదొంతరలు కనుపించెను.

మే మిరువురమును మాటాడుచుండుటను రాకుమారి తన సౌధజాలకమునుండి చూచుట నేను గమనించితిని. ఆమె హెల్గా నుద్దేశించి 'సఖీ! రాజుగారిని తోడితెమ్ము. కాఫీ యిత్తు' ననెను. ఆమె తెల్లని దుస్తుల ధరించి వెంట్రుకలను ముడివైచుకొని యుండెను.

హెల్గా నన్ను ఫ్లేవియాగదిలోనికి కొనిపోయెను. ఆమె రెండు జాబుల నాయెదుట నుంచెను. అందులో మొదటి దానిని మైకేల్ వ్రాసియుండెను. జండాదుర్గప్రాంతమున వసంతమున ప్రకృతిసౌందర్య మనిర్వచనీయముగ నుండును. ప్రతివత్సరమును ఫ్లేవియా యొక్కరోజు జండాలో మకాము చేయుట రివాజు. ఆ యలవాటును పురస్కరించుకొని మైకేలు రాకుమారిని జండాకు రమ్మని యాహ్వానించుచు వ్రాసియుంచిన లేఖ యది. దానిని చూచి వేసటతో నే నద్దానిని

క్రింద పడవైచితిని. ఆమె నవ్వి రెండవ లేఖను చూపుచు 'దీని నెవరు వ్రాసిరో తెలియదు. చదువు'డ నెను. ఈ జాబు నందు వ్రాసినవారి చేవ్రాలు లేదు. ఐనను వ్రాతనుబట్టి దానిని మార్బర్ వ్రాసియుండెనని సులభముగ గ్రహించితిని. అందులోని విషయ మిది.

"నిన్ను నేను ప్రేమించుటకు కారణము లేదు. అయి నను డ్యూకుచేతులలో పడకుండ దేవుడు నిన్ను రక్షించుగాక! ఆతని యాహ్వానము నంగీకరింపకుము. పటిష్ఠమగు రక్షణ లేనిదే బయటికి వెళ్లకుము. ఒక చిన్న సైన్యమున్నను మంచిదే. సాధ్యమైనచో నీజాబును స్ట్రెల్సాలోని ప్రస్తుత పాలకునకు చూపుము."

ఫ్లేవియా జాబును చదువుటకై నా భుజముమీద వ్రాలి యుండెను. ఆమె 'రాజని యేల వ్రాయలేదో? ఇదియు నొక మోసమై యుండునా?' అనెను.

'అట్లుండదు. ఈ జాబుప్రకారము నడచుకొనుటయే శ్రేయస్కరము. నేటినుండి యొక సైనికదళము నీ యింటిని కాపలా కాయుచుండును. తగిన రక్షణ లేనిదే నీవు బయ టికి వెళ్లకుము.'

'ప్రభూ! ఇది యుత్తరువా?'

'ఔను. ఉత్తరువే - నీవు నన్ను ప్రేమించుచున్న' -

'దీని నెవరు వ్రాసిరో మీకు తెలియునా?'

'ఒక హితైషి వ్రాసియుండవచ్చునని తోచుచున్నది.

నీవు జబ్బుగా నున్నట్లు నటించి జండాకు వెళ్లుట సాధ్యముకాదని తెలుపుము,

ఆమెతో సెలవుపుచ్చుకొని నేను వెంటనే మార్షల్ స్ట్రాకెంచ్ యింటికి వెళ్లితిని. నేనీ విషయమును శాస్త్రికు తెలుపలేదు. మార్షలు విషయము నాకిదివరకే తెలియును. కావున నాతనియెడ నాకు ప్రీతి విశ్వాసము లుండెను
డనిన శాస్త్రున కంతగా నాసక్తి లేదు. ప్రతిపనియు తానే చేయవలయు ననుట శాస్త్రిమతము. ఇప్పటి స్థితినిబట్టి శాస్త్ర నకును ఫ్రిట్జునకును చేతినిండ పనియున్నది వారు నా వెంట జండాకు రావలయును. స్ట్రెల్సాలో నా ప్రేమధనమగు - ప్లేవియాను - కాపాడుట కొక వ్యక్తి యవసరము. లేకున్న రాజును బంధవిముక్తుని కావించు కార్యమునెడ నా కేకాగ్రత యుండదు.

మార్షలు నన్ను బహు మర్యాదగా నాహ్వానించెను. నే నాతని కొంతవఱకు విశ్వసించి కొన్ని విషయములు చెప్పితిని. రాకుమారి రక్షణము నాతని కప్పగించితిని. మైకేలామెను బంధింప యత్నింపవచ్చును. కావున తాను తన సిబ్బందితో నున్నప్పుడు తప్ప డ్యూకునుగాని యాతని యనుయాయులనుగాని యామె దరికి రానీయవలదని నే నాతనికి ముదల యిచ్చితిని.

'మీ మాట నిజమే. ప్రేమ కారణముగ నీతనికంటె ఉత్తములగువారు సైత మింతకంటె నీచముగ ప్రవర్తించుట

నే నెఱుఁగుదును.'

'ప్రేమ యొక్కటే కాదు: అది హృదయసంబంధః నా కిరీటమును మాత్ర మాతఁడు ధరింప నొల్లఁడా?'

'ప్రభూ, మీ రాతని తప్పు దలచితిరని మనవి.'

'మార్షల్! నేను కొన్ని దినములు నగరము వీడిపోవు చున్నాను. ప్రతి సాయంతనమును నీకు వార్త నంపు చుందును. మూఁడుదినములు వరుసగ నీ కెట్టి వార్తయు నందకున్నచో నేను నీ చేతికిచ్చు నుత్తరువును ప్రకటింపుము. నే నందులో నిన్ను నగరపాలకునిగ నేర్పఱచుచు డ్యూకు నాపదవినుండి తొలగించినట్లు వ్రాసియిత్తును. వెంటనే నీవు 'రాజదర్శన మిప్పింపు'మని కోరుచు మైకేలుకు వార్త నంపుము. తెలిసినదా?''

'చిత్తము ప్రభూ!'

'- ఇరువదినాలుగు గంటలలో నాతఁడు రాజును చూపకున్న రాజు చచ్చెనని భావింపుము. తరువాత నాతని వారసుల పాలకులుగ ప్రకటింపుము. వారసు ఎవరో నీ వెఱుఁగుదువు కదా?'

'రాకుమారి ఫ్లేవియా'

'ఆమరణము నీ వామె పక్షమునుండి యా విపక్రిమి మైకేలును సంహరించి యామెను రాజపీఠముపై నుంతునని నా యెదుట నీ విప్పుడు ప్రమాణము కావింపుము' అనుచు నా చేతి నాతని కందించి 'మార్షల్! రాబోవు దినములలో నీ

యెదుట మాటాడుచుండు వ్యక్తిని గూర్చి వింత విషయముల నెన్నిటినో నీవు వినగలవు. ఆతడెవరైన కానిమ్ము. ఎట్టి వాడైన కానిమ్ము. స్ట్రెల్సారాజుగా నాతని గుఱించి నీ యభిప్రాయ మేమి?' యంటిని.

'నే నెందఱినో ఎల్ఫ్‌బర్గ్ వంశీయుల నెఱుగుదును. నిన్నుకూడ చూచితిని. ఏమైనను నీవు యోగ్యుడవు. ధైర్యశాలివి. పెద్దమనుష్యుడవు. ఉత్తమ ప్రేమజీవివి. నీ యట్టి వాడు వారిలో నరుదు.'

నే నుద్రిక్తుడనై యుంటిని. మార్షల్ ముఖము కంపించుచుండెను. నే నాజ్ఞాపత్రము వ్రాయ నారంభించి 'నా వ్రేలింకను నయము కాలేదు. చక్కగా వ్రాయజాల' నంటిని.

చేవ్రాలునకంటె నెక్కువగ వ్రాయబూనుట కిదియే ప్రథమము. రాజుదస్తూరి నా కింకను పూర్తిగా నలవడి యుండలేదు.

'ప్రభూ! మీ సహజమగు దస్తూరికంటె నిది యించుక భిన్నముగ నున్నది. సృష్టసయని యనుమానింపవచ్చును.''

నేను నవ్వుచు "మార్షల్, ఆ మాత్రపు అనుమాననము నణచలేకున్న మీ తుపాకు లెందుకు!'' అంటిని.

మా: (స్మితగంభీరుడై యాజ్ఞాపత్రమును గ్రహించి) 'మైకేలు నన్వేషించుట కేగెదరా?'

'ఔను. జండాలో నాకు కావలసిన వ్యక్తి మరొకడు నైత మున్నాడు.'

మా: (తన తెల్లని మీసమును పురివెట్టుచు) 'నేనుగూడ మీతో వత్తునా ప్రభూ! తమకు సేవచేయు నవకాశ మిత్తురా?'

నే: నా ప్రాణముకంటెను, సింహాసనముకంటెను, నమూల్యమగు వస్తు రక్షణమును నీ కప్పగించియున్నాను.

మా: ఆమెను భద్రముగ నప్పగింతును. తప్పిన యూమెను రాణిని కావింతును.

అచ్చటినుండి వెడలి యింటికివచ్చి శాప్టుతోను ఫ్రిట్జుతోను నే జేసినది తెలిపితిని. శాప్ట్ కొన్ని లోపములెంచి యసంతృప్తి దెలిపెను. ఆత డిట్లు చేయునని నాకు ముందే తెలియును. ముందుగనే తనతో సంప్రతించిన నాతనికి సంతోషము. పని చేసిన తరువాత దానిని గూర్చి చెప్పిన నాతడు హర్షింపడు. మొత్తముమీద నేను చేసిన పని నాతడామోదించెను. కార్యాచరణమునకు సమయ మాసన్నమగుడు నాత డుత్తేజితు డయ్యెను. ఫ్రిట్జ్ సైతము సిద్ధముగ నుండెను. ఆతని సాహసము వంద్యమే. ప్రియురాలిని వదలి రావలసి యుండెను.

మా యేర్పాటు లన్నియు ముగిసెను. మరుసటి ఉదయమే మేము మృగయా వినోదమునకై వెడలనుంటిమని ప్రకటింపబడెను. నగరమునుండి వెడలుట కవసరమగు నేర్పాట్లన్నియు చేసితిని. ఒక్కపని మాత్రమే మిగిలియున్నది - కఠినతమమైనది - హృదయవిదారకమైనది - ఫ్లేవియాతో

సిలవువుచ్చుకొనుట. ఆ సాయంతనమే నే నామెను చూడ బోయితిని. మా పరియాణవిషయ మామె కప్పుడే తెలి యును. నన్నామె యాదరముగ నాహ్వానించెను.

'ప్రభువుగారికి విలాసముల కల్పింపలేక పోయినందు లకు విచారించుచున్నాను. బహుశః అడవి పందులే మీ మనసు నాకరిమించిన వేమో!'

ఆమె యించుక కోపమున నున్నట్లుండెను.

'మే మొక వరాహమును వేటాడ బోవుచున్నాము. విడిచి వెళ్లుచుంటినని కోపమా?'

'కోపపడుటకు నా కేమి యధికారము కలదు? నా సమక్షమున లేని ప్రతి నిముసమును వృథ యని నిన్ననేకదా మీరు చెప్పినది. కాని పందివేటయన్న నా విషయమే వేలుకదా?'

బహుశః పందియే నన్ను వేటాడునేమో! నన్ను పట్టు కొనునేమో?'

ఆమె నిరుత్తరయయ్యెను.

'ఆ యపాయము కలుగనున్నను నీ మనసు కరుగలేదా?'

ఆమె మాటాడలేదు. కాని యామె కన్నులనుండి యశ్రుకణములు రాలెను.

'ప్రియతమా! మృగయాలోభినై నిన్ను విడిచి వెళ్లు చుంటినని తలచితివా?'

'రూడాల్ఫ్! అయిన నెందులకు?'

'ఔను, వేటకే - మైకేలు వేటకు'

ఆమె ముఖము వివర్ణమయ్యెను.

'మే మచిరకాలముననే మరలి వత్తుము.'

'మీ క్షేమములు తెలుపుచుండుదురు కదా!'

ఆమె కనుమానము కలుగని రీతిగా 'ప్రతిదినమును వార్త నంపుచుందు' నంటిని.

'మీ కేమియు నపాయము లేదు కదా!'

'అనవసరమగు నపాయముల నెదుర్కొన ప్రయత్నింపను'

'మీరు మరలివచ్చు టెప్పుడు!'

'చెప్పలేను.'

'శీఘ్రలో రావలయును సుమా!'

'దేవు డెఱుగును - కాని రాకపోయినచో?'

'చాలును - ఊరకుండుడు.'

'నేను రాకపోయినచో నీవు నా స్థానము నాక్రమింప వలెను. ఎల్ఫ్బర్గ్ వంశమున మిగిలినదానవు నీ వొకర్తుకవే యుందువు. నీవు నాకొఱకు విలపింపక రాజ్యపాలనము చేయ వలయును.'

ఆమె యొకక్షణ మూరకుండి రాణివలెనే గంభీరయై 'అట్లే పాలింతును. నా జీవితమంతయు వృథయేయైనను నా పాత్రను నేను నిర్వహింతు' ననెను.

నే నామెను వీడ్కొని వచ్చుచుండగా నామె గద్గద స్వరమున 'మైకేలు నీ కపాయము కల్గింపవచ్చును. న న్నెడ

బాపుటకు ప్రయత్నింపవచ్చును. దానికి నీ వెడమివ్వవు కదా!' యనెను.

'లే' దనుచు నే నామె సెలవుపుచ్చుకొంటిని.

మైకేలుకాదు - ఎవని రక్షణముకొఱకు నేను నా ప్రాణము లొడ్డుచున్నానో ఆ రాజే - బ్రతికి బట్టకట్టినచో - ఆమెనుండి నన్ను దూరము కావింపవలెను. ఆతని యాకారము నా యెదుట ప్రత్యక్షమై మా యిరువురి నడుమ నిల్చినట్లు కనుపించెను.

## 12

జండా కై దుమైళ్ల దూరమున - దుర్గమున కెదురుగా నొక యడవి కలదు. దాని నడుమ నొక గుట్టపై నొక భవనము కలదు. ఫ్రిట్జ్ దూరబంధు వొకడు దాని యజమాని. ఫ్రిట్జ్ ప్రార్థనమున మే మా భవనమున బసచేయుట కాతడంగీకరించెను. దాని పేరు టార్లన్‌హీం భవనము. పట్టణమున కావలివైపు మైకేలు నివాసముండెను. తెల్లవారు జాముననే సేవకులు గుఱ్ఱములను సామానులను తరలించుకొని బయలు దేఱిరి. మేము మధ్యాహ్నము రైలులో బయలు దేఱితిమి. ముప్పదిమైళ్లు రైలులో పయనించి యచ్చటినుండి గుఱ్ఱముల నెక్కి పోయితిమి.

శాప్ట్, ఫ్రిట్జు, యిరువురేగాక నా వెనుక నింకను పది

ముండియుండిరి. వారినందఱిని బహు జాగ్రత్తగ నెన్నుకొని యుంటిమి. వారెల్లరు రాజునందు మిక్కిలి భక్తిప్రపత్తులు కల్గియుండిరి. వారికి కొన్ని నిజమగు సంగతులు తెలిపి యుంటిమి. వేసవి విడిదిలో నన్ను చంపుటకు మైకేలు కావించిన ప్రయత్నము వారికి తెలుపుటచే వారికి మైకేలునందు వ్యతిరేకభావమును రాజునెడల భక్తియు కలిగెను. రాజుగారి స్నేహితు నొకని జండాదుర్గమున మైకేలు నిర్బంధించియున్నట్లనుమాన మున్నదనియు నాతని తప్పించుటకూడ రాజుగారి యాశయములలో నొక్కటియనియు వారికి తెలుపబడెను. రాజుగారి ముఖ్యోద్దేశ్యము వంచకుడగు మైకేలుపై చర్యగైకొనుటయే యనుట వారికి స్పష్టము కావింపబడెను. రాజుగారు తమయందలి విశ్వాసభావముతో తమ సహాయము నపేక్షించుటే పదివేలుగా వారు భావించిరి.

ఈవిధముగ మా కార్యరంగము రాజధానీనగరము నుండి జండాకు మారెను. ప్రేమవిషయమును మఱచిపోయి నా శక్తి నంతటిని కార్యసాధనకై వినియోగింప నిశ్చయించితిని. సజీవునిగ రాజును దుర్గమునుండి కొనివచ్చుటే నా పరమలక్ష్యము. బలప్రయోగము నిరుపయోగము. ఉపాయమే తరణోపాయము. ముందేమిచేయవలయునో నేనప్పుడే యాలోచించి యుంటిని. మైకేలున కప్పుడే నా రాక తెలిసియుండును. వేటమిషతో నేను బయలుదేఱి వచ్చి యున్నను నా నిజమగు యుద్దేశ్యము నాత డెఱిగియుండె

ననియే నే నూహించితిని.

నా యూహ సత్యమే. నేను విడిది చేరిన గంటలోనే నన్ను దర్శించుటకు మైకేలుపక్షమున నొక రాయబారవర్గ మరుదెంచెను. వేసవి విడిదిలో నన్ను హత్యకావించుటకై వచ్చిన దుష్టత్రియమునుకాక తక్కిన ముగ్వుర నిప్పు డాతడు నాయొద్ద కనిపియుండెను. వారి పేరులు లాయెంగ్రామ్, క్రాఫ్‌స్టీన్, రూపర్ట్ హెంజూ. అందులో కడపటివాడగు రూపర్ట్ వయసు సుమా రిరువదిరెండు లేక ఇరువదిమూడేం డ్లుండవచ్చును. అతడు గొప్ప సాహసివలె కనుపించెను. ఆతడే మొదట చొరవ కలిగించుకొని యిట్లనెను. 'ప్రభూ, మీ ప్రియ సోదరుడగు మైకేలును, అతని పరివారములో పెక్కురును అంటురోగమగు నొక విషజ్వరమునకు గురియై యుండుటచే నాతడు తమ దర్శనమునకు స్వయముగ వచ్చు టకుగాని, తన భవనమును తమకు విడిదిగా నిచ్చుటకుగాని సాధ్యము కాలేదు. అందుల కాతడు తమ క్షమాపణను కోరుమనెను.'

'పాపము, ఆతని రోగబాధ త్వరలో నివారణ యగు నని విశ్వసించుచున్నాను.'

'ప్రభూ, ఐనను అతడు నిత్యకృత్యముల నిర్వహించు కొన గలుగుచున్నాడు.'

'ఆతని పరివారమంతయు వ్యాధిగ్రస్తము కాదను కొందును. స్నేహితులు డిగమెట్, బెర్సొనిన్, డిచర్డ్ వీరి

స్థితి యెట్లున్నది? డిచర్డున కేదో దెబ్బ తగిలినదటనే!'

ఈమాటకు రూపర్ట్ కాక మిగిలినవారు నివ్వెరపాటు తో ఒకరి మొగ మొకరు చూచుకొనిరి. రూపర్ట్ మంద హాసము చేయుచు 'ప్రభూ, త్వరలోనే దానికి తగిన మందొ కటి లభ్యమగునని యాతడు తలంచుచున్నాడు.'

ఆమాటకు నేను నవ్వితిని. డిచర్డ్ కోరిన మందేదో నాకు తెలియును - దాని పేరు ప్రతీకారము.

'ఐన మీా రిచ్చటనే భుజించి పొండు'

ఇందుకు రూపర్టు దుర్గమున తాము నిర్వహింపవలసిన పను లనేక ముండుటచే త్వరలో వెళ్లవలసియున్నందున నిలు చుట సాధ్యము కాదనియు క్షమింపవలయు ననియు నుడివెను.

'అయిన మనము త్వరలోనే మరల కలిసికొందము గాక!'

'ప్రభూ! అట్టి యవకాశ మచిరకాలముననే కలుగ గలదని యాశించుచున్నా' మని ఠీవిగ పలుకుచు హెంజూ నహచరసహితుడై నన్ను వీడ్కొనెను.

ఆరాత్రి నేను నా బసలో భుజింపలేదు. శాప్టరు బసలోనుంచి ఫ్రిట్జ్‌తో కలిసి గుఱ్ఱములమీాద జండాలో నే నెఱిగిన యొక చిన్న సత్రమునకు బయలుదేఱితిని. మా వెంట నొక యశ్వరక్షకు డుండెను. ఇతరులు నన్నానవా లిడకుండ నొక మేలి ముసుగును ధరించితిని. సత్రము చేర గానే నేను ఫ్రిట్జ్‌తో నిట్లంటిని.

"నీ వీ సత్రమువారితో 'రాజ కుటుంబమునకు చెందిన

వారు మిరుపురము వచ్చియున్నాము. మాలో నొకనికి పండ్లనొప్పి. మాకొక ప్రత్యేకమైన గదియు, భోజనమును, రోగికొక సీసా మంచి మద్యమును కావలయు'ననుము."

ఇరువురమును సత్రములోని కేగితిమి. మేలి ముసు గున్నందున కన్నులు తప్ప నా శరీరమంతయు నాచ్ఛాదితమై యుండెను. యజమానురాలు మమ్మాహ్వానించెను. రెండు నిమిషముల తరువాత యజమానురాలి కూతురు మాయొద్దకు వచ్చెను. మేము మా ప్రత్యేకమగు గదిలో నుంటిమి. ఆమె తెచ్చిన సారా సీసాను బల్లపై నుంచెను. ఫ్రిట్జ్ సీసాలోని మద్యమును గ్లాసులోనికి పోసి నాకిచ్చెను.

బాలిక జాలిగా 'అయ్యో, ఇతనికి చాల బాధగ నున్నదా?' యని ఫ్రిట్జును ప్రశ్నించెను.

వెంటనే నేను నా ముసుగును తొలగించి 'వెనుకటిసారి నీవు నన్ను చూచినప్పటికంటె హీనస్థితిలో లేను' అంటిని.

బా: (నిర్విణ్ణయై) ఆఁ, రాజుగారే! నే నప్పుడే మా యమ్మతో చెప్పితిని. ప్రభూ! అప్పుడు మే మాడిన మాటల మన్నింపుము.

'క్షమింపదగిన దేదియు లేదు లెమ్మ'

'మా తల్లితో పోయి చెప్పుదును'

'ఆగుము. పోయి భోజనము తెమ్మ. రా జిచ్చట నున్నాడను విషయము పొక్కనీయకుము'

ఆమె నా మాటప్రకారమే పోయి భోజనము తెచ్చెను.

నేను భోజన మారంభించుచు నామెతో సంభాషణకు మొదలిడితిని.

'జోహాన్ బాగున్నాడా?'

'అయ్యా, - కాదు, కాదు - మహాప్రభూ! అతడా?'

'అయ్యా యనుము. చాలును. ఆత డెట్లున్నాడు?'

'మే మాతని తఱచుగా చూచుట లేదు.'

'ఏల?'

'ఆత డిచ్చటికి విశేషముగ వచ్చిపోవుచుండ నేనే యాక్షేపించితిని.'

'కావున నాతడు వచ్చుట మానుకొన్నాడా?'

'ఔను'

'కావలసిన నీ వాతని పిలిచికొని రాగలవు గదా?'

'ఆఁ. పిలిచికొని రాగలను'

'చూచితివా! నీ శక్తి నాకు తెలియును'

'నా యాక్షేపణకు తోడుగా నాతనికి జండాకోటలో చేతినిండుగ పని సైత మున్నది.'

'అటులనా - ఇప్పుడు వేట లేదుగదా?'

'లేదండీ. కాని ఆత డిప్పు డింటి కావలికాడై నాడు.'

'జోహాన్ గృహిణిగా మారినాడా?'

ఆమె మహోత్సాహముతో మాటాడుట కారంభించెను. 'అచ్చట స్త్రీ లెవరును లేరట - అనగా పనికత్తెలు. అయినను నేనా మాట నమ్మను. ఒక్క స్త్రీవ్యక్తి మాత్రి

మున్నదట. జొహాక్ అచ్చటి పెద్దమనుష్యులకు సౌకర్యము లమర్చుచుండునట.'

'పాపము. జొహానునకు విరామములేని పని. ఐనను నిన్ను చూచుట కొరక యరగంట రాగల ననుకొందును'

'ఆ విషయ మవకాశము బట్టి యుండును.'

'నీ వాతని ప్రేమింతువా?'

'లేదండీ'

'రాజసేవ చేయుట కిచ్చగింతువా?'

'ఔనండీ'

'ఐన రేపు రాత్రి పదిగంటలకు జండాకు బయట రెండవ మైలురాయి యొద్ద నిన్ను కలిసికొనుమని యాతనితో చెప్పుము.'

'ఆతని కేమైన యపాయము చేయ బూనుదురా?'

'లేదు. నేను చెప్పిన ట్లాతడు నడచుకొన్న నే యపాయము రాదు. నేను చెప్పినట్లు నీవు చేయుము. రా జిచ్చటికి వచ్చియుండెనని యెవ్వరికిని తెలియకూడదు సుమా!'

అనుచు నే నామె కొరక యందమగు బహుమతి నిచ్చి పంపితిని. భోజనము ముగించి పూర్వమువలెనే ముసుగు ధరించి ఫ్రిట్జుతోగూడ బసకు బయల్దేఱితిని. తోవలో ఫ్రిట్జ్ 'ఈ జొహానును పట్టనెంచితివా?' య నెను.

'ఆ. సరియైన మొఱ వేసిన ట్లూహించుచున్నాను.'

ఈ విధముగ మాటాడుచు మేము త్వరలో మా విడిది

చేరితిమి. మా యశ్వముల చప్పుడు విని శాఫ్ట్ బయటికి వచ్చి 'అబ్బా! దేవునికి వేయి వందనములు. మీరు సురక్షితముగ వచ్చితిరి గదా! త్రోవలో వా రెవ్వరైన కనుపించిరా?' యని యడిగెను.

నేను గుఱ్ఱము దిగుచు 'ఎవరు?' అంటిని.

అశ్వరక్షకులు వినకుండునట్లు అతడు నాతో నిట్లు చెప్పెను. 'తగిన పరివారము లేనిదే నీవు బయటికి పోరాదు మనవారిలో బెర్‌నెన్‌స్టీన్ అనువానిని నీ వెఱుగుదువు గదా? అతనికి గుండుదెబ్బ తగిలి మిద్దెపైన గదిలో పడినాడు.'

'ఆఁ - అటులనా?'

'ఔను. భోజన మైనతరువాత నత డడవిలోనికి షికారు వెడలియుండెను. అచ్చట నతనికి ముగ్గురు వ్యక్తులు కనుపించిరట. వారిలో నొక్కఁడు తన తుపాకి నాతనిపై ప్రేల్చుటచేత నాతని చేతికి గాయము తగిలినది. అత డింటివైపు పరువిడి వచ్చినాడు. రాగానే మూర్ఛ వచ్చినది. అదృష్టముచేత వా రాతని నింటికే తఱుముకొని రాలేదు. ఆదెబ్బ నీ కుద్దేశింపబడినది.'

'కావచ్చును. మైకేలే కయ్యమునకు మొదలెత్తి వచ్చినాడు.'

'వా రేమువ్వురో' యని ఫ్రిట్జ్ ప్రశ్నించెను.

నే: శాఫ్ట్! నేనీదినము పనిలేక బయటికి పోయియుంటి ననుకొనకుము. ఆ విషయ మంతయు నెఱిగింతును లెమ్ము.

నా మనసులో నొక విషయ మున్నది.

'ఏమది?'

'ఏమందువా? దేవుని సహాయమున నేను దరిలేనియా నుండి వెడలులోపల నీయూరుగురిలో నొక్కనిగూడ ప్రాణము లతో మిగులనీయను. అట్లు మిగులనిచ్చిన దరిలేనియా నా కొసగిన గౌరవమునకు న్యూనత కల్గించినట్లగును.'

శాప్ట నాప్రతిజ్ఞ నంగీకరించుచు కరచాలనము కావించెను.

## 13

మరునటిదినము నేను బసలో పడకలో చేరగిలబడి స్నేహితుడు హాయిగా పాడుచుండగా వినుచుంటిని. ఆ సమ యమునకు సరిగా రూపర్టు వచ్చి నా దర్శనము కోరెను. డ్యూకు అతనిద్వారా నా కొక సందేశ మంపియుండెను. దానిని నా కందజేయుటకై యాతడు వచ్చెను. అతడు గుండె దీసినబంటు. లేకున్నచో దట్టమగు తరులతాదులచే నిండి మనుష్యుడు దాగుకొనుట కెన్నియో యవకాశములు గల యా యరణ్యమధ్యమునుండి యొంటరిగ వచ్చుటయన్న సామాన్య మగు విషయమా? అతడు రాగానే అచ్చట నున్నవారి నందఱి నావలకు పంపితిని. ఆతడు ప్రవేశించి నాప్రక్కన కూర్చొ నుచు 'రాజు ప్రేమనిమగ్నుడై నట్లున్నదే' యనెను.

'ప్రాణముమీాద కాదు'

'మంచిదే. మన మేకాంతమున నున్నాము. వినుము 'రాసిండల్!'

నేను సవరించుకొని కూర్చుంటిని.

'విశేషమేమి?' అని యాత డనెను.

'ఏమియు లేదు. ఎవరినైనను పిలిచి నీ గుఱ్ఱమును తెప్పింత మనుకొంటిని. నీకు రాజును సంబోధించుట తెలియనిచో మైకేలు మరియొక వార్తాహరుని నియమింపవలసి యుండును'

ఈమాటలను నిర్లక్ష్యముచేయుచు 'ఈ నాటక మింకను ఎందులకు?' అనెను.

'ఎందులకా! ఇంకను ముగియలేదు గనుక'

'అటులనే కానిమ్ము. అయినను నీమీద ప్రేమచేతనే నేను మాటాడుచున్నాను. నీవు నా మది కెక్కినవాడవు'

'ఉండని. ఆ వార్త యేదో తెలుపుము.'

'డ్యూకు నీయెడ నాకంటె ఉదారముగ ప్రవర్తింప దలచినాడు. నీ కురితాళ్ళే తగునని నేను సలహా నిచ్చితిని. కాని డ్యూకు దశలక్ష క్రౌనులనిచ్చి సురక్షితముగా సరిహద్దు దాటింతు ననెను.'

'నే నేదైన షరతునకు కట్టుబడవలసి వచ్చుచో నీ ప్రతిపాదననే కోరుకొందును'

'ఐన నీ వాతని ప్రతిపాదనను నిరాకరింతువా?'

'ఆ'

మైకేలునకు నేనప్పుడే యామాట చెప్పితిని. మనలో మాట... మైకేలు నిజముగ యోగ్యుడెవ్వడో గుర్తింపలేడు,

నేను నవ్వుచు 'నీవో?' యంటిని.

'నేను గుర్తింపగలను. మంచిది. నీ కురితాడే యుండనిమ్ము'

'దానిని చూచుటకు నీవు సజీవుడవై యుండవని చెప్పుటకు చింతించుచున్నాను'

'అయిన ప్రభువులవారేదో కర్యమునకు కాలుదువ్వుచున్నట్లున్నదే'

'నీవింకను పెద్దవాడవై యుండిన బాగుండెడిది.'

'ఓహో! అటులనా! కాని నన్ను నేను కాపాడుకొనగలను.' అనుచు నాతడు నవ్వెను.

'మీ బందీ ఎట్లున్నాడు?'

'ఆ - రా -'

'మీ ఖైదీ'

'మీ కోరికను మఱచితిని ప్రభూ! ఆతడు సజీవుడై యున్నా" డనుచు నాతడు లేచి నిలుచుండెను. నేను నల్లే కావించితిని.

అంతట నా జీవితములో కని విని యెఱుగని సాహసము ప్రదర్శితమయ్యెను. నా స్నేహితులెల్లరు సుమారు ముప్పదిగజముల దూరమున నుండిరి. రూపర్ట్ ఒక యశ్వరక్షకుని పిలిచి తన గుఱ్ఱమును తెమ్మని చెప్పుచు నాతని

కొక నాణ్యమిచ్చి పంపెను. వాడు గుఱ్ఱమును తెచ్చెను. ఆతడు గుఱ్ఱము దాపున నిలుచుండెను. నేను నిశ్శంకుడనై నిశ్చలముగ నిలుచుకొని యుంటిని.

రూపర్ట్ గుఱ్ఱ మెక్కువానివాలె నటించుచు హఠాత్తుగ నావైపునకు తిరిగి తన యెడమచేతిని నడుముపై నుంచుకొని కరచాలనము కావింప కుడిచేతిని ముందుకు చాచెను. ఆతని యూహ కనుగుణముగనే నేను చేతులను వెనుక నుంచుకొని ముందునకు వంగి నమస్కరించితిని. మనోవేగమునకంటె త్వరగ నాతడెడమచేతితో నొక చిన్న చురకత్తిని తీసి నా యెడమభుజమున దూసెను. నే నించుక కదలకున్నచో నా దెబ్బ నా హృదయమును చీల్చియుండును. కెవ్వన కేక వేయుచు నేను తడబాటుతో వెనుకకు తగ్గితిని. అతడు వెంటనే గుఱ్ఱమెక్కి మెఱపువలె మాయమయ్యెను. ఇంతలో మావా రాతని వెన్నంటి పిస్తోళ్లను కాల్చిరి. వారి ప్రయత్నము వమ్మయ్యెను. నేను నా కుర్చీతో చతికిలబడితిని. గాయమునుండి రక్తము కాలువవలె ప్రవహించుచుండెను. నా స్నేహితులు నన్ను చుట్టుముట్టిరి. నాకు ప్పెను-

కొన్నిగంటలకాలము నే నావిధముగ తెలివితప్పి పడియుంటిని కాబోలు! నాకు మెలకువ వచ్చునప్పటికి చీకటి పడియుండెను. నాప్రక్కన ఫ్రిట్జ్ కూర్చొని యుండెను. ఆతడు నాతో నేను త్వరలోనే తేఱుకొగలననియు మా ప్రయాగము ఫలించుటచే జోహాణ్ చేజిక్కెననియు చెప్పెను. నా కోరిక

మేరకు వెంటనే జోహానును నాయొద్దకు పిలిచికొని వచ్చిరి. కొంతదూరమున నాతని కూర్చుండబెట్టితిని. ఇచ్చటికి వచ్చి యుండుట యాతని కిష్టముగ నున్నట్లే కనబడెను. మైకేలు పన్నుచుండు కుట్రలన్నిటిని మా కెఱిగించినచో ననేక బహుమతు లిత్తుమని యాతని కాశలు చెప్పితిమి. ఆతడు దుష్టుడు కాడనియు దుర్బలుడనియు డ్యూకువలని భయముచేతనే యాతని యాజ్ఞానువర్తియై యుండెనేకాని యాతనియందలి యభిమానముచేత మాత్రముకాదనియు మేము గ్రహింపగలిగితిమి. ఆతడు తన కథ నంతయు నీవిధముగ తెలిపెను.

'పాతకోటలో నేలమట్టమునకు క్రిందుగా కొండరాతిలో తొలువబడిన చిన్న గదులు రెండున్నవి. వీనిలోనికి దిగిపోవుటకు రాతి మెట్లికె లున్నవి. ఈ మెట్లికె లచ్చటినుండీ యీద్వారం తెనవఱకు నున్నవి. వానిలో బయటి గదికి కిటికీలు లేవు. వెలుతురుకొఱకు మైనపువత్తుల వెలిగించి పెట్టుదురు. లోపలి గది కొక చదరపు కిటికీ యున్నది. అది కందకమువైపున నున్నది. రాత్రింబవళ్లు దుష్టషట్కమందలి ముగ్గురు బయటి గదిలో కావలియుందురు. వారా గది వాకిలిని సాధ్యమైనంతవఱకు కాపాడుచుండవలయునని మైకేలు ఆజ్ఞ. ఏ కారణముచేనైన బయటి గదివాకిలి శత్రుహస్తగత మగుచో రూపర్టుకాని డిచర్డుకాని (వారిలో నొకడెప్పుడు నచ్చట నుందురు) వెంటనే మిగిలిన యిరువురిని బయటి గదిలో సాధ్యమైనంతవఱకు పోరాడుటకు విడిచిపెట్టి లోపలి గదిలోనికి

పోయి నిరాలస్యముగ రాజును తుదముట్టింపవలెను. రాజు నిరాయుధుడు. శృంఖలాబద్ధహస్తుడు. కావున బయటి వాకిలి ధ్వంస మగులోపల రాజు చంపబడియుండును. మరి కళేబరమో? అది యున్నను ప్రబల సాక్ష్యముగ నుపకరించును గదా! ఆ విషయమును గూడ నైకే లాలోచించి తగు ఏర్పాటు కావించియున్నాడు. లోపలి గదిలోని కిటికీకి సరిగా నొక పెద్ద మంటి గొట్టమును క్రిందనుండు కందకము లోని నీటిమట్టమును తాకునట్లు అమర్చియున్నారు. ఈ గొట్టములో నొక మనుష్యుని శరీరము సులభముగా దిగజారి పోవుటకు చక్కని సదుపాయము కలదు. ఏవస్తువు నీట బడినను చప్పుడు కాదు. కావున రాజును చంపినవ్యక్తి వెం టనే కిటికీకున్న ఊచలను తొలగించి రాజు శరీరమును గిలక సహాయమున కిటికీవఱకు పైకీడ్చుకొని దాని కొక బరువుకట్టి దానితోగూడ నాకళేబరము నా మంటి గొట్టములోనికి చొప్పించి జారవిడుచును. నిశ్శబ్దముగ నాశరీరము కందకము లోని నీటి యడుగుభాగమును చేరును. నీటిలోతు సుమా రిరువది యడుగులు. ఈపని చేసి వెంటనే యాతడు 'అంతయు సురక్షితం' మని యఱచి తాను గొట్టమునుండి కందకములోనికి జారును. ఇంతలో బయటి గదిలోనివారు సాధ్యమైనచో వెను కటి గదిలోనికి వచ్చి, వాకిలి బంధించి, కిటికీనెక్కి మొదటి వాని మార్గముననే కందకములోనికి ప్రవేశింపవలెను. ఈ ముగ్వురు నచ్చటనుండి నీటిలో నీదుచు కందకము ఆవలి దరి

జేరవలెను. అచ్చట వారిని గట్టున కీడ్చుకొనుటకు తగిన ఏర్పాటుండును. ఒకవేళ కథ యడ్డము తిరిగినప్పైన డ్యూకు గూడ వారి నచ్చట కలిసికొని 'బ్రతుకు జీవుడా'యని పారి పోవును. కాని వారి కనుకూలముగ నన్నియు జరిగిన వా రచ్చటినుండి సింహద్వారముగుండ కోటను ప్రవేశించి శత్రువుల బంధింతురు. ఇదియే మైకేలు పథకము. కాని యీ పద్ధతి కడపటిది. రాజును చంపుటకు ముందుగనో తరువాత నో నన్ను చంపగలిగిననే కాని యీతడు రాజును చంప దల చుటలేదు. ప్రభూ! ఉన్నదంతయు నివేదించితిని. మైకేలు బారినుండి నన్ను రక్షించు భారము మీపై నున్నది. ఈ పని చేసినతరువాత నే నాతని చేతికి చిక్కుటే సంభవించెనా నన్నాతడు నానాచిత్రహింస పెట్టికాని చంపడు"

ఆతడు చెప్పిన విషయములనుబట్టి చక్కని సైన్యముతో దుర్గముపై బడిన మైకే లనుసరింపనున్న పద్ధతిగూడ తెలిసెను. కాని సందర్భవశమున వీలులేని పరిస్థితులు కల్గిన చల్లగా రాజును వధించి యాగొట్టముద్వారా కందకములోనికి త్రోయుటయే జరుగగలదు. కావున నట్టి పరిస్థితిని నే నాత నికి కల్పించిన నది యనాలోచితము నవివేకము నగును. కార ణమేమన నే నొకవేళ బలప్రయోగమున కోటలో ప్రవేశించితి నేని రాజును చంపి కందకములో వేసి తన యారుగురిలో నొక్కని రాజునకు బదులుగ గదిలో నుంచి, కోటలోనుండిన యొకానొక స్త్రీవ్యక్తియెడ నక్రమముగ వర్తించినందున -

జండాప్రభువుగా తన యధికారమును పురస్కరించుకొని - యాతని నిర్బంధములో నుంచితిననియు నిప్పు డాతడు క్షమా పణ కోరుచున్నందున విడిచిపెట్టుచున్నాననియు చెప్పును. అప్పుడు జండాలోని బందీవిషయ మందఱకు తెలియగలదు. నిశ్చేష్టులై యెల్లరు వెనుకను పోవలసివచ్చును. తీరుబడిగా రాజు కళేబరము నాతడు తొలగించివేయును.

ఈ క్రూర పథకమును విన్నంతనే నేను ఫ్రిట్జ్, శాప్ట్ ముప్వురము నప్రతిభులమైతిమి. ఆతని నెదుర్కొన నే నెట్టి ప్రయత్నము కావించినను రాజు చచ్చుటమాత్రము నిశ్చయ మని తోచెను. ఒకవేళ నన్నాతడు జయించెనా యాతని రొట్టెవిరిగి నేతిలో పడినట్లే యగును. ఒకవేళ నేను జయించి తినా నాతప్పు బయటపడనిదే యాతని దోషిగా నిరూపించుట సాధ్యముకాదు. ఈవిధముగ నెన్నియో యాలోచనలు నాకు తట్టెను. నేను జోహానును చూచి 'రాజున కీ విషయము తెలియునా?' యని యడిగితిని. 'ప్రభూ, రూపర్ట్ ఆజ్ఞమేరకు నేనును మా యన్నయు కలిసి యా మంటిగొట్టము నది యిప్పు డున్నస్థానమున నమర్చితిమి. ఆదినము రూపర్టే రాజుగారికి కావలియుండెను. రాజుగారు దానినిగూర్చి యాతని బ్రశ్నిం చిరి. అందు కాతడు కేవిగా నవ్వుచు "అది స్వర్గమునకు నూతన మార్గము. అందఱును పోయినట్లోవనే ప్రభువుల వారును స్వర్గమున కేగుట యనుచితమని యెంచి మీకై ప్రత్యేక మగు నందమైన మార్గము నేర్పఱచితిమి. దీని యర్థ

మిదియే" యనెను. ఈమాట లాడుచు తన వైపు హేళ నగా చూచుచున్న రూపర్టుముఖమును, మంటిగొట్టమును, చూచినకొలది ధైర్యశాలియైన రాజు మొగము తెల్లబోయెను. (ఈమాట లాడుచున్న జోహాన్ శరీర మాద్యంతము కంపించెను) 'ప్రభూ! జండా దుర్గమున నిశ్చింతగ నుండు టసాధ్యము. అచ్చట నుండువా రందఱికి మనుష్యుల చంపుట యన్న నొక లెక్కలోనిది కాదు. అందులో రూపర్టున కది యభిమాన పాత్రమైన చర్య'యని యాతడు ముగించెను.

ఫ్రిట్జును పిలిచి యాతని భద్రముగ కాపాడవలసినదని యాదేశించితిని. తరువాత జోహానుతో 'జండాలో నెవరైన బందీ యున్నాడా?'యని నిన్నెవరైన ప్రశ్నించిన 'ఔ'నుము. కాని యాత డెవ్వరోమాత్రము చెప్పకుము. నాయాజ్ఞ మీఱితివా నీ తల యెగురు'నని చెప్పితిని. ఆతడు వెళ్లిన తరువాత శాప్టుతో 'ఇది యొక విషమసమస్యగా నేర్పడిన' దంటిని.

'విషమము కాదు. విషమతమము'

'రాజు ప్రాణములతో బయటపడవలెనన్న రెండే మార్గము లున్నట్లు తోచుచున్నది. అందులో మొదటిది - డ్యూకుపరివారమును భేదోపాయము కల్పించి మోసగించుట.'

'ఆ మాట విడిచిపెట్టుము.'

'నే నట్లు తలంపను. ఇక రెండవ మార్గము - దైవ ఘటన'

## 14

ఏదో వ్యాయామ క్రీడయందు ప్రమాదవశమున బల్లెము తగులుటచే రాజుగారికి అపాయకరమగు దెబ్బ తగిలినదను సధికారప్రకటన వెలువడినది. ఇందువలన రెండు ఫలితములు కలిగెను. మొదటిది ఫ్లేవియా రాకుమారి ఎవరి మాటలు లెక్కగొనక టార్లెన్‌హీం భవనమునకు ప్రయాణముకట్టెనని మార్షల్ స్ట్రాకెంచ్ చెప్పిపంపెను. రెండవది మైకేలునకు నేను నిజముగ గాఢమైన దెబ్బతిని లేవలేని స్థితిలో పడియున్నాననియు కొంతవఱకు ప్రాణాపాయస్థితికూడ నున్నదనియు తెలియవచ్చుట. ఈ విషయము నాకు జోహాన్ ద్వారా తెలిసెను. జోహానును నేను నమ్మి మరల జండాకు పంపియుంటిని. రూపర్టు రాత్రియంతయు నతడు గైరుహాజరైనందుకు చావమోదియుండెను. దానితోనే జోహాన్ కోపముగానుండ డ్యూకు రూపర్టుచర్యను సమర్థించుటచేత జోహానుకు వారిపై మరియు కోప మెక్కుడై పూర్తిగ మా కనుకూలుడుగ మారిపోయెను.

అతడు వచ్చి దినదినమునకును రాజుగారి స్థితి హీనమున నున్నదని తెలుపుటచేతను, మార్షల్ వెంట రాగా మేమున్నచోటికి వచ్చియున్న ఫ్లేవియా రాకుమారి త్వరలో వివాహము నిశ్చయింపవలయునని నన్ను నిర్బంధించుటచేతను మే మేదో యొక తీవ్ర చర్యకు వెంటనే పూనుకొనక తప్పదను నిర్ణయమునకు వచ్చితిమి.

ఈ మధ్య నేను జీవితముపై బహు నిర్లక్ష్యముగ సంచరించుచుంటిని. నన్ను వారించినను ఉపయోగము లేదని నా నెయ్యు రూరకుండిరి. అదృష్టముకొలది యేదో యొకటి జరుగగలదని మైకేలు విషయమై నే నెట్టి చర్య తీసి కొన్నను వారు పల్లెత్తుమాట పలుకకుండిరి.

మరునటిరోజు రాత్రి ఫ్లేవియా పరున్నతరువాత నా గుడ్డలను మార్చి బ ్రైతితిని. ఆరుగురు మనుష్యులతోను గుఱ్ఱములతోను శాప్టున్ను ఫ్రిట్జున్ను నాకొఱకు వేచియుండిరి. శాప్ట్ తనవెంట నొక పెద్ద త్రాటిని తెచ్చియుండెను. వారిను వురియొద్దను ఆయుధములుకూడ నుండినవి. నే నొక చిన్న దుడ్డుకఱ్ఱను, పెద్ద చాకు నొకదానిని తీసికొంటిని. మే మొక చుట్టుత్రోవలో వెడలి యనతికాలములనే దుర్గమున్న కొండ నెక్కసాగితిమి.

అది యొక చీకటి రాత్రి. ఉఱుములు మెఱపులతో చినుకు లారంభమయ్యెను. క్రమముగ ఝంఝామారుతము వీవసాగెను. దుర్గమున కరమైలు దూరమున మా స్నేహితుల నార్గురను నిలిపితిమి. శాప్ట్ ఈల వేసినతోడనే వారు వచ్చి మమ్ము కలిసికొనవలయునని ఏర్పాటు కావించితిమి. నే నింకను పడకలోనే యున్నానని మైకేలు తలంచియుండెను. కావున కావలా యుండవలసినంత సమర్థముగ లేకుండెను. ఎట్లున్నను మే మేవిధమగు నపాయములకు లోనుగాక కందకము గట్టు చేరితిమి. అచ్చట నొక వృక్షముండెను. శాప్ట్

తనయొద్దనున్న త్రాటిని తీసి యొక కొనను ఆచెట్టునకు గట్టిగా కట్టివేసెను. నేను నా పాదరక్షలను తీసివేసి యొక లోటా బ్రాందిని సేవించి కత్తి నోటియందు నుంచి దుద్దుకట్టును ముని పండ్లతో కఱచుకొంటిని. నా స్నేహితు లీ సాహసము వల దని సూచించిరి. నేను లక్ష్యముచేయక వారితో సెలవు పుచ్చుకొని కందకము ప్రవేశించితిని. రాజుగారిని బంధించి యుండు గదిబయట నమర్చియుండు మంటిగొట్ట మెట్లున్నదో చూత మనుటయే యిప్పటి నా ప్రయాణపు ముఖ్యోద్దేశ్యము.

నిశ్శబ్దముగ నీటిలోనికి ప్రవేశించితిని. పగ లంతయు నెండ కాచియుండుటచే నీరంత చల్లగా నుండలేదు. నేనాకోట గోడ వెంబడినే నెమ్మదిగ నీద సాగితిని. నాముందు సుమారు తొమ్మిది యడుగుల వఱకుమాత్రి మగపడుచుండెను. నన్నె వ్వరును చూడలేరని నా నమ్మకము. నూతన దుర్గమునందలి దీపము వెలుతురు కనబడుచుండెను. అచ్చటివారి నవ్వులు హర్షధ్వనులు నాకు వినిపించుచుండెను. నే నచ్చట నొక క్షణ మాగితిని. జోహాన్ వర్ణన సత్యమైనచో నే నిప్పుడు రాజుగారి గది కిటికీదగ్గఱ నుండవలెను. నాముందు కొంత దూరమున చీకటిలో నేదో యొక వస్తువు కనబడెను. అదియే మంటిగొట్టము. అది కిటికీనుండి నీటి మట్టమువరకు వంపుగా నమర్పబడియుండెను. ఆగొట్టము గుండ్రముగ నుండెను. ఇరువురు మనుష్యు లొక్కసారిగ దానిలో పట్టవచ్చును. నేను దానిని సమీపించులోపల నింకను నేదియో యొక వస్తువు

కనబడెను. నాగుండె గుభేలుమనెను. అది యొక పడవ కొన. గొట్టమున కావలివైపున నుండెను. ఒక మానిసి కదలిన శబ్దమయ్యెను. కావలివాడేమో యనుకొంటిని. అతడు మేల్కొన్నాడా? నిద్రించినాడా? నేను నా చాకును సిద్ధముగ నుంచుకొని నీటిలో ముందుకు ప్రాకితిని. నా కాలికి కోట పునాదియంచు తాకెను. అది సుమారు పదునైదంగుళముల వెడల్పున నుండెను. నేను దానిపై నిలిచికొంటిని. ఇప్పుడు నా భుజములవఱకు నీరుండెను.

ఆపడవలో నొక మనుష్యుడుండెను. ప్రక్కన నొక తుపాకి. కావలివాడు కాబోలు! ఆతడు కదలలేదు. తీవ్రముగ శ్వాసించుచుండెను. కొంచెము నిదానించి చూచితిని. గాఢనిద్రాపరవశుడై యుండెను. ఆతని ముఖమునకు రెండడుగుల దూరమున నా ముఖము నుంచి చూచితిని. ఆతడు విగ్రహపుష్టి గలవాడు; జొహార్ అన్న మ్యాక్స్‌హాఫ్. నేను నా నడుములోనికి చేయివేసి చాకును బయటికి తీసితిని. జీవితములో నేనొర్చిన కార్యములలో నెల్ల నిది హేయమనుకొందును. నాయీ చర్య ద్రోహపూరితమో వీరపురుషోచితమో చెప్పలేను. నాలో నేను 'ఇది యుద్ధము. రాజు జీవితము ప్రమాదములో నున్నది.' అని తలంచి పడవను సమీపించితిని. ఊపిరి బిగియబట్టి యాయుముచూచి గురిపెట్టి చేయెత్తితిని. ఆతడు కదలి కన్నుల తెఱచెను.

నా ముఖము చూడగనే భీతిచే నాతడు తుపాకిపై

చేయి వైచెను. ఇంతలో చాకుతో నే నాతని పొడిచితిని.

పడియున్న చోటనే యాతని విడిచి నేను గొట్టమువైపు తిరిగితిని. నా కున్న యవధి స్వల్పము. ఇతని వంతు తీరి వేరు కావలివాడు వచ్చువేళ యైయుండవచ్చును. గొట్టముపై వాకిలి నీటి నంటియున్న దానికొన భాగమునుండి పైవఱకు పరీక్షించితిని. ఒక్క సెఱిగాని తుద కొక యతుకుగాని కనబడలేదు. గొట్టము గోడ నంటిన భాగమును పరికించితిని. నా కొక చిన్న వెలుగు కనిపించెను. ఆ వెలుతురు రాజు గారి గదిలోనిదై యుండవలెను. నా కొక కఠోర కంఠ స్వరము వినిపించెను.

'ప్రభూ! నా సాహచర్యము మీ కిష్టము లేకున్న విశ్రాంతి గొనుడు. కాని మొదట మీ చేతికి సంకెళ్ల తగిలింతును.' అతడు డిచర్డ్. 'నేను వెళ్లుచుంటిని. మరే మైన నడుగదలచితిరా?' రాజుగారి మాటలు వినబడెను. హీనస్వరమున నాత డిట్లనెను.

'నేనీ చావు చావలేను. ఒక్కసారిగా నన్ను చంపుమని నా సోదరుని ప్రార్థింపుము.'

'ప్రభూ, ఇంకను ఆతడు మీ మరణమును కాంక్షించుట లేదు. కాంక్షించెనా, అదిగో చూడుడు, అదియే మీరు స్వర్గమునకు పోవు దారి.'

'అటులనే కానిమ్ము. నీ కనుమతి యుండిన నన్ను విడిచి వెళ్లుము.'

'స్వర్గమును గూర్చి సుఖస్వప్నముల కాంతురుగాక!' యనుచు నాదుండగీడు అటనుండి కదలిపోయెను. వెలుతురు మాయమయ్యెను. తలుపు వేసినచప్పుడు వినబడియెను. రాజు గారి నిట్టూర్పులు వినిపించెను.

ఆరాత్రి మరేమి చేయుటకును నేను సంకల్పింపలేదు. పడవత్రాటిని సడలించి అందులో కావలివాని కళేబరముతో సురక్షితముగ వెనుకకు పోవలెననియే నా తలంపు. పడవలో కూర్చుంటిని. గాలి విపరీతముగ వీచుచుండుటచే తెడ్లశబ్దము వినబడు నవకాశము లేకుండెను. త్వరత్వరగా నా స్నేహితులు కాచుకొనియుండుచోటికి పడవను తరలించుకొని పోయితిని. నే నా చోటు చేరితినో లేదో ఒక పెద్ద ఈల వినిపించెను. 'ఓ మ్యాక్స్' అను పిలుపు విననయ్యెను. నేను చిన్న గొంతుకతో శాప్టును పిలిచితిని. త్రాడు క్రిందికి వచ్చెను. పడవలోని శవమున కాత్రాటిని కట్టి దాని సహాయమున తొలుత నేను పైకెక్కి పోయితిని. శాప్టుతో 'నీవును మనవారిని హెచ్చరించుచు నీలవేయుము. త్రాటిని పైకీడ్వుడు. ఇప్పుడు మాటలతో పనిలేదు.' అని మెల్లగా చెప్పితిని.

కళేబరమును వారు పైకీడ్చిరి. అది పైకి చేరు నంతలో నూతన దుర్గమునుండి ముప్వురాశ్వికు లరుదెంచిరి. మేము వారిని చూచితిమి. మేము పాదచారులము కావున వారి కంటబడలేదు. కాని మావా రఱచుచు వారిని పైకొనివచ్చుట వింటిమి.

'అబ్బా! గాఢాంధకారము.' అను నొక కంచు కంఠము వినబడెను. అతడు రూపర్ట్. క్షణముతరువాత తుపాకీ మోతలు. మావారు వారి నెదిరించిరి. ఫ్రిట్జ్, శాఫ్ట్, యిరువురు న న్ననుసరింపగా మేము కాలికి బుద్ధి చెప్పితిమి.

'రూపర్ట్! నాపని ముగిసినది. ఒకనికి ముగ్గురు. ప్రాణ రక్షణము కావించుకొమ్ము.' అనుమాటలు వినిపించెను.

చేత దుడ్డుకఱ్ఱను పట్టుకొని పరువిడ నారంభించితిని. హఠాత్తుగ నొక యశ్వము నావైపునకు వచ్చెను. దానిపై నొక వ్యక్తియుండెను. ఆతడు 'క్రాఫ్ స్టీన్! నీ పనియు ముగిసినదా?' యనెను. సమాధానము లేదు. వెంటనే నే నా యశ్వముపై దూకితిని. ఆతడు రూపర్ట్. 'అబ్బా! కడపటికి' అంటిని. అతడు మా బారినిపడినట్లే కనుపించెను. ఆతని చేతియం దొక కత్తిమాత్రముండెను. మావా రాతని తీవ్రముగ నెదుర్కొనిరి. తుపాకితో కాల్చుటకు సాధ్యపడునంత దగ్గఱి కేగగలిగినచో నాతడు చావనైన చావవలెను; లేదా మాకు దాసోహ మనవలెను. నేను మరల 'కడపటికి దొరకితివి'అని యఱచితిని. రూపర్ట్ వెంటనే 'వేషధారియా?' యనుచు చేతనున్న కత్తితో నా దుడ్డుకఱ్ఱను రెండు ముక్కలు కావించెను. ప్రాణరక్షణకై నేను తలదాచుకొని పరువిడితిని. (ఈ విషయమును తెలుపుటకు సిగ్గిలుచున్నాను) రూపర్ట్ తన తురగము నదలించి కందకము గట్టుచేరి యందు లోనికి దుమికెను. మావా రాతని వెంబడించి తుపాకితో

కాల్చిన కాల్పు లన్నియు వృథయయ్యెను. సాప్ట్ నాతో 'అతనికి తెగువ ఎక్కువ' యనెను.

'అవును. కాని దుర్మార్గుడు. ఇప్పుడు మన బారికి పడినవా రెవ రెవరు?'

'లాయెన్‌గ్రామ్, క్రాఫ్‌స్టైన్'

వీ రిరువురును చచ్చిపడియుండిరి. వారిని మ్యాక్స శవముతోగూడ కందకములోని యగాధ జలమున పడవైచి తిమి. తరువాత నందఱమును కలిసి గుట్ట దిగి వచ్చితిమి. మాలో మువ్వురు చచ్చిరి. వారి మృతికి విచారించుచు మే మింటిదారి పట్టితిమి. రాజుగారిని గూర్చిన యాలోచనతో మా హృదయములు సంతప్తములయ్యెను. రూపర్టు మరల మమ్ము జయించినందుల కెంతయో వగచితిమి. నేను మా త్రిము నిద్రించుచుండినవాని నొక్కని చంపుట తప్ప ఒక్కరుని గూడ ముఖాముఖిని పోరాడి చంపలేదు. రూపర్టు నన్ను 'వేషధారి' యని సంబోధించుట నాకు రుచింపలేదు.

## 15

రురిటేనియా ఇంగ్లండు కాదు. లేనిచో నాకును డ్యూకునకును జరుగుచుండు నీ సంఘర్షణము జనుల దృష్టి నెక్కువగ నాకర్షించియుండును. అయినను మా సంఘర్షణలో పాల్గొని చనిపోయినవారి విషయములు వారి బంధువర్గమునకు

గూడ తెలుపక రహస్యముగనుంచుట సాధ్యము కాకపోయెను. అందుచేత నిట్టి వ్యక్తిగత సంఘర్షణ లెచ్చట జరుగరాదని నే నొక గట్టి యుత్తర్వు జారీ చేసితిని. మైకేలున కధికార పూర్వకమగు నొక క్షమాపణ పత్రిమును బహిరంగముగ నంపితిని. దాని కాతడు గౌరవపురస్సరముగ తగిన సమా ధానమంపెను. మాలో నెవరును బయటపడుటకు సిద్ధముగ లేకుండుటయే యిందులకు కారణము. మే ముభయులమును 'నాటక పాత్రిధారులమే' - ఒకరి నొకరు ద్వేషించుకొను వారమే. లోకము కన్నుగప్పుటలో మాత్రమే మా యిరు వురి ఐక్యత.

మే మిరువురమును విఫలయత్నులమైన తరువాత కొంత కాలము శాంతి పొడసూపెను. జండాలో పగటిపూట ఉభయ పక్షములవారును నిర్భయముగ రాకపోక లొనర్చుట కవ కాశము లేర్పడెను.

ఒకనాడు నేను ఫ్లేవియాతోను శాప్టుతోను పురవీధు లలో నేగుచు నొక పరిచితు నెదుర్కొనుట సంభవించెను. అశ్వారూఢులమై మే మేగుచుండ గుఱ్ఱపుబండిలో మా కెదు రుగ వచ్చుచుండు నొక పెద్దమనుష్యుని చూచితిమి. ఆతడు తన బండినాపి దిగివచ్చి నన్ను సమీపించి నమస్కరించెను. ఆతడు స్ట్రెల్సా రక్షకభటాధ్యక్షుడు.

'వ్యక్తులు పోట్లాడుకొనరాదని తాము చేసిన యుత్తర్వు నమలుపఱచుటయం దత్యంత శ్రద్ధ వహించుచున్నామని

విన్నవించుచున్నాను.'

'జండాకు మీ రరుదెంచుట కదియే కారణమా?'

'ప్రభూ! కాదు. బ్రిటిష్‌రాయబారి కోరిక నెరవేర్చు టకు. ఆతని దేశస్థుడగు నొక యువకుడు - ఉన్నత వర్గమునకు చెందినవాడు - కనబడుట లేదట. రెండు నెలలనుండి యా తని నెయ్యూర కాతని విషయమే తెలియరాలేదట. ఆతడు కడసారి జండాలో కనబడినట్లు నమ్ముటకు తగిన యాధార మున్నది.'

ఫ్లేవియాకు మా సంభాషణయం దంత శ్రద్ధ లేకుం డెను. శాప్టువైపు నేను చూడ సాహసింపలేదు.

'ఆ యాధార మెట్టిది?'

'ప్యారిస్‌లోని యాతని స్నేహితు డొకడు - ఫెదర్లీ - యనునతడు మాకు తెలిపిన సమాచారమునుబట్టి, యాత డిచ్చటికివచ్చెనని తెలియుచున్నది. అంతేగాక రైల్వే యధికారులు సైతమేదో సామానుపై నుండిన యాతని పేరు నుగూడ తెలిపినారు.'

'ఆతని పేరేమి?'

'రాసిండల్. ఆత డొక స్త్రీని వెంబడించి యిచ్చటికి వచ్చియుండనోపు నని భావింపబడుచున్నది. ప్రభువులవారు 'మాబ'నను స్త్రీని గుఱించి వినియుందురు కాబోలు!'

'ఔను. విన్నాను.'

అప్రయత్నముగ నాదృష్టి యెదుట నున్న దుర్గమువైపు

ప్రిసరించెను.

'రాసిండల్ రురిటేనియాకు వచ్చినప్పుడే ఆమెయు వచ్చెను.'

ఆతని చూపును గమనించితిని. ఈ విషయమై నన్నాతడు ప్రశ్నించుచున్నటు లాతని ముఖ భంగిమమున విస్పష్టమయ్యెను.

నేను శాప్టును పిలిచి 'నే నాతనితో మాటాడవలసి యున్నది. రాకుమారితో ముందుకు సాగిపొమ్ము' అని చెప్పి రక్షకభటాధికారిని 'అయ్యా, నీ యభిప్రాయ మే?' మని ప్రశ్నించితిని. ఆత డింకను నాదాపునకు వచ్చి మెల్లగ 'ఆత డామెను ప్రేమించియున్నచో? రెండునెలలుగ నాతని పొలకు వయే తెలియుటేదు' అనెను. ఈసారి యాతని దృష్టి జండాదుర్గ ముపై ప్రసరించెను.

'ఔను. ఆమె యచ్చట నున్నది. కాని రాసిండల్ - పే రదియేగదా? - అచ్చట నున్నట్లు లేదు.'

'మైకేలు శత్రువు నొర్వడు. ఆతని కడ తేర్చెనేమో?'

'నీ వాతనిపై తీవ్రమగు నేరారోపణము కావించు చున్నావు.'

ఆతడు క్షమాపణపూర్వకముగ చేతు లొడ్డెను. నే నాతని చెవిలో 'ఇది చాల ప్రమాదకరమగు విషయము. నీవు స్ట్రెల్సాకు మరలిపొమ్ము' అంటిని.

'ప్రభూ! నా కిచ్చట నాచోకీ దొరకు నవకాశముండ?'

'నీ వేగుము. ఆచోకీ దొరకినదనియు, ఒకటి రెండు వారము లోపిక పట్టవలసినదనియు రాయబారితో చెప్పుము. ఇంతలో నే నీ విషయమును తెలిసికొందును.'

'ప్రభూ! రాయబారి యీ విషయమున చాల పట్టు దలతో ఒ పెట్టుచున్నాడు.'

'నీ వాతని నూరకుండునట్లు చేయవలయును. నీ యను మానమే నిజమగుచో నీ విషయమున కడు జాగ్రత్తగ మెలగ వలయును. నీలాపనిందలకు తావీయరాదు. ఈరాత్రికే నీవు స్ట్రెల్సాకు పోవలయును సుమా!'

నా యాజ్ఞను పాలింతునని యూతడు మాట యిచ్చెను. నేను కొంత స్థిమితపడి నా సహచరుల కలిసికొన నేగితిని.

ఫ్లేవియా 'మీ వ్యవహారము ముగిసెనా?' యని ప్రశ్నించెను.

'ఓ. తృప్తికరముగ. మనము చాలదూరము వచ్చి వచ్చితిమి. సైకేలుకు చేరిన ప్రదేశపు సరిహద్దుల సమీ పించితిమి. వెనుకకు మఱలుదమా!'

నిజమునకు మేమప్పు డూరి కడపటికి వచ్చియుంటిమి. అచ్చటినుండియే కోటయుండు కొండ యారంభమగును. బ్రహ్మాండమగు నా పురాతన దుర్గ కుడ్యముల కచ్చెఱువం దుచు మేము వానిని తిలకించుచుంటిమి. అప్పుడు కొండ నుండి దిగివచ్చుచుండు నొక చిన్న గుంపు మాకు కనుపించెను. ఆ గుంపు తరలివచ్చెను.

శాప్టు: మనము వెనుదిరిగి పోవుదము.
ప్లేవియా: ఇచ్చటనే కొంత సేపు నిలువ నభిలాషయున్నది.

నేను నా గుఱ్ఱము నామె గుఱ్ఱముప్రక్కనే నిలిపితిని. దాపునకు వచ్చుచుండు గుంపులోనివారిని మేమిప్పుడు విశద ముగ చూడగలిగితిమి. ముందు భాగమున నల్లని దుస్తులు ధరిం చిన యిరువురు భటులు అశ్వములనెక్కి వచ్చుచుండిరి. వీరి వెనుక నాలు గశ్వముల పూన్చిన శకట మొకటియుండెను. దానిపై నొక శవపేటిక యుండెను. దానివెనుక నొక యాశ్వి కుడు నల్లని సాదాదుస్తులను ధరించి టోపీని చేత బట్టుకొని వచ్చుచుండెను. మే మందఱ మచ్చటనే యుంటిమి. ప్లేవియా 'కొట్లాటలో చచ్చినవారిలో నొక్కడు కావలయు' ననెను.

నే నొక యశ్వరక్షకుని పిలిచి 'వారెవరో విచారింపు' మంటిని. ఆతడు శకటమువెనుక వచ్చుచుండు వ్యక్తి సమీ పమున కేగెను. శాప్టు మెల్లగ 'ఆతడు రూపర్టు' అనెను.

ఆతడు రూపర్టే. సాగిపోవుచున్న గుంపు నాపి యా తడు నాయొద్దకు వచ్చెను. ఆతని వైఖరి విచారసూచకమై యుండెను. ఆత డత్యంత గౌరవముగ నాకు నమస్కరించెను. ఇంతలో శాప్టు రివాల్వరున్న తన కోటుజేబులో చేతి నుంచు కొనగా మే మిరువురమును నవ్వుకొంటిమి.

'మే మెవరిని తీసికొని పోవుచున్నామో ప్రభువులవా రెఱుగగోరుచున్నారు కాబోలు. ఇతడు నా స్నేహితుడు రాబర్టు.'

'అయ్యో! ఈ దుస్సంఘటనకు నాకంటె దుఃఖించువా రుండరు.'

ఫ్లేవియా మృదువుగ 'పాపము' అనెను. రూపర్టు ఆమెవైపు కన్నులుఱుముట కాంచి నాకు కినుక వొడమెను.

'ప్రభువులవారి పలుకులు దయార్ద్రములు. నా స్నేహితుని మృతికి నేను విచారించుచున్నాను. అయినను ప్రభూ! అతని కిప్పుడు పట్టిన దుర్గతియే యితరులకును త్వరలో పట్టగలదు.'

'అవును. అందఱు నీవిషయమును జ్ఞప్తియం దుంచు కొనుట మంచిది.'

'ప్రభూ! రాజులైనను సరియే' యని శ్రీరంగసీతుల చెప్పు పద్ధతి ననెను.

'ఔను. ఆమాట సత్యము. మా సోదరు డెట్లున్నాడు?'

'అతనికి కొంత నయమే ప్రభూ'

'చాల సంతోషము'

'అతని యారోగ్యము కుదుటబడుటే తడవుగ స్ట్రెల్సా కేగగల ననుకొనుచున్నాడు.'

'అతని ఆరోగ్యము చాలవఱకు కుదిరెనన్నమాట.'

'ఒకటి రెండు చిన్న తొందరలుమాత్ర మున్నవి.'

ఫ్లేవియా:- ఆ తొందరలు త్వరలో తీరిపోగలవని నే నాశించుచున్నానని యాయనతో నుడువుము.

'తమ యభిమతానుసార మే.'

నే నాతనికి వీడ్కోలు సూచించితిని. రూపర్ట్ నాకు వందన మాచరించి తన హయమును త్రిప్పుచు తనవారిని ముందుకు సాగిపొండని యాజ్ఞాపించెను. నేను హఠాత్తుగ నతనిని వెంబడించితిని. అతడు భీతితో వెనుదిరిగెను. నే నేదైన యుపాయము చేయ నమకట్టితినేమోయని యాతడను మానించెను.

'మొన్నరేయి మొనగాడవై పోరాడితివే. ఇంకను నీవు యువకుడవు. నీ యధీనమున నున్న బందీని ప్రాణములతో నా కప్పగించితివా నీవు నిరపాయుడ వగుదువు.'

అతడు హేళనగ నవ్వుచు నా దాపునకు వచ్చి 'నే నొకప్పుడు మైకేలు తరఫున నీ కొక ప్రతిపాదన కావించియుంటి' ననెను.

'మైకేలునుండి ఎట్టివార్తయు నేను వినదలచుకొనలేను.'

'ఐన నానుండియే వినుము. ధైర్యముగ కోటపై బడుము. శాప్టున్ను టార్లహేమున్ను నాయకులై ముందు నడతురు గాక.'

'ఊ. తరువాత'

'శాప్ట్, ఫ్రిట్జ్, నల్లమైకేలు ముగ్గురును చచ్చెదరు.'

'ఏమీ?'

'అవును. నల్లమైకేలు చచ్చును. నీవు 'బందీ' యని పేర్కొనుచుండు వ్యక్తి 'గొట్టము'గుండా స్వర్గమున కేగును. ఇద్దరు వ్యక్తులము మిగిలియుందుము; ఒకడు నేను - రూపర్ట్

హెంజూ, రెండవవాడవు నీవు - రురిశేనియూరాజు ఆతడు కొంత యాగి మరల గద్గద స్వరమున 'ఈ ప్రతిపాదన తీసి వేయదగినది కాదు. చూడుము. సింహాసనము - రాజకుమారి; నాకో - ప్రభువుగారి కృతజ్ఞత'యనెను.

'నీవు జీవించియుండుచో నరకాధిపత్య మెవరు చేయుదురు?'

ఆతని సాహసమునకు నాకు నవ్వువచ్చెను. అయి నను 'నీ య జ మా ని పై న నే తిరుగబడుదువా?' యని ప్రశ్నించితిని.

'ఆతడు నాదారి కడ్డుపడును. ఈర్ష్యాళువగు పశువు'

నేను చల్లగా 'ఒక స్త్రీ యున్నదటనే?' యంటిని.

'ఆ. అందగత్తెకూడా. నీవామెను చూచియే యున్నావు.'

'అవును. ఒక విచిత్రమైన తేనీటి 'విందు'సందర్భమున. అప్పుడు నీ స్నేహితులు కొందఱు బల్లయొక్క విశేషోప యోగమును చూచిరి.'

'డిగబెక్ డిచర్డులవంటి అప్రయోజకులచేత నేమగును? అప్పుడు నే నుండవలసినది.'

'పోనిమ్ము. మైకేలనిననే ఆమె కిష్టముకదా?'

'ఔను మూర్ఖురాలి నేమి చేయవచ్చును? సరికాని నా సలహానుగూర్చి యాలోచింపు' మనుచు నమస్కరించి గుఱ్ఱము నడాయించి తనవారిని కలిసికొనెను.

నే నాతని విచిత్రతత్వమునుగూర్చి యాలోచించుచు

నా వారిని కలిసికొంటిని. దుర్మార్గుల నెందఱినో నే నెఱుగు దును. కాని నా యనుభవమున నితని బోలినవా డితడే.

మేము మా గమ్యస్థానము చేరునంతలో నొక భటు డొక లేఖను తెచ్చియిచ్చెను. దానిపై విలాసము వ్రాసి యుండలేదు. నేను దానిని చించి చదివితిని. అందిట్లున్నది.

'జొహార్ ద్వారా ఈ లేఖను పంపుచున్నాను. నే నొకసారి నిన్ను హెచ్చరించియుంటిని. నీవు పురుషుడవే ౖౖెన నన్ను హంతకుల గుహనుండి తప్పింపుము - ఆ. మా.'

నే నా చీటీని శాప్టున కిచ్చితిని. అతడు 'తానచ్చట చేరుట ఎవరి తప్పిదమో!' యని మాత్ర మనెను. ఐనను నాకు మాబనునెడ దాక్షిణ్యము కలిగెను.

## 16

మాబను ప్రార్థనమున నా హృదయము ద్రవించెను. కాని యేమిచేయుటకు సాధ్యముకాని స్థితిలో నుంటిని. మైకే లారోగ్యముగ నున్నను నన్ను దర్శింపరాలేదు. ఏచర్యకు గడంగక కాలము గడపుచుండెను. నేను చాలకాలమునుండి పట్టణమున లేనందున స్ట్రెల్సాలో నలజడిగ నుండెను. మంత్రి కిని సైన్యాధ్యక్షునకును నచ్చటి పరిస్థితుల నదుపులోనుంచుట కష్టముగ నుండెను. ఈ క్లిష్టస్థితి నధిగమించుట కొక్కటే మార్గముండెను. వివాహ నిశ్చితార్థకార్యమును యథావిధిగ

జరిపించుటయే యా మార్గము. ఈ కార్యమునకు వివాహము నకున్నంత ప్రాధాన్యతే యున్నది. ఇది జరిగిన రురిటేనియ నుల విశ్వాసము చూఱగొనవచ్చును. కావున శ్లేవియా యెదుటనే శుభముహూర్త నిర్ణయము కావించితిని. నాటికి పదునైదు దినముల తరువాత నొక శుభదినమును నిశ్చయించి నాడా యుత్సవము స్ట్రెల్సాలోని దేవాలయమున జరుగ గలదని ప్రకటింప జేసితిని. అంతటితో రురిటేనియా రాజ్య మంతయు సంతోష సాగరమున మునిగెను. ఇరువురము మాత్రమే యాందోళనా పరవశులమైతిమని నా భావము; ఒక్కడు-సల్లమైకేలు; మరొక్కడను-నేను. ఇక నీవిషయమే తెలియనివాడు - రురిటేనియా రాజు.

మూడు దినముల తరువాత జండా దుర్గమునుండి-ధనా శకులోనై - జోహాన్ టార్లహీం మందిరమునకు వచ్చెను. అతనివలన ననేక విషయములు తెలిసెను. ఆత డిట్లు చెప్పెను. 'రాజుగారు చాల నీరసముగ నున్నారు. కావున భయపడి స్ట్రెల్సానుండి వైద్యుని రప్పించిరి. ఆతడు వచ్చి రాజుగారిని చూచి విభ్రాంతుడై యేమిచేయుటకును సాధ్యము కాదని చెప్పెను. ఆతని నచ్చటనే బంధించియున్నారు.' నే నిచ్చిన పైకమును తీసికొని జోహాన్ మాయొద్దనే యుండునని చెప్పెను. కాని యాతనివలన జరుగవలసిన పను లనేక ముండుటవల్ల నాతని జండాదుర్గమునకే పొమ్మని చెప్పితిని. ఇంకను నెక్కుడుగ డబ్బిత్తునని యాశగొల్పితిని.

'మాబనుతో నా మెకొలిజ కెంతో పనిచేయుచున్నానని తెలుపుము. రాజుగారిని కలిసికొని యొక్క మాట - ఒక్క యోదార్పుమాట - చెప్పుమనుము' అని చెప్పితిని. రాజు నిరాశచే చచ్చుచున్నాడేమో యని నా భయము.

'ఆరుగురిలో నిద్దరు చచ్చిరిగదా! రాజు నెట్లు కావలా కాయుచున్నారు?' అని జోహాను నడిగితిని. 'డిచర్డ్ - బెర్నొనిక్ రాత్రిపూట, రూపర్ట్, డీగెటెట్ పగటిపూట కావలియుందురు.' అని యాతడనెను.

'తడవ కిద్దరేనా?'

'ఔను, మిగిలినవారు రీలవేసిన వినబడునంత దూరమున నున్న గదిలో విశ్రమించుచుందురు.'

'వారు విశ్రమించు గదికిని రాజుండు గదికి నైదైన మార్గమున్నదా?'

'లేదు. ఆ గదినుండి కొన్ని మెట్టికెలు దిగిపోయి తరువాత ఈడ్పువంతెన ద్వారముగుండ వెడలి రాజుగారి గది చేరవలెను.'

'ఆ వాకిలికి బీగము వేసియుందురా?'

'కావలాకాయు నలువురియొద్దను తాళము చెవు లున్నవి.' నేనాతని నింకను సమీపించి 'డ్యూకునివాస మెక్కడ?' యంటిని.

'క్రొత్తకోటలో క్రింది యంతస్తున - ఈడ్పువంతెనకు పోవు మార్గమునకు కుడివైపున.'

'మాబను ఎచ్చటనున్నది?'

'అతని కెదురుగా నెడమ భాగమున. కాని యామె నివసించు గది బయటివైపు తాళము వేసియుండును.'

'ఎందుకు?'

'బహుశః ఒకానొక రాత్రి రూపర్ట్ ఆమె నెత్తుకొని పోవచ్చునని డ్యూకు భీతిల్లియుండును'

'ఓహో! అట్లైన డ్యూకువద్ద బీగముచెవి యుండును.'

'అవును. ఈద్వారం తెనను రాత్రులయందు వెనుక కేక్చియుందురు దాని తాళముచెవికూడ డ్యూకు వద్ద నే యుండును. ఆతని యాజ్ఞలేని దే దాని నెవ్వరు నుపయోగింప వీలులేదు.'

'నీ చ్చట వరుండుదువు?'

'క్రొత్తదుర్గములో హాలును ప్రవేశించు చోట. ఐదు గురు సేవకులతో సహా'

'సాయుధులా?'

'ఈటెలుండును. కాని మందు గుండు సామగ్రి లుండవు. అట్టి ఆయుధములను వారి వశమున నుంచుటకు డ్యూకుకు నమ్మకము చాలదు.'

కడపటికి నేనే స్వయముగ నీ విషయమున నేదో యొకటి చేయ నిశ్చయించితిని. ఒకసారి గొట్టముకడ నేను విఫల ప్రయత్నుడనైతిని. కావున నీసారి మరియొకవైపు నుండి ప్రయత్నింప నిశ్చయించితిని.

ఆతనితో నిట్లంటిని. 'నేను నీకు ఇరవై వేల క్రౌనుల నిత్తునని మాట నిచ్చియున్నాను. కాని రేపు రేయి నేను చెప్పినట్లు నీవు చేయగలిగినచో నీ కేబది వేల క్రౌనుల నిత్తును. కాని యా సేవకులకు మీ ఖైదీ ఎవ్వరో తెలియునా?'

'లేదు. ఆత డెవ్వరో డ్యూకుశతృవు కానోపునని వారి నమ్మిక.'

'అయిన నన్ను వారు రాజని యనుమానింపరు గదా?'

'అది ఎట్లు సాధ్యము?'

'అయిన వినుము. రేపు తెల్లవారుజామున రెండు గంటలకు సరిగా నూతనదుర్గ సింహద్వారమును తెఱచియుంచుము. ఒక్క క్షణమైన నాలసింపకుము.'

'మీ రచ్చటికి వత్తురా?'

'నన్నేమియు ప్రశ్నింపకుము. నేను చెప్పినట్లు చేయుము. గాలి లేదనియో - మరేమో - సాకుచెప్పి యా పని చేయుము. ఇంతకంటె నిన్నేమియు కోరను.'

'వాకిలి తెఱువగనే నేను తప్పించుకొని పారిపోవచ్చునా?'

'ఆ. నీకు సాధ్యమైనంత త్వరగా నాపని చేయుము. ఇంకొక్క మాట. ఈ చీటీని మాబనునకిచ్చి యిందులో చెప్పబడినట్లు తప్పక నడచుకొనుమనుము.'

జొహాన్ శరీర మాద్యంతము వణకుచుండెను. ఆతని నిజాయితీని సాహసమును నాధారముగాగొని నే నాతని నమ్మవలసియుండెను. రాజు చనిపోవునేమో యను భయమున నే

నాలసింప జంకితిని.

ఆతడు వెడలిపోయెను. శాస్త్రను ఫ్రిట్జును పిలిచి నా పథకమును వివరించితిని. శాస్ట్ తలయూచుచు 'కొంచె మాలసింపలేవా?' యనెను.

'రాజు చనిపోవచ్చును.'

'మైకే లంతకుముందే యేదో యొక కార్యమునకు పూనుకొనవలసి యుండును.'

'అట్లైన రాజు బ్రతుకవచ్చును.'

'రాజు బ్రతికిన -'

'ఒక పక్షమురోజులు!'

వివాహవిషయము నా మనస్సున మెఱసెను.

శాస్ట్ ఆలోచించుచుండెను. ఇంతలో ఫ్రిట్జ్ నా భుజముపై చేయివేసి 'మనము వెడల ప్రయత్నింత' మనెను.

'మీరు పోవలెనని నా యభిప్రాయము. భయపడకుడు.'

'ఓహో! అయిన నీ విచ్చట రాకుమారిని కనిపెట్టి యుండుము.'

అతని కన్నులు మెఱసిపోయెను. అతడు మరల నిట్లనెను.

'ఎట్లైనను మైకేలు మనకు పట్టుపడవలెను. ఒకవేళ నీవే పోయి రాజుతోగూడ నీవును మృతుడవైన మిగిలిన మాగతియేమి?'

'మీరు ఫ్లేవియారాణిని సేవించుచుందురు. ఇక నేను వేఱొకని లాభముకొఱకై యాతనివలె నటించుచుంటిని.

కాని స్వార్థమున నట్లు చేయుజాలను. వివాహ నిశ్చితార్థము నాటికి ముందుగనే రాజు సజీవుడై సింహాసనాధిష్ఠితుడై యుండనిచో - ఫలిత మెట్టిదైనను సరియే - నేను నిజమును వెలడింతును.'

నా పథక మిట్లుండెను. బలమైన దళ మొకటి శాప్ట్ నాయకత్వమున నూతన దుర్గద్వారమునొద్దకు రహస్యముగ నేగవలయును. ఎవరైన వారి నెదిర్చిన కత్తులతో వారి నంత మొందింపవలెను. తుపాకుల మోత కూడదు. సవ్యముగ నంతయు జరిగిన జోహాన్ ద్వారమును తెఱచు వేళకు వారచ్చటికి చేరియుందురు. వెంటనే వారు లోనికి త్రోసి కొనిపోయి యచ్చటి సేవకుల బంధింపవలెను. ఆ సమయమునకు సరిగ మాబను తన గదిలోనుండి 'మైకేల్, సాయము, సాయము - రూపర్ట్ హెంజూ' యని కేకలిడును. అట్లు చేయవలసినదిగ నే నామెకు నా చీటీలో తెలిపి యుంటిని. అప్పుడు మే మనుకొన్నట్లు మైకేలు ఉగ్రుడై యెదుటనుండు తన గదినుండి యీవలకు వచ్చి సజీవుడుగ శాప్ట్‌హస్తగతుడగును. మాబ నింకను అఱచుచునే యుండును. ఇంతలో మావారు పోయి వంతెనను కందకముపై నిడ్తురు. తన పేరు వినబడగనే రూపర్ట్ తానున్న పాత దుర్గమునుండి వచ్చి వంతెనను దాట జూచును. డిగ్‌బెట్ కూడ నాతని వెంబడింపవచ్చును; లేనిచో లేదు. అది యప్పటి పరిస్థితినిబట్టి యుండగలదు.

వంతెనను దాటుటకు హాకేర్ ప్రయత్నించినప్పుడే నా పని మొదలగును. నేను వంతెనక్రింద నొక చిన్న నిచ్చెన సహాయమున దాగుకొనియుండి రూపర్ట్ గాని డిగబెట్ గాని క్షేమముగ దానిని దాటకుండ జూతును. వారి రివువురును చచ్చిన నిక మిగిలినవా రిద్దరే యుందురు. మేము కల్గించిన యీ యలజడివలనను, హఠాత్తుగ పై బడుటవలనను వారి పని చక్కజేసి ముఖ్యమగు గదులకు పోవు తలుపు బీగముచెవిని చేజిక్కించుకొనవలెను. బహుశః ఇంతలో వారు త్రోసికొని పోవుటకో లేదా యుత్తర్వుమేరకు నడచుకొనుటకో యత్నింపవచ్చును. అట్టిచో మేము వాకిలిని తెఱచుకొని లోనికి నెంత త్వరలో ప్రవేశింపగలమను విషయముపై రాజుగారి ప్రాణమాధారపడియుండగలదు. దేవునిదయతో రూపర్టు కాక డిచర్డు కాపలాయుండిన మేలగును. ఎందులకన సాహసపరుడే యైనను అతనికి రూపర్టునకున్న గడుసుదనము నిర్లక్ష్య స్వభావము లేదు.

ఎంతో తెగువతో నే నీ పథకమును వేసితిని. శత్రువును మభ్యపెట్టదలచి రేయంతయు మా నివాసమును దీపకాంతులతో జాజ్వల్యమాన మొనరించి, మే మేదో యుత్సవమున మునిగియున్నట్లు చూపఱకు కనబడునట్లు జనులు హడావిడిగ తిరుగుచు నాటపాటలతో నుల్లాసముగ కడుపున ట్లాజ్ఞాపించితిని.

స్ట్రెకెంచ్ అచ్చటినుండి - సాధ్యమైన - మా ప్రయాణ

మునుగూర్చి ఫ్లేవియాకు తెలియకుండునట్లు ప్రయత్నింప వలెను. మే ముదయములోపల మరలి రానిచో బహిరంగ ముగ నతడు దుర్గమునకు తన బలముతో పోయి రాజును చూపుమని మైకేలు నడుగవలయును. మైకే లచ్చట లేనిచో నాతడు లేనట్లే తలచి ఫ్లేవియాతోగూడ రాజధానిని చేరి, అచ్చట నల్లమైకేలు ద్రోహమునుగూర్చియు, రాజుగారిని హత్య కావించియుండవచ్చు నను విషయమును ప్రకటించి, రాజభక్తికల నిజాయితీపరుల నందఱను ఫ్లేవియా కనుకూల ముగ కూడగట్టుకొన వలయును. బహుశః ఇట్లే జరుగ నున్నదని నే నూహించితిని. ఎందులకన రాజుకాని, మైకేలు గాని, నేనుగాని, ఒక్క దినమునకంటె నెక్కుడు కాలము బ్రతికియుండుట జరుగునా యని నా సంశయము. ఒకవేళ రాజును చంపిన తరువాత నల్లమైకేలును - రూపర్టుచు చేతులార చంపిన తరువాత వేషధారినైన నేనును - చచ్చుటే సంభవించిన, ఫ్లేవియాయే రురిటేనియా రాణి కాగలదు. నా విషయమా! నేను గణింపలేదు.

## 17

నిర్మల నిశీధిని మనోహరముగ నుండెను. ప్రకృతి ప్రశాంతముగ నుండెను. వెనుకటిసారి నేను కందకమున ప్రవేశించినప్పు డుండిన కల్లోల వాతావరణమే నేడు నుండవల

యునని నే నర్థించితిని. కాని యదృష్టము వ్యతిరేకముగ నుండెను. అయినను గోడ నంటికొని నీడలో నీదుచుపోయిన నా కారాగారంగమునకు పైభాగముననున్న కిటికీలగుండా చూచి నను నే నెవరి కంటను బడక తప్పించుకొనగల ననుకొంటిని. వారు కందకమును వెతకిన నా పథకము భగ్నమగుట తథ్యము వారట్లు చేయరనియే తలచితిని. పైభాగమైన కాని క్రిందిభాగమునకాని గొట్టము కదలక మెదలక యుండు నట్లు జొహానే భద్రముగ నమర్చియుండెను. కావున దానిని తీసివేయుట అల్ప ప్రయత్నసాధ్యముకాదు. గొప్ప ప్రేలుడు సాధనముల నుపయోగించుటవల్లగాని, లేక గునపములవంటి సాధనముల నుపయోగించుటవల్లగాని దానిని తొలగింప ప్రయత్నింప వలసియుండెను. కావున కేవలము మానవ మాత్రుడు కందకమున నెట్టి యుపాయము కావింపగలడు? మైకేలు తనకు తానే యీ ప్రశ్న వైచికొని 'ఇది యెవ్వరికిని సాధ్యముకాద'ని నమ్మకముగ నమాధానపడియుండును. ఒకవేళ గొట్టము నమర్చుటలో జొహా నేదైన మోసబుద్ధితో వర్తించియుండినను నా యీ పథకము నాతఁ డెఱుగడు. కావున ననుమానించుట కాస్పదము లేదు. నూతనదుర్గము పై దాడిసలిపెడి దళాధిపతిగ నే నచ్చటికి వచ్చియుందుననియే యాతఁడు తలంపగలడు. కావున 'నిజమగు నపాయ మచ్చటనే'యని నేను శాస్త్రుతో నంటిని. అంతేగాక 'నీ వచ్చట నుందువు. అది నీకు తృప్తికరమే కదా?' యని యడిగితిని.

అతడు తృప్తినొందలేదు. నేను నిరాకరింపని పక్ష మున నన్ననుసరించి వచ్చుటకే యాతడు సంతోషముగ సమ్మతించి యుండును. ఒక్కరే పోయిన వారి దృష్టినుండి తప్పించుకొన వచ్చును. ఇద్దరైనచో అపాయము నాలు గింతలు. నా జీవిత మమూల్యము గావున నన్ననుసరించి తాను వత్తునని శాప్ మరల సూచించెను. ఆతని యాంత ర్యము నే నెఱుగుదును. 'ఈ రాత్రి రాజు బ్రతికిన నేతప్ప నేనును బ్రతుక'నని నిష్కర్షగా చెప్పితిని.

రాత్రి పండ్రెండు గంటలకు శాప్ తన దళముతో టార్లక్ హీం భవనమును వదలి జండాపట్టణము కుడిభాగమున జనసమ్మర్దములేని వీధులగుండా నూతన దుర్గమునకు బయలు దేఱెను. అంతయు నిరంతరాయముగ జరిగిన, రెండు గంట లకు పావుగంట ముందుగ వారు నూతన దుర్గ మహాద్వారము కడ నుందురు. దుర్గమున కరమైలు దూరములో వారు తమ గుఱ్ఱముల వదలి కోట తలవాకిలియొద్దకు రహస్యముగ నేగి దానిని తెఱచు వేళ కట సిద్ధముగ వేచియుందురు. రెండు గంటల వేళకు వాకిలి తీయకున్న ఫ్రిట్జ్ కోట యావలివైపు నకు రావలసియుండును. నేను ప్రాణములతో నున్నచో నాతని కలిసికొని దుర్గముపై దాడి సలుపవలయునో కూడదో సంప్రతింతును. నే నచ్చట లేనిచో వారు సత్వరమే జండా కేగి మార్షలును లేపి సైన్యముతో కోటను ముట్టడింప రా వలెను. ఎందులకన నే నచ్చట లేకున్నచో నేను చచ్చి

యుండవలెను. నా మరణానంతర మైను నిమిషములైనను రాజు బ్రతికియుండడని నే నెఱుగుదును.

శాప్టును, ఆతని స్నేహితులను వదలి, యారాత్రి నా ప్రయత్నము లెట్లు కొనసాగినవో వివరింతును. పట్టాభిషేకమునాడు వేట విడిదినుండి రాజధానీనగరమునకు నే నెక్కిపోయిన త్వరితగతిగల తురగము నెక్కి బయలుదేఱితిని. జీనులోని యొఱలో నొక పిస్తోలును భద్రపఱచితిని. ఖడ్గమును గైకొంటిని. మేనినిండుగా ముసుగును, లోపల నున్ని దుస్తులను నిక్కరును, కాన్వాసుతో చేయబడిన పాదరక్షలను ధరించితిని. దేహమంతయు తైలమర్దనము కావించుకొని, ఒక్కసీసా విస్కీని, సన్నపాటి గట్టి త్రాడు నొకదానిని, ఒక నిచ్చెనను తీసికొని, శాప్ట బయలుదేఱిన తరువాత పట్టణము వామభాగమున వెడలి సుమారు పండ్రెండున్నర గంటలగునప్పటికి జండా యడవియంచులకు చేరుకొంటిని. అచ్చట నొక చెట్టునకు నా గుఱ్ఱమును కట్టివైచి నిచ్చెనతో కందకము గట్టు చేరితిని. పిస్తోలుతో పని లేనందువల్ల దానిని వెంట తీసికొని పోలేదు. నడుమునకు కట్టుకొనియుంచిన త్రాటిని విప్పి గట్టుపైని చెట్టున కొక కొనను కట్టివేసి దాని సాయమున కందకములోనికి దిగితిని. కోటలోని గడియారము పండ్రెండు ముప్పాతిక కొట్టెను. నిచ్చెనను ముందునకు త్రోసికొనుచు గోడ నొఱసికొని నీటిలో నీదుచు సాగిపోయితిని. ఆ విధముగా మంటిగోట్టమున్న ప్రదేశము చేరి దుర్గపు పునాదుల

యంచుపై గొట్టము నీడలో దాగుకొంటిని. అప్పటిలో నాకు రాజు విషయమైన యాందోళనకాని, ఫ్లేవియా మీఁది వ్యామోహముకాని యుండలేదు. పగ వీల్వవలయుననెడి కాంక్షమాత్రము విపరీతముగ నుండెను. ఈ కోరికను తీర్చుకొనలేక పోయితిని.

ఈడ్పువంతెన యథాస్థానమున నుండెను. అది నా కుడిభాగమున పది గజముల దూరమున నుండెను. రాజుండు గది గోడకు నా వీపు నానించి యొదిగియుంటిని. నా కెదురుగ సుమారు రెండు గజముల యెత్తున నొక కిటికీ యుండుట గమనించితిని. జోహాన్ చెప్పినప్రకార మది డ్యూకుగదికి సంబంధించినదై యుండవలెను. దాని కెదురుగ మాబను కిటికి యుండవలెను. స్త్రీలుపేక్షాపరులు. జ్ఞాపకశక్తి లేనివారు. రెండు గంటలకు సరిగ నామె 'రూపర్టునుండి కాపాడు'మని యఱచుట మఱువకుండుగాక యని నేను దేవుని ప్రార్థించితిని. ఈ నాటకమున రూపర్టువకే నొసగిన పాత్రను తలచి నవ్వుకొంటిని. టార్లన్హీం భవనమున నా స్నేహితు లందఱి యెదుట నాతఁడు నన్ను పొడిచియుండెను. ఆ బాగ మిప్పటికి బాధించుచుండెను. నే నా పగ సాధింపవలసి యుండెను.

ఉన్నదున్నట్లు డ్యూకుగది ప్రకాశమాన మయ్యెను. కిటికీతలుపులు వేయబడియుండలేదు. మునివ్రేళ్లమీఁద నిలువబడి చూడగా నా మందిరాంతర్భాగము కొంత దృగ్గోచర

మయ్యెను. గదిలో సుమా రొక గజమువఱకు నాకగపడు చుండెను. కాని గదిలోని వెలుతురు మాత్రము నాపై బడ లేదు. కిటికీనుండి ఎవరో తొంగిచూచిరి. అది మాబను యొక్క లావణ్య విగ్రహము. ఆమె ముఖము నీడలో నున్నను దాని ఛాయ కనుపించుచుండెను. నేను మెల్లగ 'జ్ఞాపక ముంచుకొను'మని యఱవ నెంచితిని. కాని సాహ సింపనైతిని. ఒక నిమునము తరువాత పురుషు డొకడు వచ్చి యామె ప్రక్కన నిలుచుండెను. ఆత డామె నడుము చుట్టును చేయివేయ ప్రయత్నించెను. కడువడిగ నామె వైదొలగి కిటికీ తలుపుల కానుకొని నిలుచుండెను. ఆమె ముఖ మొక పార్శ్వము నా కగుపించుచుండెను. ఆగంతుకు డెవరో నేను కనుగొంటిని. ఆతడు రూపర్ట్. చిన్నగ వినబడిన యాతని నవ్వువలన నా యభిప్రాయము స్థిరపఱచుకొంటిని. నేను మెల్లగ 'నిదానించుము, నిదానించుము. నీవు చాల ముందుగనే వచ్చితివి నాయనా'యని గొణుగుకొంటిని.

ఆతని శిర మామె శిరమునకు దగ్గఱగ నుండెను. ఆమె చెవిలో నేమియో చెప్పిన ట్లూహించితిని. ఆమె యగడ్తవైపు చూపుచు 'నేనీ కిటికీగుండ బయటికి దుము కుదు'ననుట స్పష్టముగ నాకు వినిపించెను. ఆతడు కిటికీ యొద్దకు వచ్చి తొంగిచూచి 'చలిగా నున్నది. రమ్ము. నీ యుద్దేశ్య మెంతవఱకు నిజమో చూతే'మనెను. నేను విన్నం తలో ఆమె ఏమియు జవాబు చెప్పినట్లులేదు. ఆతడు తన

పిడికిలితో కిటికీ చట్టమును గుద్దుచు 'మైకేలు భంగపడుగాక! ఆతనికి రాకుమారి చాలదా? ఆతనిలో నీవు కాంచుచుండు ప్రత్యేకత యేమి?' యని కించిత్కోపమున చిలిపిగ ప్రశ్నించెను. ఆమె 'నీ వనుచున్నదంతయు నే నాతనితో చెప్పిన?' అనెను.

'మంచిది. చెప్పుము. దాని నతడు లెక్కగొనడు. అతనికి రాకుమారియెడ వెర్రి ముదిరినది. వేషధారి గొంతు కోయుమనుట తప్ప నాత డన్యవిషయము మాట్లాడడు. నేనావని చేసిపెట్టిన నా కేమి ప్రతిఫలము ముట్టజెప్పాదున న్నాడో తెలియునా?'

ప్రార్థనాపూర్వకముగనో నిస్పృహతోనో దుఃఖభాగిని యగు నా వనిత తన హస్తద్వయమును పైకెత్తెను. ఆ సమయమున తుపాకి నాయొద్దనుండిన రూపర్టును కాల్ప బుద్ధి వొడమెడిది.

ఈ సమయమునకు సరిగ గదివాకిలి తెఱచిన యలుకు డయ్యెను. వెంటనే కఠోరస్వరమున 'అయ్యా! ఇచ్చట నేమి చేయుచున్నావు?' అనుట వినబడెను.

రూపర్ట్ కిటికీకి వెన్నుచేసి వంగి నమస్కరించి బిగ్గఱగ 'మీరు రానందున కామెకు క్షమాపణ చెప్పికొనుచున్నాను. ఆమె నొంటరిగ నెట్లుంచగలను?' అనెను.

క్రొత్తగా వచ్చినవాడు మైకేలై యుండవలెను. ఆతడు కిటికీవైపు రాగా బాగుగ కనుపించెను. ఆతడు రూపర్ట్

రెట్టపట్టుకొని 'రాజుకేగాక కందకమున చాలమందికి చో టున్న'దని సార్థకాభినయముతో పలికెను.

'ప్రభువుగారు నన్ను బెదరింప జూతురా?'

'ఆమాత్రపు హెచ్చరికసైతము చాలమందికి నానుండి లభ్యము కాదు.'

'రాసిండల్ కిట్టి బెదరింపు లెన్నో. అత డింకను సజీవుడే.'

'నా సేవకులు పొరబాట్లు చేయుట నా తప్పిదమా?' యని మైకేలు హేళనగా పలికెను.

'ప్రభువులవారు మా     మెట్టి పొరబాటును చేయ సాహసింప లేదు.'

మైకేలు అపాయమునకు జంకుచుండెనని విస్పష్టముగ నాతడు చెప్పుచుండెను. మైకేలున కాత్మనిగ్రహ మెక్కువ. అతడు బొమలు ముడివైచె ననుకొందును. వారి ముఖము లింకను బాగుగ చూచుట కవకాశము లభింపనందులకు వగచి తిని. అయినను అతని స్వరము నెమ్మదిగను ఉద్రేక రహిత ముగను ఉండెను.

మై: 'చాలు, చాలు. మనము వాదులాడరాదు. డిచర్డు, బెర్సొనిక్ తమ తమ స్థానములలో నున్నారా?'

'ఆ. ఉన్నారు.'

'నీతో నిక పనిలేదు.'

'నాకేమియు నాయాసము లేదు.'

'మంచిది. నన్ను వదలి వెళ్లుము. పది నిముసములలో వంతెన తీసివేయబడును. ఈదుకొనిపోయి పరుంచుట నీ కిష్టము లేదనియే తలంతును.' ఈమాటల నతడు చిరాకుగ ననెను.

రూపర్ట్ కనుమఱుగయ్యెను. వాకిలి తెఱచుటయు మూయుటయుకూడ వింటిని. డ్యూకు కిటికీని మూయుటచే నాకు నిరాశ కలిగెను.

ఒకటి రెండు నిముసము లాతడు మాబనుతో మాటా డుచు నిలుచుండెను. ఆమె కిటికీని వదలి చనెను. మైకేలు వాకిలి వేసికొనిపోవు చప్పుడు వినవచ్చెను.

వంతెననుండి 'డిగ్‌సెట్, డిగ్‌సెట్, రమ్ము. పరుండు టకు ముందు నీట మునుగుట కిష్టపడినతప్ప త్వరగా రమ్ము.' అను మాటలు వినవచ్చెను.

అది రూపర్ట్‌ధ్వని. ఒక్కక్షణము తరువాత డిగ్‌సెట్ రూపర్ట్ యిద్దఱును వంతెన దాటిపోయిరి. వంతెన వెనుక కీడ్వఁబడెను. అంతయు నిశ్శబ్దము. గడియారము ఒకటింకాలు కొట్టెను. నేను ఒళ్లు విఱుచుకొని యావులించితిని.

పది నిముసముల తరువాత నా కుడివైపున నించుక సవ్వడి వినవచ్చెను. వంతెనద్వారముకడ చీకటిలో నొక వ్యక్తి నిలిచియుండెను. నైఖరిని బట్టి మరల నాతడు రూపర్టే యని గ్రహింపగల్గితిని. ఆతడు చేత నొక కరవాల ముంచు కొని ఒకటి రెండు నిమిషములట కదలక మెదలక నిలుచుండెను.

నా కెన్నియో విచిత్రపు టాలోచనలు కలిగెను. ఈ పిశాచము మఱల నెట్టి దుర్గ యుగునకు గడంగనుండెనో! ఆతడు తనలో మెల్లగ నవ్వుకొనెను. తరువాత ముఖమును గోడ వైపునకు త్రిప్పి దిగుట కారంభించెను. గోడలో మెట్లికె లున్నట్లు తెలిసెను. అవి పదునెనిమిది యంగుళముల కొక్కటి చొప్పున నుండెను. ఆతడు నింపాదిగ దిగివచ్చి కడపటి మెట్టికయొద్ద వెనుదిరిగి నిశ్శబ్దముగ నీట బ్రవేశించెను. నాజీవిత మొక్కటే మైయున్న వెంటనే నే నాతని నక్కడనే ధీకొని యేదో యొక్కటి తేల్చివేసియుందును. మా కడ్డువచ్చువా రెవ్వరు నుండలేదు. కాని రాజొక్క డుండెను కదా! కావున నెట్లో నా కోరిక నణచుకొంటిని. కుతూహలమున నాత డేమి చేయనుండెనో గమనించుచుంటిని.

ఆతడు నెమ్మదిగా నీది వచ్చి నేనున్న గోడలో వంతెనకు దిగువనుండిన మెట్లెక్కి పోయెను. వెనుక కీవ్వబడిన వంతెన యంచున నిలిచి జేబును తడమికొని ఏదియో బయటికి దీసి వాకిలి తెఱచినట్లుండెను. మూసినచప్పుడు వినరాలేదు. ఆతడు నా చూపుమేరను దాటిపోయెను.

నేను నిచ్చెనను వదలి - మెట్లున్నందున నవసరము లేదని - రూపట్టు దిగివచ్చిన మెట్టికెల వైపున కీది పోయి సగము మెట్లెక్కితిని. అచ్చట నిలిచి చేత కరవాల ముంచుకొని ఆతురతతో వినుచుంటిని. నా కెదురుగ కందకము ఆవలి వైపుననున్న ద్వారకు గది చీకటిగ నుండెను. వంతెన కావలి

వైపున కిటికీలోమాత్రము దీపముండెను. నేను దీనిని
మఱతేను. కోట గోపురమునందలి గడియారము ఒకటిన్నర
గంట కొట్టెను. రూపర్టు నాబనుతో లేచిపోవ యత్నించుచో
ద్వారకెట్టి నిరోధకోపాయమును తలపెట్టియుండెనో [illegible]
నాకు చెప్పియుండెను. ఆవిషయము నా కిప్పుడు జ్ఞాపకము
నకు వచ్చెను. నా పథకమేగాక నాటిరాత్రి మరికొన్ని పథ
కములు సైతము జరుగనుండినవి.

## 18

నే నొకటి రెండు నిమిషములు తీవ్రముగ నాలోచించి
తిని. రూపర్టు యుద్దేశ్య మేమైయున్నను, నాత డెట్టి క్రౌర్య
మునకు పూనుకొనియున్నను నొక్క విషయమున మాత్ర
మిప్పు డాతనికంటె నా దే పైచేయిగా నుండెను. రాజున్న
గదివైపునగాక నాతడు కందకమున కావలివైపున నుండెను.
కావున నిక ముగ్గురిని మాత్రమే నే నెదుర్కొనవలసియుం
డెను. ఇరువురు కావలివారిని - డిశ్చెటును. నాదగ్గఱ
తాళముచెవి యుండిన, ఎట్టి ప్రమాదమునకైన నింకక వారి
స్నేహితులు వచ్చులోపలనే [illegible] డిచర్డుపై పడియుం
దును. కాని నే నిప్పు డసహాయుడనై యుంటిని. నా
స్నేహితులు వచ్చువఱకు నే నాగవలసి యుండెను. సుమా
రైదు నిమిషములు కాచుకొంటిని. అంతయే నా కర్ణగంట

యనిపించెను. అంతలో మా నాటకమున మఱుసటి యంక మారంభమయ్యెను.

అంతయు నిశ్శబ్దము. మాబను గదిలో దీపము వెలుగు చుండెను. కందకమున కావలివైపు వంతెనవెనుక నొక చిన్న శబ్దము వినవచ్చెను. నెమ్మదిగ బీగము తీయుచున్న చప్పుడది. ఎవరా పని చేయుచుండిరి? ఏగది వాకిలి బీగమై యుండును? ఇంతలో బీగముచెవి నొక చేతను కత్తి యొక చేతను ధరించి ముఖమున విషపునవ్వు తాండవించుచుండ గూపస్టు దృగ్గోచరుడయ్యెను. ఏద్వారము నాతడు తెఱువ నుండెనో మాత్రము నాకు తెలియలేదు.

మరుసటి క్షణమే - నా స్నేహితులు కోట మహా ద్వారమును చేరగల్గియుండుటకు ముందుగనే - మాబనుగది నుండి హఠాత్తుగ దీపము పడద్రోసిన శబ్దమయ్యెను. గది చీకటియగుయ్యెను. ఆ క్షణముననే 'సహాయము, సహాయము, మైకేల్! సహాయము' అనుట వినబడెను.

నాలో ప్రతి నరమును మేల్కొనియుండెను. అన్నిటి కంటె పైనున్న సోపానముపై నిలిచి కుడిచేతితో వంతెన వాకిలిపిడపను పట్టుకొని వ్రేలాడుచు నెడమచేత ఖడ్గమును పట్టు కొని యుంటిని. వంతెనకంటె ద్వారము వెడల్పుగనుండుట గమనించితిని. అచ్చట చీకటికోణమున నొక మనిషి నిలుచు టకు తగినంత స్థలముండెను. పాకిపోయి నే నచ్చట నిలిచి తిని. ఇప్పు డాత్రోవ నా యధీనమున నుండెను. కావున

నాతో తాడో పేడో తేల్చుకొననిచే యెవ్వరును పాత క్రొత్త దుర్గములమధ్య రాకపోకలు జరుప వీలులేకయ్యెను.

మరియొక కేకయు బలవంతముగ వాకిలితీసిన శబ్దమును వినబడెను. 'వాకిలి తెఱువుము - విషయమేమి?' అని మైకేలఱచెను. నేను జాబులో వ్రాసియుంచిన మేరకు 'సాయము - మైకేల్ - హెంజూ'యను సమాధానము వినవచ్చెను.

డ్యూకు బిగ్గఱగ నఱచుచు దడాలున వాకిలి తోసికొని పోయినట్లయ్యెను. ఆ సమయముననే (నేనున్న పాత కోటలో) నా పైభాగమున నొక కిటికీ తెఱువబడుటయు 'ఏమి సమాచారము'అను పలుకులును వినవచ్చెను. ఒక మనిషి వడివడిగ నడుగులు వేయు చప్పుడయ్యెను. ఖడ్గము సిద్ధముగ నుంచుకొంటిని. డిగబెట్ వచ్చిన నాలుగురిలో నొక్కడు తగ్గెను.

మాంబనుగదినుండి ఖడ్గఘర్షణమును పాదఘట్టనలును క్షతగాత్రుడగు మనుష్యుని యఱపును వినబడెను. ఇది యంతయు జరిగినంత వేగముగ నేను వర్ణింపలేను. అంతయు నొక్క తృటిలో నొక్కసారిగ జరిగిపోయెను. ఆ గది కిటికీ వాకిలి తెఱువబడెను. రూపర్ట్ ఖడ్గధారియై నిలిచియుండెను. ఆతనివీపు నా కగపడుచుండెను. ఆతడు 'ఓహో! జోహానా! మైకేల్, నీకొక్కడు సాయమున్నాడు. రమ్ము.' అని యఱచెను.

జొహాన్ డ్యూకును రక్షించుటకై వచ్చియుండెను. ఆతడు నాకు చెప్పినట్లు కోటవాకిలి నెట్లు తెఱువగలడు? రూపర్ట్ ఆతని చంపెనని నేను భయపడితిని. డ్యూకు హీన స్వరమున 'సాయ' మని యఱచెను.

నే నున్నవైపు మెట్టికెలమీద నడుగుల సవ్వడి యయ్యెను. నా యెడమవైపున - రాజు గదియుండు పార్శ్వమున గూడ - నేదో కదలినట్లయ్యెను. నేనున్న పాత దుర్గమున నేమి యు జరుగకయున్నే ఐదారుమంది కిటికీచెంత రూపర్ట్‌ను చుట్టుముట్టియుండుట కానవచ్చెను. రూపర్ట్ చేతనున్న కత్తిని త్రిప్పుచు కిటికీలోని కెగిరి దానిగుండ అగడ్తలోనికి దుమికెను.

తరువాత నతనిగతి యేమయ్యెను! నేను చూడలేదు. ఎందుకన నాతడు దుముకుచుండగా నాప్రక్కనున్న వాకిలి గుండా డిగ్‌బెట్ ముఖము కనబడెను. నే నొక్క క్షణమైన ననుమానింపక దేవుడిచ్చిన శక్తికొలది కత్తితో వేయగా నాతడు కిక్కురుమనక వాలిటబడి చచ్చెను. ఆతని ప్రక్కన మోకరిల్లి తాళముచెవికొఱకు వెదకి తీసికొంటిని.

ఆగుత్తిలో మూడు చెవులుండెను. అందులో పెద్దదాని నుపయోగించి రాజు గదికిపోవు వాకిలికి వేయబడియుండిన తాళములోనుంచితిని. అది సరిపోయెను. మెల్లగ చెవిత్రిప్పి తాళము తీసితిని. వాకిలి తెఱచి లోనికిపోయి మరల నిశ్శబ్దముగ లోపలి వైపు తాళమువేసి తాళపుచెవిని జేబులో నుంచుకొంటిని అచ్చటినుండి రాజు గదిలోనికి దిగిపోవుటకు సోపానమార్గ

మున్నది. నేను పై సోపానముపై నిలిచియుంటిని.

ఒక గూటిలో నొక చిన్న గ్రుడ్డిదీపము వెలుగుచుం డెను. దానిని చేతబుచ్చుకొని నిలుచుంటిని.

'అది యేమైయుండవచ్చును?' అను మాటలు విన నయ్యెను. ఈమాటలు సోపానముల క్రింద నా కెదురుగానున్న వాకిలి వెనుకనుండి వచ్చెను.

దానికి జవాబుగా 'మన మాతని చంపుదమా' యని వినబడెను.

దాని కేమి జవాబు వచ్చునో యని చెవి యొగ్గితిని. 'కొంచె మాగుము. మనము తొందరపడిన ప్రమాదమగును' అనుచున్న డిచర్డ్ మాటలు వినవచ్చెను.

ఒకక్షణము నిశ్శబ్దమయ్యెను. తరువాత కడు నిశ్శబ్ద ముగ వాకిలి తెఱువబడెను. వెంటనే చేతనున్న దీపమాప్పి యథాస్థానమున చేర్చితిని.

"చీకటిగనున్నది. దీప మారిపోయినది. నీవద్ద దీప మున్నదా?" అను మాటలు వినవచ్చెను. అది బెర్నొనిక్ కంఠము.

వారియొద్ద దీపముండెను. కాని వారు దాని నుపయో గింపగూడదని క్లిష్టసమయ మానన్నమైయుండెను. నేను సోపా నముల దిగిపోయి వాకిలిని తోసితిని. బెర్నొనిక్ వాకిలిగది తీసియుండెను కావున తలుపు తెఱచుకొనెను. బెర్నొనిక్ చేత కత్తియుండెను. డిచర్డ్ గదిలో నొక ప్రక్కన కూర్చొనియుం

డెను. నన్నుచూచుటతో బెర్నొనీర్ ఆశ్చర్యచకితుడై కొయ్యబారి నిశ్చేష్టుడయ్యెను. డిచర్డ్ కత్తికై వెంపజలాడెను. నేను బెర్నొనీర్ పై బడితిని. ఆతడు ధైర్యముగ పోరాడినను కత్తి నుపయోగించుటలో నంత నేర్పరికాడు. ఒక్క నిముసములో నతడు నేలకొఱగెను. తిరిగి చూచునంతలో డిచర్డు లేడు. ఉత్తరువుమేర కాతడు నాతో యుద్ధమునకు పూనుకొనక రాజు గదిని ప్రవేశించి తన పని కుపక్రమించెను.

రాజునందు విశ్వాసముగల వ్యక్తి యొకడు రాజు కొఱకు ప్రాణార్పణ గావింపకుండిన డిచర్డు నిజముగ రాజును నన్నుగూడ చంపియుండును. ఎందులకన వాకిలి త్రోసికొని పోగా నా కగుపించిన దృశ్యమిది: రాజు గదిలో నొకమూల నిలిచియుండెను. వ్యాధిగ్రస్తుడై కృశించియుండెను. కావున నాత డేమియు చేయజాలకుండెను. శృంఖలాబద్ధమగు చేతుల నాతడు నిరుపయోగముగ నటు నిటు కదలించుచుండెను. సగము మతిచెడి యాతడు విపరీతముగ నవ్వుచుండెను. డిచర్డున్ను డాక్టరున్ను గదిమధ్యలో నుండిరి. డాక్టరు డిచర్డుపై బడి యా చేతుల నొకక్షణ మదిమిపట్టియుండెను కాని డిచర్డు ఆతనిపట్టు వదలించుకొని నేను గదిలో ప్రవేశించుచుండగా తన కత్తితో నాతని పొడిచివేసెను. తరువాత నతడు నావైపు తిరిగి "కడపటికి" అనుచు నాపై బడెను. మేమిరువురమును కత్తులతో పోరు సాగించితిమి. ఒక్కమాట మాటాడలేదు. పోరు ఘోరముగ సాగెను. దానిని గుఱించి నాకేమియు జ్ఞాపకము

లేదు. కాని ఆతడు ఖడ్గయుద్ధమున నాకు సముడనిమాత్రము చెప్పగలను. ఆతడు నా యెడమ బాహువును గాఢముగ గాయపఱచెను.

ఈయుద్ధమున నా గొప్పదన మేమియు చెప్పికొనను. నే నెఱిగినంతలో ఖడ్గయుద్ధమున నాత డందెవేసినచేయి. ఆతడు నన్నధిగమించి రాజును చంపి తన ఘాతుకకృత్యమును నెఱవేర్చియుండును. కాని యింతలో సగము పిచ్చియెత్తి నవసి యున్న రాజు "ఓహో! సోదరుడు రూడాల్ఫ్. సోదరా, రూడాల్ఫ్! నీకు తోడువత్తును" అని యఱచుచు నొక కుర్చీ నెత్తుకొని మావైపునకు వచ్చెను. నాలో నాశ రేకెత్తెను.

"రమ్మ. రమ్మ. దానిని వీని కాళ్ళ కడ్డముగ త్రోయుము" అని యఱచితిని.

డిచర్డు కత్తి విసరెను. అది నన్ను తాకలేదు. 'రమ్మ రమ్మ. ఈతమాషాలో పాల్గొనుము!' అని మఱల నఱచితిని. రాజు సంతోషమున నవ్వెను. కుర్చీ నాతనివైపు త్రోసెను.

డిచర్డు వెనుకకెగిరి - ఏమిచేయుచుండెనో నేను చూడక ముందే - రాజుపై కుఱికి భయంకరముగ పొడిచెను. రాజు నిలుచున్నచోటనే హీనస్వరమున దయనీయముగ నఱచుచు నేలవ్రాలెను.

సాహసికుడగు నా ఘాతుకుడు మరల నాపై బడుట కాయత్తుడయ్యెను. కాని తా త్రవ్వుకొన్న గోతిని తానే పడెను. నావైపు తిరుగుటలో తన కత్తిపోటుచే హతుడై యుండిన

డాక్టరు శరీరమునుండి ప్రవహించిన నెత్తురు మడువులో కాలి పుటచే జారి క్రిందపడెను. శరవేగమున నేనాతనిపై బడి గొంతు పట్టుకొని యతడు తేఱుకొనునంతలోనే కత్తి నాతని గొంతు లోనికి దూసి యంత మొందించితిని. తన కాహుతియైన డాక్టరు శవముపై నాతడు కూలిపోయెను.

"రాజు చచ్చెనా?" ఇదియే నా మొదటి యాలోచన. ఆతడు పడియున్న చోటి కుఱికితిని. అతడు చచ్చినట్లే కన బడెను. ఫాలభాగమున పెద్ద గాయముండెను. నే నాతని ప్రక్కన మోకరించి ఊపిరియాడుచున్నదో లేదో యని చెవి యొగ్గి వింటిని. ఇంతలో బయట నొక శబ్దమయ్యెను. ఆ శబ్ద మేమో నాకు తెలిసెను. ఈడ్పువంతెన కందకముపైకి ఈడ్వ బడిన శబ్దమది. నేనును - బ్రతికియున్నచో రాజును - ఇచ్చట పట్టుపడిపోయి యుందుము. చావో బ్రతుకో యాతని యదృ ష్టమనుకొని నేను నా కత్తితో బయటి గదిలోని కేగితిని. ఈడ్పువంతెనను లాగినవా రెవ్వరు? నా వారలా? అయిన నంతయు ననుకూలమే. ఇంతలో డిచర్డురివాల్వరు నా కంట బడెను. దానిని తీసికొని వాలికియొద్ద కేగి శబ్దమేమో వింటిని. శాప్టు వచ్చియుండిన నే నెంతో సంతోషించియుందును. అప్ప టికే నేను చాల అలసిపోయి నీరసపడియుంటిని. ఘాతుకుడగు రూపర్టు ఇంకను నిచ్చలవిడిగ కోటలో తిరుగుచుండెను. విశాల మగు గదిలో నాతని నెదుర్కొనుటకన్న గదిలోనికి వంతెన నుండి దిగివచ్చు మెట్టికెల పైభాగముననుండు ద్వారముకడ -

ఇరుకైనచోట - నాతని నడ్డగించుట మేలని మెల్లగ కాల్జీవ్చు కొనుచు నాచోటు చేరితిని.

రూపర్టు పొంగిపోయి హేళనగ వికటాట్టహాసము కావించుచుండు ధ్వని నా వీనులబడియెను. అందువలన నావారింకను రాలేదు. వచ్చియుండిన రూపర్టును వా రంతమొందించియే యుందురు. గడియారము రెండున్నర కొట్టెను. కోట సింహాద్వారము తెఱువబడలేదు. కందకము గట్టున నేను కనుపింప నంతట యిప్పటికి టార్లెక్హేముకు తరలిపోయి నేనును, రాజును చచ్చితిమని తెలిపియుందురా? వారచ్చటి కేగులోపల వారి మాటలు నిజమగుట కవకాశముండెను. 'రూపర్టు విజయగర్వమున నవ్వుచుండలేదుగదా!' యనుకొంటిని.

ఒక్కనిమిష మేమియు తోచక భీతపరీత చేతస్కుడనై వాకిలి కానుకొని నిలిచితిని. ఇంతలో రూపర్టు "మంచిది. వంతెన వేయబడినది. కుక్కలారా! వెనుకకు పొండు. మైకేల్! రమ్ము. ఆమెకొఱకు పోరాడుము" అని యఱచుట వినిపించెను.

ముగ్గురిమధ్య పోరైన నా పాత్రను యథోచితముగ నిర్వహింపగల ననుకొని బీగముతీసి వాకిలి తెఱచి బయట చూచితిని.

## 19

వంతెన యూవలిపైపునుండి పడుచున్న దీపకాంతి నా కన్నుల మిఱుమిట్లు గొలుపుటచే నే నొక క్షణ మేమియు

చూడజాలక పోయితిని. త్వరలోనే నా కచ్చటి దృశ్యము విస్పష్టముగ కనుపించెను. అది యొక వింత దృశ్యము. వంతెన యథాస్థానమున నుండెను. నూతన దుర్గమువైపు వంతెన ద్వారమున డ్యూకు సేవకుల గుంపొకటి నిలిచియుండెను. ఇద్దఱు ముగ్గురు దీపములు పట్టుకొని యుండిరి. ముగ్గురు నలుగురు ఈటెలు కలిగియుండిరి. వారందఱు గుంపు చేరియుండిరి. వారి ముఖములు పాలిపోయి యాందోళనను సూచించుచుండెను. స్పష్టముగ జెప్పవలయునన్న వారు భయవిహ్వాలురై వంతెన మధ్యభాగమున ఖడ్గధారియై నిలుచుకొని యుండిన వ్యక్తి వైపు రెప్పవేయక చూచుచుండిరి. రూపర్ట్ లాగును అంగీని ధరించియుండెను. ఆతని తెల్లగుడ్డలు రక్తసిక్తములై యుండెను. కాని యాతని యుత్సాహవైఖరిని బట్టి యాతని కెక్కువగ దెబ్బలు తగులలేదని యూహించితిని. ఒకవేళ తగిలియున్నను ఏవో చిన్నవై యుండును. ఆత డచ్చట నిలుచుండి వారిని వంతెనమీదికి రాకుండ నిరోధించుచు మైకేలును పంపుడని గర్జించెను. తుపాకులు లేనందున వారాతని నెదిరింప జంకుచు వారిలో వారు గుసగుస లాడజొచ్చిరి. అందఱికంటె వెనుక ద్వారబంధమున కానుకొని నిలుచుండి జోహాన్ తన చెక్కిలిపై నుండిన గాయమునుండి స్రవించుచుండిన రక్తమును చేతిగుడ్డతో తుడుచుకొనుచుండెను.

అదృష్టవశాత్తు ఆ సమయమున నే నత్యంతానుకూల పరిస్థితియందుంటిని. వంతెన యావలివైపుననున్న పిఱికిపందలు

రూపర్టు నెదుర్కొన జాలకపోయిరి. నన్నుసైత మెదుర్కొన లేరని స్పష్టమయ్యెను. కావున చేతిలోని పిస్తోలుతో రూపర్టును కాల్చిచంపు టొక్కటే నే నప్పటిలో చేయవలసియుండిన పని. నేనాతని వెనుకనుండు టాత డెఱుగడు. నేనేలకో యాపని చేయ లేదు. ఈనాటికీ నాకందులకు కారణ మనూహ్యాముగనున్నది. నే నానాటి రేయి యొక్కని దొంగతనముగ చంపియుంటిని. మరొక్కని యదృష్టబలమున చంపియుంటిని. పరమ దుర్మార్గు డగు రూపర్టును పలువురిలో నొక్కడనుగా నెదుర్కొనుట నాకు రుచింపలేదు. కావుననే కర్తవ్యవిముఖుడనైతి ననుకొందును. రూపర్ట్ 'మైకేల్, మైకేల్, చేతనైన రమ్ము' అని యఱచుచు నొక యంగ ముందుకు వేసెను. మైకేల్ సేవకు లొకింత వెను కఁజవేసిరి.

ఆతని తిరస్కారవాక్యముల కొక స్త్రీవ్యక్తి సమాధాన మిచ్చెను. 'అయ్యో దేవుడా! ఆతడు మృతుడైనాడు.'

'ఆ చచ్చెనా!' యని కేకవేయుచు రూపర్ట్ 'నాకు తెలియకయే మంచి దెబ్బ వేసినాను' అని విజయసూచకముగ నవ్వెను. తరువాత నాతడు 'మీ యాయుధముల నచట పడ వేయుడు. ఇప్పుడు నేనే మీ యజమానిని. ఊఁ. మరల చెప్పు చున్నాను. క్రిందికి వేయు' డనెను.

వా రాతడు చెప్పినట్లే చేసియుందురేమో కాని యింతలోనే కొన్ని నూతన సంఘటనలు సంభవించెను. తొలుత నూతనదుర్గము మహాద్వారమువైపునుండి కోలా

హాలధ్వనులు వినిపించెను. నా హృదయము స్పందించెను. వారు మావారే కావలె ననుకొంటిని. ఆధ్వను లింకను విన బడుచునే యుండెను. తక్కినవా రెవ్వ రాధ్వనుల వినిపించు కొన్నట్లు లేదు. వారి కనుల యెదుట జరుగుచుండు సంఘట నలమీదనే వారి దృష్టి నిబద్ధమైయుండెను. నేవకులు వైదొల గగా నొక స్త్రీ వంతెనపైకి తడబడుచు వచ్చెను. ఆమె మాజిక్. తెల్లని వస్త్రముల ధరించియుండెను. నల్లని శిరోజ ములు భుజములపై వ్రేలుచుండెను. ముఖము మిక్కిలి తెల్ల బారియుండెను. దీపకాంతిలో నామె కన్నులు మెఱసిపోయెను. చేతులు వణకుచుండెను. ఒకచేతిలో పిస్తోలుండెను. ఆమె ముందుకువచ్చి రూపర్ట్‌పై నొక గుండు పారించెను. అది యాతనికి తగులలేదు. మహత్తరప్రయత్నముతో నామె మరల నొకసారి కాల్ప యత్నించెను. బహుజాగ్రత్తగ గురి పెట్టెను దాని నెదుర్కొన సాహసించిన రూపర్ట్ పిచ్చివా డగును. కావున నతడు నావైపునకో యామె వైపునకో త్రోసికొని రావలసియుండెను. వెనుకవైపు నే నాయుధముతో సిద్ధముగ నుంటిని. ఆత డీ రెండుమార్గములను వదలి వంతెన చట్టముపై చేతు లానించి నెమ్మదిగ కందకములోనికి దుమి కెను.

ఆక్షణముననే నే నొక యుఱవును యడుగుల నవ్వడిని వింటిని. అఱచినవాడు శాప్ట్. అతడు 'డ్యూకు మరణించి నాడు' అనెను. వెంటనే రాజునకు నాతో నవసరము తీరి

పోయినదని గ్రహించి చేతనున్న పిస్తోలును క్రిందికినైచి కత్తి ధరించి వంతెనమీదికి పోయితిని. ఎవరో 'రాజు' అని యఱచిరి. తరువాత నేనును రూపర్ట్ వలెనే కందకములోనికి దుమికితిని. ఆతనితో నేదో యొకటి తేల్చుకొనవలయునని కృతనిశ్చయుడనై యుంటిని. ఆతడు నాకంటె పదునైదు గజములు ముందీదుచు పోవుచుండెను.

ఆతడనాయాసముగను వేగముగను నీదిపోవుచుండెను. నేనలసినకతమునను రెట్టపై గాయము తగిలి కుంటువడి యుండినందునను నాతని నందుకొనలేనైతిని. కాని పాతదుర్గము మూల తిరుగునప్పుడు "రూపర్ట్ నిలువు" మంటిని.

ఆతడు వెనుదిరిగి చూచెనేగాని నిలువలేదు. ఆతడిప్పుడు కందకము దరికెక్కుట కెచ్చట వీలున్నదో చూచుచుండెనని నేను గ్రహించితిని. అట్టి యనుకూల మెచ్చటను లేదని నే నెఱుగుదును. కాని నా త్రాడుండెను గదా! నే నా ప్రదేశము చేరుటకు ముందే యాతడచ్చటికి చేరును. నాలో మిగిలిన శక్తిని సమీకరించుకొని ముందుకు సాగిపోతిని.

ఆహా! ఆతడా త్రాటిని కనుగొనెను. సంతోషముతో నాతడద్దానిని పట్టుకొని పైకెగబ్రాకుట కారంభించెను. 'ఈ త్రాడిచ్చటి కెట్లు వచ్చెనో' యని యాతడు గొణిగికొనుట నాకు వినిపించెను. నేనుకూడ త్రాటిని చేరితిని. ఆతడప్పుడే సగముదూరము పైకి పోయియుండెను. ఆతడు నన్ను చూచెను. నేనాతని చేరలేకపోయితిని. ఆతడు గద్గదధ్వనితో 'ఎవరచ్చట'

యునెను. నేనుగూడ తగినంత పాలిపోయియుంటిని. కావున నన్నాతడు రాజని తలంచెను కాబోలు! కాని మఱుక్షణముననే 'ఓహో వేషధారియా! నీవెట్లిచ్చటికి వచ్చితివోయీ!' యనుచు నాతడు గట్టెక్కెను. నేను త్రాటిని పట్టుకొని కొంతసేపు వేచి యుంటిని. ఆతడు గట్టుపై కత్తితో నిలిచియుండెను. నే నెక్కి పోయిన నాతల నాతడు బ్రద్దలు కొట్టవచ్చును. లేదా గుండెను చీల్చవచ్చును. కావున రజ్జువును వర్జించి 'పోనిమ్ము. ఇచ్చట నున్నాను. ఇచ్చటనే నిలుతు' నంటిని. ఆతడు నవ్వెను.

హఠాత్తుగా కోటలోని గంట బిగ్గఱగా మ్రోగుట కారంభించెను. గొప్ప కోలాహల ధ్వని మాకు వినిపించెను. రూపర్ట్ నవ్వుచు చేయూచి నా దృష్టిపథము దాటిపోయెను.

అపాయమును తలంపక నే నొక్క త్రుటిలో త్రాటిని పట్టుకొని పైకెక్కి పోయితిని. ముప్పది గజములలో నాతడు జింకవలె యడవిలోనికి పరువెత్తుచుండెను. ఈ యొక్కపర్యాయము మాత్ర మాతడు తన పనులలో విచక్షణ నుపయోగించి యుండెను. నే నాతని వెన్వెంటి పరువిడ నారంభించితిని. 'నిలువు' మని యఱచితిని. ఆతడు నిలువలేదు. ఆత దక్షత గాత్రుడు. శక్తిసముపేతుడు. కావున ప్రతియడుగున నన్ను మించి పోవుచుండెను.

నే నాతనితప్పు నన్యమెఱుగక యాతని రక్తమును కంట జూడనెంచి తఱుముకొని పోయితిని. త్వరలో జండా యడవిలోని దళమగు చీకటివలన మా యిరువురిమధ్య నఖాత

మేర్పడెను.

అప్పుడు మూడు గంటలు నాముందు నూరుగజములలో రూపట్టు పరుపిడుచుండెను. నే నాయాసముతో నెగబోసికొనుచుంటిని. ఆతడు వెనుదిరిగి చూచి మరల నాసైఘ చేయాచెను. ఒక్కనిమిషము తరువాత నాతడు కుడికి తిరిగి కనుమఱుగయ్యెను.

అంతయు ముగిసినదని తలంచి తీవ్రాందోళనాపరవశుడనై క్రింద కూర్చుంటిని. ఒకస్త్రీ యార్తనాదము వినవచ్చుటచే వెంటనే లేచి లేనిశక్తిని తెచ్చుకొని యెట్లో రూపట్టు నా చూపుదాటి పోయినచోటికి పరువెత్తితిని. అచ్చట నా కాతడు మరల కనుపించెను. అయిననేమి? ఆతని తాకజాలనైతిని. ఆతడొక బాలికను గుఱ్ఱమునుండి దింపుచుండెను. నేను విన్నది నిస్సంశయముగ నామెయఱపే. ఆమె యొక రైతుబిడ్డవలె కానవచ్చెను. భుజమున నొక బుట్ట వ్రేలుచుండెను. జండా మార్కెట్టున కేగుచుండెను కాబోలు. ఆతని దర్శనమాత్రముననే యామె భయభ్రాంతయయ్యెను. ఆతడామెను నెమ్మదిగ ననునయించుచు నవ్వి ముద్దుగొని కొంత పైకమిచ్చెను. వెంటనే యాతడా వాజినెక్కి నాకొఱకు వేచియుండెను. నేనుసైత మాతని రాక కెదురుచూచుచుంటిని.

ఇంతలో నావైపునకు వచ్చి దూరమున నిల్చి యాతడిట్లనెను. 'దుర్గమున నీ వేమి చేసితివి?'

'నీ స్నేహితులలో మువ్వురను ముగించితిని'

'ఏమీ! నీవా గదులయొద్ద కేగితివా!'

'ఔను.'

'రాజు!'

'నేను డిచర్డును చంపుటకుముందే డిచర్డ్ ఆతని గాఢముగ గాయపఱచియుండెను. కాని ఆతడు సజీవుడై యుండునని నా యూహ.'

ఆత డుల్లాసముగ 'ఓరి పిచ్చివాడా' యనెను.

'ఏమది!'

'నీ ప్రాణమును రక్షించితిని. నీవు వంతెనపై నున్న ప్పుడు నీవెనుకనే నేనుంటిని. చేత పిస్తోలుసైత ముండెను.'

'అయిన నే నిరువైపుల నగ్నిలో చిక్కుకొనియుంటి నన్నమాట!'

'గుఱ్ఱము దిగుము. పురుషోచితముగ పోరాడుము.'

'ఆడుదాని యెదుటనా! ప్రభువులవారికి సిగ్గులేదు.' అనెను.

కోపమున మైమఱచి నే నాతని తాకితిని. ఒక్కనిమిష మాత డనుమానించినట్లు కనబడెను. తరువాత గుఱ్ఱపు కళ్లెము లాగిపట్టి నన్నెదిరింప సిద్ధపడెను. మే మిరువురమును భయం కరముగ తలపడితిమి. నా తాకున నాత డప్రతిభుడయ్యెను కాబోలు. లేనిచో నన్నాతడు చంపియుండును; లేదా యిరువుర మును మడిసియుందుము. ఇంతలో మా వెనుకనుండి ఒక కేక వినబడెను. వెనుదిరిగి చూచునరి కొక యాశ్వికుడు మావైపు

నకు వేగముగ వచ్చుచుండెను. అతని చేతిలో నొక పిస్తో లుండెను. అతడు నా నమ్మిన స్నేహితుడు ఫ్రిట్జు. రూపర్ట్ ఆతని గాంచినంతనే పరిస్థితులు విషమించెనని తెలిసికొని ముఖముపై జారిన ముంగురులను వెనుకకు సవరించుకొని ముందుకు సాగిలబడి 'రూడాల్ఫ్, మరల కలిసికొంద' మనెను. ఆతనిచెక్కిలిపై నేను కావించిన గాయమునుండి రక్తము కాలువలై ప్రవహించుచుండెను. ఆత డొయ్యారముగ నాకును కాపువచ్చున కును నమస్కరించి ఫ్రిట్జ్ వైపు చేయూచెను. ఆతడొక గుండు పారించెను. అది యాతని కత్తికి తగిలెను. దానిని క్రింద పడవైచి రూపర్ట్ గుఱ్ఱపుడొక్కలకు మెకిమల నదుముచు ఊగాయించెను. ఆతడు విలాసార్థము స్వారి వెడలినవానియట్లు పాడుకొనుచు దౌడుదీసెను. చెక్కిలిపై నొక గాయ మాతని లెక్క కెక్క లేదు.

నిర్లక్ష్యముగను, హెచ్చరికతోను, అందముగను, ఆనందముగను, అజేయుడుగను నాత డదృశ్యుడయ్యెను. నేను కోపముతో కత్తిని క్రింద వేయుచు ఫ్రిట్జును ఆతని వెన్నంటుమంటిని. కాని యాతడు తన గుఱ్ఱమునాపి దిగివచ్చి నాప్రక్కన మోకరించి 'నాపై చేయి వేసెను. డిచర్డ్ కావించియుండిన గాయమునుండి మరల నిప్పుడు రక్తము స్రవించుచుండుటచే నేలయంతయు తడిసియుండెను. 'అయిన గుఱ్ఱమును నాకిమ్ము' అనుచు నేనాతని చేతిని త్రోసివేయుచు తడబడు కాళ్లతో లేవ యత్నించితిని. కోపబలమున గుఱ్ఱమున్నచోటికి పోగలిగితిని.

ఫ్రిట్జు మగల నా ప్రక్కన మోకరించెను. నేను 'ఫ్రిట్జు' అంటిని. అతడు 'స్నేహితుడా, ప్రియ స్నేహితుడా' యని స్త్రీవలె బహు మార్దవముగ పలుకరించెను.

'రాజు బ్రతికియున్నాడా?'

అతడు చేతిగుడ్డతో నా పెదవులను తుడిచి వంగి నా ఫాలమును చుంబించెను.

'వీర శిఖామణికి అభివందనములు. రాజు సజీవు' డని నెమ్మదిగ చెప్పెను.

కావుపడుచు భయముతో నేడ్చుచు ఆశ్చర్యముతో విస్ఫారితనయనయై మా ప్రక్కన నిల్చియుండెను. నన్నామె జండాలో చూచియుండెను. కాని యిట్టిస్థితిలో కాదు. ఐనను నేను రాజును కానా?

రాజు సజీవుడని తెలిసినంతనే సంతోషమున నఱువ బుద్ధిపుట్టెను. కాని నోరాడలేదు. నా తలను ఫ్రిట్జ్ కానించి కన్నుల మూసికొంటిని. మెల్లగమూల్గితిని. ఫ్రిట్జ్ నన్నపార్థము చేసికొనునేమో యను భయమున కన్నుల తెఱచి నా సంతోషమును ప్రకటింప యత్నించితిని. కాని సాధ్యపడలేదు. నేను చాల అలసియుంటిని. చలి విశేషముగ నుండెను. కావున వెచ్చదనమునకై ఫ్రిట్జ్ శరీరము నొఱసికొని కూర్చుండి కన్నుల మూసికొని మైమఱచితిని.

## 20

జండాదుర్గమున జరిగిన సంఘటనల నన్నిటిని సంపూర్ణముగ తెలిసికొనవలయునన్న నేను స్వయముగ చూచినది చేసినది చెప్పుటకు తోడుగ తరువాత ఫ్రిట్జ్ ద్వారాను మాబను ద్వారాను విన్న సంగతులనుసైతం మిట చెప్పు టవసరము. హెంజూ నవమానముపాలు చేయనెంచి వ్యూహము పన్ని మాబనును 'సాయము - మైకేల్ - హెంజూ' యని యజువు మని సలహా నిచ్చియుంటిని. కాని నే నేర్పఱచిన సమయమున కంటె ముందుగనే వాస్తవముగనే హెంజూ ఆమెను చెనకుటయు నామె బొబ్బలిడుటయు సంభవించెను. ఈ సంఘటన మాయాశల వమ్ము కావించెనని తలంచితిమి. కాని కడపటి కది మా కనుకూలించెనని మాబను కథనమువలన తెలియ వచ్చెను. ఆ దుఃఖభాగిని డ్యూకుపైని ప్రేమచేతనే యాతని కోరికచే గొప్పయాశలతో ప్యారిస్ నుండి రురిటేనియాకు వచ్చి యుండెను.

ఆమె యిట వచ్చిన తరువాత త్వరలోనే డ్యూకు సత్యముగ తనకంటె ఫ్లేవియానే యెక్కుడుగ ప్రేమించుచుండెనని తెలిసికొనగలిగెను. అంతేగాక రాజుయెడ డ్యూకు క్రూర వర్తనమునుగూడ దెలిసికొనెను. కావున నామె మాకనుకూలముగ మాఱిపోయి ఫ్లేవియాను నన్ను హెచ్చరించుచు జాబులు వ్రాసెను. డ్యూకును నిజముగ ప్రేమించుచుండెను గావున నీ చర్యవలన రాజానుగ్రహమును సంపాదించి తన సాయమునకు

బహుమానముగ మైకేలు ప్రాణభిక్షను పొందవచ్చునని యామె విశ్వసించెను.

జండాలో యువకుడగు రూపర్ట్ హూబర్ అందమునకు మరులుగొనియో లేక మైకేలునందలి యసూయచేతనో నామెను చెనకియుండెను. ఎన్నియో దినములనుండి డ్యూకు నకు నాతనికి మధ్య ననేక మనస్పర్ధలు ఘర్షణలు నుండినవి. డ్యూకుగదియందు నేనుచూచిన దృశ్య మట్టివానిలో నొక్కటి. రూపర్టు నాకు కావించిన ప్రతిపాదనల నామె యెఱుగకున్నను నేనావిషయముల నామెకు వివరించిన తరువాత నామె కది యంత వింతగ తోచలేదు. రూపర్టు నొక కంట కనిపెట్టియుం డుమని యామెయే మైకేలును హెచ్చరించియుండెను. వారిరు వురినుండి తన్ను విముక్తను కావింపుమని నన్నర్థించుచునే యుండెను.

ఆరాత్రి యామె తన గది కేగినతరువాత నాగది తాళముచెవిని సంపాదించి రూపర్టు అందు ప్రవేశించెను. అప్పు డామె యఱచెను. డ్యూకు వచ్చెను. చీకటిగదిలో వారిరువురును ఘోరముగ పోరిరి. రూపర్టు తన ప్రభువునే గాఢ[illegible]గ-ప్రాణాంతకముగ-గాయపఱచెను. వెంటనే డ్యూకు సేవకులు త[illegible]సికొనివచ్చిరి. రూపర్టు నే నిదివఱకే వివరించిన రీతిని కిటికీగుం[illegible] తప్పించుకొనిపోయెను. తాను కొట్టిన దెబ్బ తో డ్యూకు చచ్చెనని [illegible]ూపర్టు ఎఱుగడు. కావున నాతనితో సంఘర్షణ సంతటితో సంత[illegible]ించిప నాత డువ్విళ్లూరు

చుండెను. వహాబర్ డ్యూకుగదిలో నేకాకినియై యాత డనువులు బాయువఱకు గాయములకు కట్టు కట్టుయత్నమున మునిగి యుండెను. వంతెనపై నిలిచి రూపర్టు డ్యూకు నతిహేయముగ తూలనాడుచు పిలుచుట విని పగదీర్చుకొననెంచి యాతని నెదిరింపవచ్చెను. నన్నామె కానదు. నేను దాచుకొన్న స్థలమును వీడివచ్చి రూపర్టువెంట కందకములోనికి దుముకు వఱకు నన్నామె చూడనేలేదు.

ఈ సమయమువకు సరిగా నాస్నేహితులు వచ్చిరి. వేళకు సరిగ వారు క్రొత్తకోటను చేరి వాకిలియొద్ద సిద్ధముగ నుండిరి. జొహాన్ డ్యూకు రక్షణకై యితరులతో కూడి వచ్చి యుండెను. కావున నతడు వాకిలి తెఱచుట కవకాశము లేక పోయెను. రూపర్టు నెదుర్కొనుట కాత డందఱికంటె తానే ముందుగా ముందుకు వచ్చెను. తన్నితరు లనుమానింప రాదను నభిప్రాయమున నాత డట్లు కావించి గాయపడెను. సుమారు రెండున్నర గంటలవఱకు శాప్టు దుర్గద్వారమున కాచియుండెను. తరువాత నాయాజ్ఞానువర్తియై నన్ను వెతకు టకై ఫ్రిట్జును కందకమునొద్దకు పంపెను. నే నచ్చట లేను. ఆ విషయమును ఫ్రిట్జు వెంటనేవచ్చి యాతనికి నివేదించెను. అప్పటికిని నేను చెప్పినట్లే చేయనెంచి శాప్టు టార్లన్హీము భవనమున కేగవలయుననెను. ఫ్రిట్జు నన్ను విడిచివెళ్లుట కిష్ట పడలేదు. ఈవిషయమున వారిరువురికిని కొన్ని నిమిషములు తర్జన భర్జనలు జరిగెను. కడపటికి ఫ్రిట్జుప్రేరణమున బెర్క్

స్టీన్ నాయకత్వమున కొందఱిని టార్లక్‌హీమునకు పంపి మార్షలును పిలపింపవలయుననియు, మిగిలినవారు కోటపై దాడి సలుపవలయుననియు నిర్ణయమయ్యెను.

కోటపై బడినవారు కొంతసేపు ప్రయత్నించి మాబర్ రూపర్టుపై గుండును పేల్చినప్పటికి సరిగ ద్వారమును బ్రద్దలు కావించుకొని లోనికి ప్రవేశించిరి. వా రెనిమిదిమంది యుండిరి. మొదట వారు మైకేలు గదియొద్దకు పోయిరి. రొమ్మున కత్తి పోటుతో నాత డచ్చట చచ్చిపడియుండెను. కావున వారచ్చట నుండిన డ్యూకు సేవకులపై బడిరి. వారు భయముతో చేతనున్న ఆయుధములను క్రిందికి వైచిరి. మాబర్ ఏడ్చుచు శాప్టు పాదములపై బడెను. నేను వంతెన యావలివైపున (ప్రాతదుర్గమువైపున) నుండి కందకములోనికి దూకిపోయితి నని ఆమె వారి కెఱిగించెను. శాప్టు 'బంధితుని విషయ మేమి?' యనెను. తనకు తెలియదని యామె తలయూచెను. తరువాత శాప్టు ఫ్రిట్జు తమ వెంట నుండిన వారితో నెమ్మదిగను, నిశ్శబ్దముగను వంతెన దాటిరి. వంతెన కీవలివైపు ద్వారము ననే వారు డిగబెట్ కళేబరమును చూచిరి.

క్రింది గదులనుండి యేదైన శబ్దము వినవచ్చునేమో యని కొంచెము చెవియొగ్గి వినిరి. శబ్ద మేమియు లేదు. కావలి వారు రాజును చంపి గొట్టముద్వారా కళేబరమును కందకము లోనికి త్రోసి తాము నా మార్గమున తప్పించుకొని పోయిరే మోయని వారు తలంచిరి. కాని నే నచ్చటికి పోయియుంటినని

తెలియవచ్చుటచే వారి కింకను కొంత యాశయుండెను. అచ్చట నుండిన సోపాన ప్రవేశమార్గమునకు నేను బీగము వేసియుంటిని గదా! వారిలో నొక్కడు మైకేలు పడియుండినచోటికి పోయి యాతనియొద్ద నుండిన బీగముచెవులను వెతకి తేగా వానిలోని యొకదాని సహాయమున వారా వాకిలిని తెఱచి లోనికి ప్రవేశించిరి. సోపానమార్గ మంధకార బంధురముగ నుండెను. క్రిందనుండిన గదిలో వెలుతురు కనబడుటచే వారు ధైర్యముగ నచటికి దిగిపోయిరి. ఎదుర్చువా రెవ్వరును లేనందున నిరంతరాయముగ వారా గదిని ప్రవేశించిరి. బెర్నొనిక్ అచ్చట చచ్చి పడియుండెను. శాప్ట్ 'ఓహో! ఆత డిచ్చటికి వచ్చినట్లున్న' దనెను. వారు రాజుగదిని ప్రవేశించిరి. డిచర్టు యొక్కయు డాక్టర్ యొక్కయు శవము లచ్చట పడియుండెను. రాజు కుర్చీప్రక్కన బోరగిలపడియుండెను. ఫ్రిట్జు 'ఇతడు చచ్చియున్నా' డనెను. శాప్ట్ ఫ్రిట్జునుతప్ప తక్కినవారిని బయటికిపంపి రాజుప్రక్కన మోకరిల్లెను. గాయముల గుఱించియు, మరణ చిహ్నముల గుఱించియు నాతనికి సాకంటె నెక్కువగ తెలియును. ఆతడు త్వరలో రాజు చావలేదనియు, సరియగు నుపచారములు చేసిన చావుభయముగూడ లేదనియు తెలిసికొనెను. వెంటనే ముఖముపై నొక ముసుగువేసి రాజు శరీరమును వా[illegible] మైకేలుగదికి తరలించిరి. అచ్చట డ్యూకు ప్రక్కన నేడ్చుచుండిన ప[illegible]బ నాతని వదలి వైద్యసహాయము వచ్చువఱకు రాజుతలపై జలసేచ[illegible]ు కావించుచు గాయముల

కట్టుటలో నిమగ్నయయ్యెను. శాప్టు నే నిచ్చటికి వచ్చియుండిన విషయమును మాబర్ కథనమును విన్నతరువాత కందకమునందును, అరణ్యమునందును నన్ను వెతకుటకై ఫ్రిట్జును పంపెను. ఇతరుల నెవరిని పంపుటకు నాతడు సాహసింపలేదు. ఫ్రిట్జు నా గుఱ్ఱమును చూచి నేను గొప్ప ప్రమాదమునకు లోనై యుంటినేమో యని భయాందోళిత మనస్కుడయ్యెను. తరువాత నేను వెనుక వివరించిన విధమున నన్ను కనుగొనెను. అప్పటి యాతని యానందమునకు మేర లేకుండెను. మృత్యుగహ్వరమునుండి విముక్తుడైన స్వీయసోదరుని చూచినప్పటి కంటె నన్ను కనుగొన్నప్పు డాతని యానంద మధికతరమయ్యెను. ప్రేమాభిమానములలో లీనుడై యాతడు రూపర్టును సంహరించువిషయ ముపేక్షించెను. అదిగాక రూపర్టు నాతడు చంపియుండిన నే నెంతో యసూయపడియుందును.

ఈవిధముగ రాజరక్షణము జరిగెను. కాని రాజట్టి విషమస్థితియం దుండెనను విషయమును రహస్యముగ నుంచు బాధ్యత శాప్టుపై నుండెను. మాబర్ జోహార్ ఇరువురును రహస్యగోపనము చేయుదుమని ప్రమాణము కావించిరి. ఫ్రిట్జు అన్వేషింపబోయినది రాజును కాదనియు, దుర్గమున బంధింపబడియుండి పంతెనపై నొక్క నిముసము మైకేల్ సేవకుల యెదుట మెఱుపువలె మెఱసి మాయమైన యాతని స్నేహితునే యనియు చెప్పబడెను. రాజు తన స్నేహితుని బంధవిముక్తుని కావించు సందర్భమున కావలివారిపై బడి పోరి, తుదకు

నెగ్గినను, తీవ్రముగ గాయపడియుండుటచే కోటలోని మైకేలు గదియందు విశ్రమించియుండెనని ప్రకటింపబడెను. ఒకవేళ రాజు స్నేహితుడు కనబడిన నాతని నేరుగ రాజుగారియొద్దకు ఏకాంతముగ కొనిరావలయునని యుత్తరువు కావింపబడెను. రాజుగారి క్షేమవార్త టార్లక్‌హీం భవనముననుండిన మార్షలు నకును ఫ్లేవియాకు వార్తాహరులద్వార తెలుపబడెను. రాజు నభినందించుటకై మార్షల్ హుటాహుటిని రావలసి నదిగ కోరబడెను. రాజచ్చటికి పోవువఱకు లేక భావి కర్త వ్యముల విషయమై వార్త పంపువఱకు ఫ్లేవియా యచ్చటనే యుండవలసినదని తెలుపబడెను. నీచసోదరుడగు మైకేలు కావించిన విద్రోహపూరిత దౌర్జన్యచర్యలనెల్ల సాహసమున నెదిరించి ఆశ్చర్యకరముగ వానినుండి బయటపడిన రా జీవిధ ముగ తిరిగి తనవారిని చేరనుండెను.

తన ప్రియుడు జండాదుర్గమున క్షతగాత్రుడై పడియుండ రాకుమారి ఫ్లేవియా నిశ్చింతగ టార్లక్‌హీం భవనమున నుండ లేకపోయెను. మార్షల్ ఒక చిన్న దళముతో జండాదుర్గము నకు పయనముకాగానే యాతని వెనువెంటనే యామెగూడ రాజును చూచుటకై శకటారూఢయై బయలుదేఱెను. "వెను కటి రాత్రి రాజు జండాదుర్గమున మైకేలు బంధించియుండిన తన స్నేహితులను విడిపించుటకై పోయియుండెను. డ్యూకు ద్రోహియై మీదపడగా నతనిని నతని యనుచరుల గొందఱను హతమార్చి దుర్గమును స్వాధీన పఱచుకొనియున్నాడు. ఆ

సందర్భమున గాటమగు దెబ్బలు తగిలియుండుటచే నాత డచ్చట విశ్రమించియున్నాడు.'' అనువార్త యప్పటికే జండా నగరమం దంతటను పాక్కియుండెను. ఆకారణమున పట్టణమం దుద్రిక్తస్థితి యేర్పడియుండెను.

ఈవిధముగ ఫ్లేవియా జండాదుర్గమునకు వచ్చెను. ఆమె కొండ నెక్కుచుండగా నామె ప్రక్కననే గుఱ్ఱముపై వచ్చు చుండిన మార్షల్ రాజాజ్ఞను శిరసావహించి టార్లన్‌హీము భవనమునకు మరలి పోవలసినదిగ ఫ్లేవియాను ప్రార్థించు చుండెను. ఇంతలో ఫ్రిట్జు జండాదుర్గ బంధితునితో (నాతో) వచ్చెను. అప్పటికి నేను మూర్ఛదేఱియుంటిని. ఫ్రిట్జుభుజ మాధారముగొని నెమ్మదిగ నడచుచు చెట్లమరుగుననుండి ఫ్లేవియాను చూచితిని. ఫ్రిట్జ్ చూపులతోనే నే నామెను కలిసికొనరాదని సూచించుటచే ఒక పొదచాటున దాగు కొంటిని. మమ్మనుసరించి వచ్చుచుండిన కాపుబిడ్డను విస్మరించి యుంటిమి. ఆమె రాకుమారియొద్దకు పోయి నమస్కరించి 'అమ్మా! రాజిచ్చుట నున్నాడు - పొదల మాటున. మిమ్మి చ్చటికి కొనిపోదునా?' యనెను.

మార్షల్:- బుద్ధిలేదు. రాజు గాయపడి దుర్గమున నున్నాడు.

బాలిక:- ఔనండీ. అతనికి గాయములు తగిలియున్నవి. నాకు తెలియును. కాని, ప్రభువుగారితోగూడ ఫ్రిట్జ్ ఇచ్చట నున్నాడు. దుర్గమునకాదు.

ష్లేవియా:- (విభ్రాంతయై) ఆతడు రెండుచోట్ల నున్నాడా? లేక యిరువురు రాజు లున్నారా? అతి డిచ్చ టెట్లుండును!

బా:- ఫిర్జిబ్లు వచ్చువఱ కాత డొక పెద్దమనుష్యునితో పోరు చుండెను. అతడు రాగానే ఆ పెద్దమనుష్యుడు నా యొద్దనుండిన మా తండ్రి గుఱ్ఱమును గైకొని దౌడు తీసెను. రాజిప్పుడు ఫిర్జిబ్లుతో నిచ్చట నున్నాడు. రురి టేనియాలో రాజువలె నింకొక డున్నాడా అమ్మా?

ష్లేవియా 'లేదమ్మా', యని నవ్వుచు నా బాలికకు కొంత డబ్బిచ్చి 'ఆత డెవరో పోయి చూచెద' ననుచు శకటావ తరణము కావింపనుండెను.

ఇంతలో శాప్టె దుర్గమునుండి వచ్చి రాకుమారిని చూచి రాజుగారికి ప్రమాదము తప్పినదనియు క్షేమముగ నున్నా రనియు చక్కని యుపచారములు జరుగుచున్నవనియు నివేదించెను.

ష్లే:- దుర్గముననా?

శా:- మరెక్కడ నమ్మా?

'ఆత డచ్చట - కౌంట్ ఫిర్జిబు సహితుడై యున్నాడని ఈబాలిక చెప్పుచున్నదే'

శాప్టె ఆ బాలికవైపు చూచి సందేహముతో నవ్వుచు 'చక్కగ కనబడు ప్రతి పెద్దమనుష్యుడు నిట్టివారికి రాజే' యనెను.

బాలిక:- లేదమ్మా! అతడు రాజువలెనే యున్నాడు. ఎంత

మాత్రమును భేదము లేదు.

శాప్ట్ అప్రతిభుడయ్యెను. మార్షల్ ముఖభంగిమ ప్రశ్నార్థకమయ్యెను. ఫ్లేవియా దృష్టియు నిశితతరమయ్యెను. అందఱు సంశయాకులమానసులైరి.

శాప్ట్:- (ఆతురతతో) నేనేపోయి యాత డెవ్వరో కనుగొందును.
ఫ్లే:- వలదు. నేనే వత్తును.
శా:- అయిన నొంటరిగ రండు.

అతని ఇష్టప్రకారమే ఫ్లేవియా మార్షలును తదితరుల నచ్చటనే యుండ నియమించి శాప్ట్ సహితయై మేమున్న యెడకు వచ్చెను. శాప్ట్ కాపుపిల్లను దూరమున నుండుమని చేసైగ చేసెను. వారి రాకను చూచి నేను ముఖమును చేతులతో గప్పికొని నేలపై గుప్పగూలితిని. ఫ్రిట్జు నా భుజముపై చేయివైచి ప్రక్కన కూర్చుండెను. శాప్ట్ రాకుమారితో 'ఏమి మాటాడినను చిన్నగా మాటాడవలె' ననుట వినిపించెను. వారు మమ్ము చేరగనే రాకుమారి 'ఇతడు రాజే. దెబ్బలు తగిలినవా?' యనుచు నామె నాప్రక్కన కూర్చుండి నాచేతులను ముఖమునుండి నెమ్మదిగ తొలగించెను. నా చూపులుమాత్రము నేల నొరసియుండెను. 'ఇతడు రాజే! శాప్ట్! నిన్ను ప్రార్థింతును. నన్ను మేలమాడుటకు వీరారు పన్నిన వ్యూహములోని చమత్కార మెట్టిదో వివరింపు' డనెను. మేమెవ్వరును ప్రత్యుత్తర మియ్యలేము. అందఱు మౌనము వహించితిమి. వారిని లెక్కింపక ఆమె తన చేతు

లను నాకంఠమున పెనవైచెను. శాస్ట్ బొంగురుగొంతుకతో మెల్లగ 'ఇతడు రాజుకాదు' అనెను. ఆమె కోపోద్విగ్నయై 'నాప్రియునే నే నెఱుగనా?' యని గర్జించెను. శాస్ట్ మరల 'ఇతడు రాజుకాడు' అనెను. మృదులహృదయుడగు ఫ్రిట్జు నిట్టూర్చెను. వారు హాస్యమాడుచుండుట లేదని యాతని నిట్టూర్పు వ్యక్తపఱచెను. ఆమె 'ఇతడు రాజే. ఇది రాజు ముఖమే. ఇదే రాజు ఉంగరము - నా యంగుళీయకము! ఈతడు నా ప్రియుడే' యని యఱచెను.

శా:- దేవీ! ఇతడు నీప్రియుడే కాని రాజుమాత్రము కాడు. రాజు దుర్గముననున్నాడు. ఈతడు-

ఆమె తనచేతుల నాముఖముపై నుంచి 'రూడాల్ఫ్! నావైపు చూడుము. వారు నన్ను గాసిబెట్ట జేసెదవేల? దీని యర్థమేమో వివరింపు' మనెను.

అంతట నే నామె చూపులో నా చూపును మేళవించి 'దేవుడు క్షమించుగాక! నేను రాజును కాను' అంటిని.

ఆమె నాచెక్కిళ్లు నొక్కుచు తదేకదృష్టితో నా ముఖమువైపు చూడసాగెను. నేను పెదవి కదిపలేదు. ఆమె నన్ను చూచుచుండ విభ్రాంతి రూపొందినట్లును, సంశయము పెరిగినట్లును, భయము మూర్తీభవించినట్లును కనుపించెను. మెల్లగ నామె చేతుల పట్టు సడలెను. ఆమె మాముగ్వురివైపు చూచి చూచి తుదకు నా యొడిలో వ్రాలెను. శాస్ట్ నా భుజమును స్పృశించెను. నే నాతనివైపు చూచి ఆమెను నెమ్మ

విగ నేలపై పరుండ బెట్టితిని. లేచి నిలుచుండి ఆమెవైపు చూచుచు రూపర్ట్‌ఖడ్గమున కెఱగాకుండ నన్ను రక్షించుట నిశితతరమగు నీయావేదన పాల్జేయుటకేనా యని దేవుని నిందింప సాగితిని.

## 21

అది రాత్రి. జండాదుర్గమున రాజు బంధితుడై పడియుండిన గదియందుంటిని. మంటి గొట్టమును తొలగించియుండిరి. కందకమున కావలివైపున నున్న గదిలోని దీపకాంతులు కిటికీగుండ కనుపించుచుండెను. అంతయు నిశ్శబ్దము. పోరాటముల కోలాహల మంతరించెను. నన్నిచ్చటికి పిలుచుకొని వచ్చువఱకు – పగలంతయు ఫ్రిట్జుతోగూడ జండా యడవియందే గడపితిని. శాప్ట్ రాకుమారికడ నుండెను. చీకటి పడిన తరువాత నేనిచ్చటికి వచ్చితిని. గదిలోని కిటికీ కానుకొని నిలిచియుంటిని. జోహాన్ నా కాహారము తెచ్చిపెట్టి 'రాజు క్షేమముగ నున్నాడు. అతడు ప్లేవియూను చూచెను. ఆమెయు, శాప్టును, ఫ్రిట్జును కలిసి చాలసేపు మాటాడుచుండిరి. మార్షల్ స్ట్రెల్సాకు పోయెను. మైకేల్ కళేబరము శవపేటికయం దుంచబడినది. వాని ప్రక్కన మాబర్ కావలి కాయుచున్నది.'

అనుచు నాతడేమేమియో వాగుచుండెను. నే నాతని వంపివైచి ఒంటరిగ నేదో యాలోచనలో పడితిని. నా భావిని గూర్చి నే నాలోచించుచుండలేదు. కొన్ని వారములనుండి జరిగిన సంఘటనలను గూర్చియు, వాని విచిత్ర పరిణామములను

గూర్చియు తలపోయుచుంటిని. నిశ్శబ్ద నిశామధ్యమున జండా కోటపై రురిటేనియా రాజపతాక పటాంచలములు జండా కఱ్ఱను కొట్టుకొనుచుండిన శబ్దము నా కర్ణ గోచరమయ్యెను. మైకేలు జండా యువనతమై యుండెను. రురిటేనియా కేతనమింకెంతమాత్రమును నాకొఱకెగురుచుండుట లేదనుట ప్రయత్నపూర్వకముగ జ్ఞప్తికి దెచ్చుకొంటిని.

ఇంతలో ఫ్రిట్జు గదిలోనికి వచ్చి రాజుగారు నన్ను పిలుచుచున్నారని తెలిపెను. మేమిరువురమును ఈడ్పు వంతెనను దాటి రాజుండిన మైకేలుగదిని ప్రవేశించితిమి.

రాజు శయ్యాగతుడై యుండెను. టార్లెన్హీమునుండి వచ్చియుండిన మా వైద్యుడాతనికి చికిత్స చేయుచుండెను. అల్పవ్యవధితో రాజదర్శనము ముగియవలయునని నా కాతడు సూచించెను. రాజు చేయిజాచి నాతో కరచాలనము కావించెను. వెజ్జుడును ఫ్రిట్జును కిటికీయొద్దకు పోయిరి.

నేను నా వ్రేలికున్న రాజు ఉంగరమును తీసి యాతని వ్రేలియందుంచుచు 'ప్రభూ, దీని గౌరవమును కాపాడ యత్నించితి' నంటిని.

రాజు:- నేను నీతో చాల మాటాడలేను. నిన్ను నా వెంట స్ట్రెల్సాకు కొనిపోయి నీవు చేసిన కార్యముల నందఱకు నెఱుకపఱచి నా యంతరంగ మిత్రునిగ నుంచుకొన నిష్టపడితిని. కాని శాప్ట్ మార్షలులు దీనికి వ్యతిరేకించిరి. వారితో నీవిషయమున నెంతో వాదించితిని.

కాని రహస్య రక్షణము - సాధ్యమగుచో - నత్యంతావశ్యక
మని వారు గట్టిగా వాదించిరి.

నేను:- ప్రభూ, వారి వాదము సమంజసము. నన్ను పోనిండు.
ఇచ్చట నాకర్తవ్యము ముగిసినది.

రాజు:- ఔను. ముగిసినది. అనన్యసాధ్యముగ నెఱవేఱినది.
ప్రజలు మరల నన్ను చూచునప్పటికి గడ్డము పెంచి
యుందును. రోగపీడితుడనై బక్కచిక్కి యుందును.
కాన రాజుముఖమున కానవచ్చు మార్పునకు వా
రాశ్చర్యపడరు. సోదరా! ఇంతకుమించి - నాలో
నేమార్పును గుర్తించుటకు సాధ్యము కానియట్లుండ
యత్నింతును. రాజపాత్ర నిర్వహణక్రమము నీవు నా
కెఱుకపఱచి యున్నావు.

నేను:- ప్రభూ, మీనుండి యెట్టి పొగడితయు నా కంగీకారము
కాదు. నేను మైకేలునకంటె నీచమగు ద్రోహమున
కొడిగట్టితిని.

రాజు ప్రశ్నార్థకముగ నావైపు చూచెను. ప్రశ్నిం
చుట కాతనికి శక్తి లేకుండెను. ఆతని దృష్టి నేను ధరించి
యుండిన ఫ్లేవియా యంగుళీయకముపై ప్రసరించెను. దానిని
గుఱించి యాతడు నన్ను ప్రశ్నించు ననుకొంటిని. వ్రేళ్లతో
దానిని స్పృశించుచు ఆతడు దిండుపై తల వాల్చి, హీనస్వర
మున 'మరల నిన్ను చూచు టెప్పుడో' యనెను.

'ప్రభూ, మరల నెప్పటికైన తమను సేవించు భాగ్య

మబ్బినచో' నంటిని. ఆతడు కనులు మూసికొనెను. ఫ్రిట్జు డాక్టరుతోకూడ వచ్చెను. నేను రాజుచేతిని ముద్దాడి ఫ్రిట్జుతో బయలుదేఱితిని. అప్పటినుండి నే నాతని మరల చూడనేలేదు.

తరువాత ఫ్రిట్జు 'రాకుమారి నిన్ను రాగోరుచున్నది. తరువాత వంతెనయొద్దకు రమ్ము. నేనచ్చట కాచియుందు' ననెను.

నేను ఫ్లేవియాగదిలోని కేగితిని. ఆమె కిటికి ప్రక్కన నిలిచియుండెను. నే నామెయొద్దకు వెళ్లి చేతిని ముద్దాడితిని. ఆమె కదలనూలేదు. మాటాడనూలేదు. లేచి నిలుచుండి యామె వివర్ణవదనమున దృష్టి సారించుచు 'ఫ్లేవియా' యంటిని. ఆమె వెనుదిరిగి చూచెను.

"నిలువకుము - నిలువకుము. గాయములతో గాసి నొందియున్నావు. కూర్చొనుము. ఇచ్చట - ఇచ్చట" ననుచు నన్నొక సోఫాపై కూర్చుండజేసి తానును నా ప్రక్కన కూర్చుండెను. వినయ వినమ్రుడనై నే నామె క్షమాభిక్ష కోర నెంచియుంటిని. కాని మేమామెయెడ పన్నిన వ్యూహమున కామె కుపితయైనట్లుగాని క్షోభపడినట్లుగాని కాన్పింప లేదు. నేనామెయెడ ప్రకటించిన ప్రేమసైతము కపటమా యని యామె కలతజెందుచుండెను. 'నిన్ను నేను మనసార ప్రేమించుచున్నాను. దేవాలయమున - పట్టాభిషేక దినమున - నిన్ను చూచినక్షణమునుండి సదా నిన్ను ప్రేమించు

చుంటిని. కాని నిన్ను మోసగించినందులకు భగవానుడు నన్ను క్షమించుగాక!' యంటిని.

'నీతో వారట్లు చేయించిరి' అని యామె బహుత్వరిత ముగ పలికెను.

'నిందునాటి రాత్రి అన్నివిషయములను నీకు నివేదింప నుపక్రమించునప్పటికి శాప్ట్ వచ్చుటచే నంతరాయ మేర్పడెను. ఆతరువాత తప్పనిసరి యగువరకు నిన్నడబాయ సాహసింపనైతిని. నీకొఱకే పోరాటమును మాని రాజు చచ్చినను చావ నిమ్మనునంతవఱకు వచ్చితిని'.

'తెలియును, నాకు తెలియును. కాని రూడాల్ఫ్! ఇప్పుడు మన కర్తవ్యమేమి?'

'నే నీ రాత్రి వెళ్ళిపోవుచున్నాను.'

'కాదు - కాదు; ఈరాత్రి కాదు.'

'నే నీ రాత్రి - చాలమంది నన్ను చూచుటకు ముందే - వెళ్లియే తీరవలెను.'

'నేను నీతో వచ్చి నీభార్యగా నుండగలిగిన? ఎందుకు కారాదు? నేను నన్ను ప్రేమించుచుంటిని. నీవును రాజువంటి యోగ్యుడవే.'

రురిటేనియా యంతయు నడ్డుపడినను ఆమెతో లేచి పోవలయుననెడి కాంక్షతో నొక్క క్షణమున నా హృదయ మున నింతవఱకు గాఢముగ నాటుకొనియుండిన పవిత్రోద్దేశ్య ముల నన్నిటిని విస్మరించితిని. ఆమెకూడ తొందరపడెనని

తలంచెను. కడపటికామె నావైపు చూచి 'ప్రేమయొక్కటే ముఖ్యమా? అట్లయినచో నీవు రాజును చావనిచ్చియుందువు కదా!' యనెను.

నే నామెచేతిని చుంబించితిని. కొంతసే పూరకుండి తరువాత నామె మరల నిట్లనెను.

'రూడాల్ఫ్! స్త్రీలుకూడ మర్యాదకు కట్టుబడవలసి యున్నది. నేను నావంశమునకు దేశమునకు ద్రోహము చేయక నడచుకొనుటయుండే నా గౌరవ మిమిడియున్నది. దేవు డేల నిన్ను ప్రేమింప నన్ను ప్రేరేపించెనో నే నెఱుగను. కాని నే నిచ్చటనే నిలిచిపోవలయుననుట ఎఱుగుదును'. కొంతసే పూరకుండి మరల 'ఈ అంగుళీయకము నా యంగుళియందును, నిన్ను గుఱించిన యాలోచనలు నాహృదయమునందును నిరంతరముండును. కాని నీవు పోయితీరవలెను. నే నిచ్చట నిలిచియే తీరవలె' ననెను.

నేను లేచి ఆమె చేతిని గ్రహించి 'అటులనే కానిమ్ము. భగవదుద్దేశ్యములు నీయట్టివా రెరుగగలరని తలంతును. ఆతడు నిన్నలరించుగాక' యంటిని.

హృదయభారమున వేగముగ వంతెనయొద్దకు వచ్చితిని. శాప్ట్, ఫ్రిట్జు నాకొఱకచ్చట వేచియుండిరి. వారు చెప్పినట్లు నేను - ఇదివర కెన్నిసారులో చేసినట్లు - దుస్తుల మార్చి ముఖమునకు ముసుగు తగిలించుకొని కోట తలవాకిలి చేరితిని. అచ్చటినుండి మేము ముగ్గురమును గుఱ్ఱముల నధిరోహించి

రాత్రియంతయు పయనించి తెల్లవాఱుసరికి దురితేనిగూ సీమాంతమునకు కొంచెము మావలనుండు నొక చిన్న రైలు స్టేషను చేరితిమి. ఇంకను రైలు వచ్చువేళ కాలేదు. కాచు కొనవలసి వచ్చెను. అప్పుడు వారు నా కిచ్చుటి వార్తల నన్నిటిని చేరవేయుదుమని మాట యిచ్చిరి. నన్ను వారు దయాసాగర మున ముంచి తేల్చిరి. వారు చెప్పినదంతయు నొక స్వప్న మున విన్నట్లుండెను. కడపటికి నే నేమియు వినిపించుకొను స్థితిలో లేనని గ్రహించి మౌనముదాల్చిరి. ఎడబాటువలని ఆవేదన యందఱి మనస్సులను కలచుచుండెను. ఇంతలో మైలుదూరమున రైలుపొగ కనబడెను. వారితో కరచాల నముకావించి నవ్వుచు 'నే డేలనో ముప్పురమును ముగుదలవలె మెలగుచున్నాము. కాని స్నేహితులారా! మనముగూడ అపారపౌరుషమును జూపియున్నాముగదా!' యంటిని.

అందుకు శాఫ్ట్ 'విద్రోహుల నిర్జించి రాజును సింహాసన మున సుప్రతిష్ఠితుని కావించితి' మనెను. ఫ్రిట్జు తటాలున తన శిరోవేష్టనమును తొలగించి నా చేతిని ముద్దుగొని నవ్వుచు 'దేవు డెల్లప్పుడు అర్హుని రాజు కావింప' డనెను.

శాఫ్ట్:- అన్ని పనులును మనము కోరినట్లే నెఱవేఱవు. ప్రతి పనియందును సైతాను చేవాటముకూడ కొంత యుండును.

స్టేషనులోని జనులు నాపై కుతూహలముగ చూచు చుండిరి. వారి చూపుల నేను గమనింపలేదు. రైలు మా

యొద్దకు వచ్చువఱకు మే మచ్చటనే నిలిచియుంటిమి. రైలు రా/గానే మౌనముగ నేను వారితో కరచాలనము కావించితిని. ఈసారి వా రిరువురును - శాస్త్రవిషయమున నిది వింత చర్య - శిరోవేష్టనముల తొలగించి రైలు కనుచూపుమేర దాటువరకు నిశ్చలముగ నిలిచియుండిరి. ఎవరో గొప్పవ్యక్తి విలాసార్థము ఈ చిన్న స్టేషనులో రైలెక్కి పయనము కావించుచుండెనని అచ్చటివారు తలంచిరి. వాస్తవమున కావ్యక్తి నేనే: ఉత్తమ కుటుంబమునకు జెందిన యొక ఆంగ్లేయుడను. ధనముకాని, యధికారముగాని, యున్నతపదవిగాని లేని రూడాల్ఫ్‌రాసింటల్ అనువాడను. ఎల్లవిషయముల నా గెరిగియుండిన నన్నింకను కుతూహలమున కాంచియుందురు. కారణమేమన ఇప్పటి స్థితిలో నే నెట్టివాడైనను మూడుమాసములు రాజుగానుంటిని.

## 22

నా తిరుగుప్రయాణములోని వివరము లంత యాకర్షణీయములు కావు. నేను నేరుగా టైరలుకు పోయి యొక పక్షమురోజులు పరిశాంతముగ కడపితిని. నేనచ్చటికి చేరగనే ఆరోగ్యముగ నుంటిననియు, త్వరలో నిల్లు చేర వచ్చుచున్నా ననియు తెలుపుచు మాయన్న కొక జాబు వ్రాసితిని. మీసాములను గడ్డమును మరల పెంచితిని. టైరలును వదలిన తరువాత ప్యారిస్ చేరి నా స్నేహితుడగు జార్జ్ ఫెదర్లీని చూచితిని. ఆతడు స్ట్రెల్సాలో జరిగిన యుదంతముల గుఱించి తాను విన్న యనేక విషయముల నేకరువుపెట్టెను. దానినిబట్టి యచ్చటి

వాస్తవవిషయములు లోక మెఱుగదని తెలియవచ్చెను.

నే నిల్లువదలి వచ్చునప్పుడు మా వదినెతో చెప్పిన ప్రయాణోద్దేశ్యము లేవియు నెఱవేఱకయే యిల్లు చేరితిని. చాలకాలమువఱకు నా క్షేమసమాచారములగూర్చి తెలుపనందుల కామె నన్ను మందలించెను. సర్ జాకబ్ త్ర్యారలో స్ట్రెల్సాకు రాయబారిగా వెళ్లుచున్నాడనియు నన్నాతడు తనకు సహాయునిగ రమ్మని యాహ్వానించెననియు నామె నాతో చెప్పెను. అందులకు నా విముఖతను తెలుపుచు జేబులోనుండిన ఐదవ రూడాల్ఫ్ బొమ్మ నొకదాని నామెకు జూపుచు 'నేను రురిటేనియా కేగుట యసంబద్ధముగ నుండదా? చూడు' మంటిని. మావదినె ఆ బొమ్మవైపును నావైపును చూచి యాశ్చర్యచకితయయ్యెను.

మాయన్న 5వ రూడాల్ఫ పట్టాభిషేకము చిత్రింపబడిన బొమ్మగల 'ఇల్లస్ట్రేటెడ్ లండన్ న్యూస్' అను పత్రికను వెతకితీసి దానిని నేనిచ్చిన బొమ్మపక్క నుంచి రెంటిని పోల్చిచూడ నారంభించెను నే నాతనితో 'చూచితివా, ఎంత పోలికయున్నదో! కావుననే నే నచ్చటికి పోనొల్ల'' నంటిని. ఆతను నాతో నేకీభవించెను.

మా వదినెమాత్రము తన యభిప్రాయమును మార్చుకొన నిష్టపడక "ఇది యొక సాకు. పనిచేయుట నీ కిష్టములేదులెమ్ము. పోనిమ్ము. రాయబారిగనైన పోవచ్చును గదా?" యనెను.

'నా కదియు నిష్టములేదు'

"అంతకంటె యున్నతపదవి నీ కెప్పటికిని లభింపదు."
అని ఎత్తిపొడిచెను.

ఆమాట నిజమే కావచ్చును. కాని నే నొందియుండిన పదవికంటె నిది యున్నతమైనదిమాత్రము కాదు. ఈపదవి నన్నెంతమాత్రము నాకర్షింపలేదు. నేను రాజుగా నే యుంటిని.

మాఅన్న:- ఆ పత్రికలోని బొమ్మ —

నేను:- ఔను. ఠరిలేనియారాజునకును నాకునుగల సన్నిహిత సారూప్యమును తెలుపుచున్నది.

రాబర్టు: (తలయూచుచు) నేను నట్లేభావించుచున్నాను. అది చాలవరకు నిన్నే పోలియున్నది.

నేను:- ఎట్లయిన నేనుమాత్రము స్ట్రెల్సాకు పోను.

రాబర్టు:- రూడాల్ఫ్! వలదు. పోవలదు.

ఆత డనుమానించెనో లేక సుంత సత్య మెఱిగియుండెనో నాకు తెలియదు. కాని యేమైనను మేమా విషయమునే మరల ప్రస్తావింపలేదు. జాకబ్ తనవెంట మరెవ్వరినైన పిలిచికొని పోవచ్చునని యాతనికి తెలిపితిమి.

నే నిప్పు డొక పల్లెప్రాంతములోని నివాసమున శాంతముగ కాలము వెళ్లబుచ్చుచుంటిని. నా కే విషయమునందు నానక్తి లేదు. నాచుట్టు నుండువారు నన్ను సోమరియనియు, స్వాప్నికజగత్తున నివసించువాడననియు, సహవాసయోగ్యుడను

కొననియు తలంచుచుందురు. అయినను నేను యువకుడను. ఎప్పుడో యొకసారి యేదోవిధముగ మరల గొప్ప సంఘటనలలో పాల్గొను నవకాశమున్నదని నమ్ముచున్నాను. అట్టివి నా తలపులు! అవి ఎంతవఱకు ఫలోన్ముఖములగునో చెప్పలేను.

భావినిగూర్చి యిట్లు భావించుచు నొక్కొక్కప్పుడు జరిగిపోయిన సంఘటనలగూడ సింహావలోకనము కావించు కొనుచుంటిని. ఆ సందర్భములలోనెల్ల హెంజూ నా తలపున తగులుచుండును. ఆతని తలచినంత మాత్రమున నే నుద్రిక్తుడ నగుచుంటిని.

ఏడాదికొక్కసారి నా ప్రశాంతతకు భంగము కలుగుచుండును. నేను డ్రెస్డన్కు పోవుచుందును. ఫ్రిట్జ్ నన్నచ్చట కలిసికొనును. వెనుకటిసారి అతడు తనభార్య హెల్గాతోగూడ వచ్చియుండెను. మేమచ్చట సంతోషముగ కాలము వెళ్ళబుచ్చుచు శాప్ట్, రాజు, రూపర్టు, ఫ్లేవియా వీరిని గుఱించి సంభాషించుచుంటిమి. ప్రతియేడును ఫ్లేవియా నాకొక చిన్న పేటిక నంపుచుండును. అందులో నొక ఎఱ్ఱ గులాబియు, దాని కాడకడ నొక చిన్న కాగితపుముక్కయు దానిపై 'రూడాల్ఫ్ - ఫ్లేవియా - నిరంతరము' అనుమాటలు నుండెడివి. ఆతనిద్వారా నేనుసైత మట్టి ప్రతిసందేశము నంపుచుంటిని. ఆ సందేశము - అంగుళీయకములు - ఇవిమాత్రమే యిప్పుడు నన్నును రురిటేనియారాణిని బంధించుచున్నవి. కారణ మేమన

తనబాధ్యతను గుర్తించి స్వార్థమును బలిగావించి రాజుభార్యగా నుండ నంగీకరించుటచే నే నామె నొక దివ్యవ్యక్తిగా గౌరవించుచుంటిని. ప్రపంచములోని దివ్యస్త్రీలలో నొక్కతెను నేను ప్రేమించుచున్నందునకును, నామెకు నా ప్రేమ స్వధర్మనిర్వహణమున కాటంకముగ పరిణమింపకున్నందులకును భగవానుని నభినందించుచున్నాను.

53 నుండి 186 పేజీల వఱకు రఘునాథ్ ప్రెస్‌నందు
ముద్రింపబడినది.

# సవరణలు

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 19 | యాసాధ్యమేమో | యసాధ్యమేమో |
| 7 | 5 | వ్యతిలేకత | వ్యతిరేకత |
| 8 | 8 | దస్తుల | దుస్తుల |
| 8 | 18 | సానము | స్థానము |
| 19 | 6 | వేరు | పేరు |
| 19 | 12 | రాసండల్ | రాసిండల్ |
| 19 | 13 | బర్ల్స్డకు | బర్ల్స్డక్ |
| 19 | 13 | కుటుంబమునను | కుటుంబమునకు |
| 20 | 8 | ఆశ్చర్యచకితుడ నెతిని | ఆశ్చర్యచకితుడనైతిని. |
| 21 | 6 | విభ్రాంతుడనైన | విభ్రాంతుడనైన |
| 21 | 16 | తన్నుబోలియుండుటను రాసిండల్ | రాసిండల్ తన్నుబోలియుండుటను |
| 22 | 1 | కాల్చుచు | కాల్చుచు |
| 24 | 1 | ఫిట్జ్ | ఫ్రిట్జ్ |
| 25 | 6 | నొక్కుచుక్క | నొక్కచుక్క |
| 28 | 4 | ప్రిట్జ్ | ఫ్రిట్జ్ |
| 28 | 8 | వడయుండ | పడియుండ |
| 34 | 16 | (సైనికోద్యోగి; | (సైనికోద్యోగి) |

| | | | |
|---|---|---|---|
| 35 | 13 | తన్ను చూచి | నన్ను చూచి |
| 35 | 17 | తడలి | తడవి |
| 38 | 15 | అవనతశరీరస్మై | అవనతశరీరయై |
| 39 | 4 | వ్యక్తినను | వ్యక్తినని |
| 40 | 9 | నేను: (మృదువుగ) | నేను మృదువుగ |
| 41 | 15 | యాతనితో | యాతనిలో |
| 42 | 7 | మాత్రమే. | మాత్రమే |
| 42 | 12 | రూకాకుడై | రూక్షాక్షుడై |
| 44 | 18 | వాకును | నాకును |
| 45 | 21 | | కడపటివాక్యము వేరే పేరా |
| 46 | 7 | డ్యూక్యై | డ్యూకే |
| 46 | 10 | పేల్చు | ప్రేల్చు |
| 46 | 18 | శబ్ధము | శబ్దము |
| 47 | 6 | నిసములు | నిముసములు |
| 47 | 19 | చూతున | చూతును |
| 48 | 2 | ప్రవేసించితిమి | ప్రవేశించితిమి |
| 51 | 18 | దుండగేంద్రకును. | దుండగేంద్రకును |



1 నుండి 52 వ పేజీవఱకు ‘ అరుణ ప్రింటర్సు ’ లో ముద్రితము.